# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

### నాల్గవ భాగము






సంపాదకుఁడు:

విద్యాభూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు



ప్రకాశకులు:

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణపురము

గుంటూరు - 6

# శ్రీరామానుజ కీర్తి కౌముది

నాల్గవ భాగము

మొదటి ముద్రణము
వేయి ప్రతులు

రుధిరోద్గారి వసంతము
జూన్ 1983

రామానుజ శకము : [illegible]

మూల్యము :

రూ. 25/=

ముద్రణ :
శ్రీపతి ఆర్టు ప్రింటర్సు
గుంటూరు

శ్రీ రామానుజ కీర్తి కౌముది

## సమాలోచన సమితి



మహా కవి - వాచస్పతి - కళా ప్రపూర్ణ
డాక్టర్ : వానమామలై వరదాచార్యులు
చిన్నూరు

మహా కవి - సరస్వతీ పుత్ర - కళా ప్రపూర్ణ - పద్మశ్రీ
డాక్టర్ : పుట్టపర్తి నారాయణాచార్యులు
క డ ప

వ్యాకరణ విద్యా ప్రవీణ - భాషా ప్రవీణ
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M. A.
విశాఖ పట్టణము

సాహిత్య రత్న - భాషా ప్రవీణ
శ్రీమాన్ కె. టి. యల్. నరసింహాచార్యులు
శ్రీ గోదా గ్రంథమాలా సంపాదకులు
మునునూరు

సంగీత సాహిత్య కళానిధి
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు
ఆకాశ వాణి - విలయ సంగీత విద్వాంసులు
వి జ య వా డ

బాల విద్యా శ్రీ-వి

శ్రీమాన్ కె. వి. వి. యల్. నరసింహాచార్యులు, M.A., B.L.
అడ్వొకేటు - గుంటూరు.

చతుర్విధ కవితా చతురానన - మహా కవి

శ్రీమాన్ విక్రాల శేషాచార్యులు
కలికివాయ

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి

శ్రీమాన్ కోమాండూరు రామానుజాచార్యులు
కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు
సీనియర్ తెలుగు పండితులు - Z.P. హైస్కూలు
కందుకూరు

న్యాయ విద్యా ప్రవీణ

డాక్టర్ : యస్. బి. రఘునాథాచార్యులు, M.A; Ph. D.
సంస్కృత శాఖ : శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయము
కోఆర్డినేటర్ ; వల్లికేషన్స్, తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

సాహిత్య విద్యా ప్రవీణ

శ్రీమాన్ చలమచర్ల వేంకట శేషాచార్యులు
సంస్కృతోపన్యాసకులు ;
శ్రీ వేంకటేశ్వర వివేక వర్ధిని సంస్కృత కళాశాల
హైదరాబాదు

శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు

M. A. (Pol), M.A. (Pub - Adm) ; D I S

లెక్చరర్ :- ఆంధ్ర ప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి

నాగార్జున సాగర్ - విజయపురి సౌత్

శ్రీమాన్ శ్రీపెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M. A.

ఉపన్యాసకులు :- శ్రీ వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్య కళాశాల

పా లె మ్

కవి కోకిల - విద్వత్కవి - కావ్య కళా నిధి

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు

ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి సభ్యులు

సి ద్ది పే ట

డాక్టర్ : కె. సుప్రసన్నాచార్యులు, M.A.; Ph. D.

తెలుగు రీడరు :

కాకతీయ విశ్వ విద్యాలయము

వ రం గ ల్






శ్రీనివాసాయ నమః

శ్రీమతే రామానుజాయ నమః

# తెలుఁగు వెలుఁగు

శ్రీ వైష్ణవ సంప్రదాయము భారత దేశమున చిర కాలము నుండియు ప్రచలిత మగుచునే ఉన్నది. వేద శాస్త్ర పురాణేతిహాసములు ఈ సంప్రదాయమునకు పరమ ప్రమాణములు. ఈ సంప్రదాయమును సమాశ్రయించి తరించినవా రెందరో కలరు. మఱియు ఈ సంప్రదాయమును బహు ముఖములుగా సముల్లసింపఁ జేసినవారును అనేకు లున్నారు. అట్టి వారిలో - ఆళ్వారాచార్యులు అగ్ర గణ్యులు. పరమ పవిత్రములైన ఆ మహనీయుల జీవిత విశేషములు గల గ్రంథములు వివిధ భాషలలో కొన్ని వెలువడి యున్నవి.

సంస్కృతములో ; -

1) భార్గవోప పురాణమునందలి మహాయోగి మాహాత్మ్యము

2) దివ్య సూరి చరితమ్ — గరుడ వాహన పండితుఁడు

3) ప్రపన్నామృతమ్ — అనంతాచార్యులు

4) దివ్య సూరి కథామృతమ్ — ప్ర. భ. అణ్ణంగరాచార్యులు

5) దివ్య సూరి వైభవమ్ — జగ్గు వేంకటాచార్యులు

6) ఉపదేశ రత్నమాలా

| | | |
|---|---|---|
| | (వరవర మునుల తమిళ మూలమునకు సంస్కృతాను వాదము) | వరవరమునుల పౌత్రుఁ డగు అభిరామ వరులు |

తెలుఁగులో :—

| | | |
|---|---|---|
| 1) | ఆముక్త మాల్యద | శ్రీకృష్ణ దేవరాయలు |
| 2) | ఆచార్య సూక్తి ముక్తావళి | నంబూరు కేశవాచార్యులు |
| 3) | పరమ యోగి విలాసము (ద్విపద) | తాళ్ళపాక తిరువేంగళనాధ సూరి |
| 4) | పరమ యోగి విలాసము (పద్య కావ్యము) | సిద్ధిరాజు తిమ్మరాజు భూపాలుడు |
| 5) | ఆచార్య రత్నహారము | వంగిపురము సీతారామకవి |
| 6) | ఆళ్వార్ వైభవము | ప్ర భ అణ్ణంగరాచార్యులు |
| 7) | దివ్య సూరి ప్రభావము | ,, |
| 8) | గురు పరంపరా ప్రభావము (తమిళమునుండి అనువాదము) | అనువాదకులు : కొమాండూరు అనంతాచార్యులు |
| 9) | ఆళ్వార్ ఆచార్యుల చరిత్ర | పండిట్ : టి. లక్ష్మణాచార్యులు |
| 10) | మహా భక్త విజయము | మేడేపల్లి వేంకట రమణా చార్యులు |
| 11) | నిత్యానుసంధానము ('పరిమళోల్లాస' వ్యాఖ్యా సహితము) | టి. కె. వి. యన్. సుదర్శనా చార్యులు |
| 12) | ముముక్షు జన కల్పకము | |
| 13) | పరమ భాగవత చరిత్రము | గణపవరపు వేంకటకవి |

14) పరమ భాగవత చరిత్ర — కట్టా వరదరాజు
15) శ్రీ రామానుజ ప్రభావ కల్పకము — బుక్కపట్టణం నరసింహాచార్యులు
16) ఆళ్వారులు - దివ్య ప్రబంధము — ధనకుధరం వరదాచార్యులు
17) ద్వాదశ సూరి చరిత్ర — కె.టి.యల్. నరసింహాచార్యులు
18) ఆళ్వారుల దివ్య వైభవము — టి. రాఘవయ్య
19) రామానుజాచార్యులు — ఆర్. పార్థసారథి
20) రామానుజ ప్రతిజ్ఞ — ఎమెస్కో ప్రచురణ
21) దివ్య సూరి చరిత్రము — ఎస్. టి. వి. రాఘవాచార్య

అరవములో :-

1) గురు పరంపరా ప్రభావము — పిన్బళగియ పెరుమాళ్ జీయర్
2) ఆళ్వార్ కాల నిలై — పండిత: యం. రాఘవయ్యంగార్
3) ద్రావిడ మునివర్ గళ్ — రాధాకృష్ణ పిళ్ళై

హిందీలో :-

1) ఆళ్వార్ వైభవ్ — ప్ర. భ అణ్ణంగరాచార్య
2) భక్తి కా వికాస్ — డా : మున్షీరామ్‌శర్మా
3) భక్తి ఆందోలన్ కా అధ్యయన్ — డా : రతిభానుసింహ నాహర్
4) ఆళ్వార్ భక్తోం కా ఏక్ అధ్యయన్ ఔర్ కృష్ణ భక్తి కావ్య — డా : మాలిక్ మొహమ్మద్
5) వైష్ణవ సంప్రదాయోం కా ఏక్ అధ్యయన్ ఔర్ సిద్ధాంత్ — ఆచార్య: బలదేవ ఉపాధ్యాయ

ఆంగ్లములో :-


| | | |
|---|---|---|
| 1. | Alvar Saints | Swami Suddhananda Bharati |
| 2. | The Holy Lives of the Azwars or Dravid Saints | A. Govindacharya |
| 3. | The Hymans of Alvars | J. S. M. Hooper |
| 4. | Alvars of South India | K. C. Varadachari |
| 5. | Divine Wisdom of Dravid Saints | A. Govindacharyulu |
| 6. | Life and Teachings of Ramanuja | C. R. Srinivasa Aiyangar |
| 7. | Life of Ramanuja | Swami Ramakrishnananda |
| 8. | History of Tirupati | Dr.S. Krishna Swami Ayyangar |
| 9. | Grains of Gold | R. S. Dasikan |
| 10. | History of Srivaisnavas | T. A. Gopinatha Rao |
| 11. | History of Indian Philosophy | Dr, S. N. Das Gupta |
| 12. | Out Lines of Indian Philosophy | Prof : Hiriyana |
| 13. | The Philosophy of Visistadvaita | P. N. Srinivasachayulu |
| 14. | Vaishnavism Saivism and Other minor Rgligius sect | Dr. R. G. Bhandarkar |
| 15. | History of Tamil Liturature | E. S. Varadaraja Iyar |
| 16. | History of Tamil Language and Liturature | Prof : S. Vaiyapuri Pillai |
| 17. | Life of Ramanujacharyulu | A. Govindacharya |
| 18. | Indian Philosophy | Dr. S. Radhakrishnan |
| 19. | Mistic and Misticism | P. N. Srinivasachari |
| 20. | Vaishnavit Reformars of India | T. Rajagopalachari |
| 21. | Early History of Vaishnavism in South India | Dr. S. Krishnaswami Aiyangar |

22. A Metaphysiqae of Misticism } A. Govindacharya swami

23. Pearls of Truth — M. R. Appadurai

24. Vaishmavite Mysticism — V. K. S. N. Raghavan

పై పట్టికలో నుట్టంకింపఁబడిన గ్రంథములే గాక, ఇంకను అనేక గ్రంథములు - ఆళ్వారాచార్యుల వైభవమును, ప్రభావమును వేనోళ్ళ చాటుచున్నవి. ఆ మహనీయులు సంస్కృత ద్రావిడ భాషలలో రచించి అనుగ్రహించిన గ్రంథ రాజములు ముముక్షువులకు మార్గ దర్శకములై యలరారుచున్నవి.

అట్టి ప్రాచీన అర్వాచీన గ్రంథములలో నిక్షిప్తము లగు సంప్ర దాయ రహస్యములను, విజ్ఞాన విశేషములను సంగ్రహముగా - తేట తెన్గున, 'శ్రీరామానుజ కీర్తి కౌముది' ద్వారా- లోకమున కందింపవలె ననియే మా తలంపు. పదునారు కళలుగా వెలువడుచున్న అట్టి 'కౌముది' గ్రంథ పరంపరలో ఇది నాల్గవది. ఈ 'చతుర్థి'యు -చతుర పాఠక చకోరములకు ఆత్మ సంతర్పణము గావింపఁగల దనియే మా విశ్వాసము.

ఈ గ్రంథ ముద్రణమునకు ఆర్థిక సహాయము గావించిన తిరుమల తిరుపతి దేవస్థానముల వారికిని, ఋణ సహాయము చేసిన పట్టాభిపురము - ఆంధ్రా బ్యాంకు వారికిని, 'సదరు' ఋణ సహాయ మునకు 'ఆమోద ముద్ర' వేసిన రీజినల్ మేనేజరు గారికిని ఇందుమూల మున మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నాము.

— ప్రకాశకులు

# విషయానుక్రమణిక

శ్రీ వేంకటేశ్వర స్తుతి మాలిక 1—8
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు

పరమార్థ తత్త్వము 9—21
శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు
సృష్టి - మానవుడు
మానవుడు - జ్ఞానము
జ్ఞానము - అజ్ఞానము
జ్ఞాన సాధనములు
ఆచార్యోపాసనము - భగవదనుగ్రహము
భగవచ్ఛబ్దార్థము
షడ్గుణ విశేషములు
పంచావతారములు
అర్చావతార వైభవము
భగవత్కటాక్షము - పరమార్థప్రాప్తి

శ్రీ నమ్మాళ్వారుల వైభవము 22—60
శ్రీమాన్ టి కె వి. యన్. సుదర్శనాచార్యులు
మంగళాచరణము
చరిత్ర సంగ్రహము
శ్రీవకుళాభరణుల అవతార వైభవము
నమ్మాళ్వారుల దివ్య ప్రబంధ దివ్యానుభవము
నమ్మాళ్వారుల అవతార ప్రమాణములు
శ్రీ నమ్మాళ్వారులే ప్రపన్న జన కూటస్థులు
శ్రీ శఠకోప మునీశ్వరులు - శ్రీ శఠకోపము
దివ్య ప్రబంధ వైభవ సంగ్రహము

# శ్రీ వేంకటేశ్వర స్తుతి మాలిక

విద్వత్కవి - కవి కోకిల

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు



శ్రీ మహిళా మనోహర ! విరించి హర ప్రముఖామరార్చితా !
కామిత దాయకా ! వికచ కంజ దళేక్షణ ! భక్త రక్షణా !
శ్యామల వర్ణ శోభిత శుభాంగ ! దయా మృదులాంతరంగ ! శో
భా మహనీయ హేమ ఘన భాసుర గోపుర వేంకటేశ్వరా !

బంగరు గోపురంబులును - బంగరు రంగు చెలంగు ముంగిళుల్
బంగరు వాహనంబులును - బంగరు చెంగుల పట్టు పుట్టముల్
బంగరు ద్వార దేశములు - బంగరు సొమ్ములతో వెలుంగు మా
బంగరు తండ్రి వీవు కద ! భవ్య గుణాకర ! వేంకటేశ్వరా !

కొంగు పసిండి యాశ్రితులకున్, భజియించెడు దీన కోటికిన్
ముంగిటి పెన్నిధానమును, మ్రొక్కెడు వారికి సన్నిధాన మౌ
తంగెటి జున్ను, ఆర్తులకు దగ్గరి చుట్ట మటంచు నెప్డు ని
న్నుం గొనియాడు లోకము మనోహర మందిర ! వేంకటేశ్వరా !

ఎండల రీతి కల్మషము లెంతయు తాపము గల్గ జేసినన్
దండిగ మాకు నీ యడుగు దామర నీడలు చాలు - కష్టముల్
కొండల భంగి పైనఁ బడి కొందల పెట్టిన నైన నేమి నీ
కొండయె యండ మాకు నవ కుంద సుమస్మిత ! వేంకటేశ్వరా !

తామరసేక్షణా ! సకల దైవ లలామ ! వినీల నీరద
శ్యామ ! విశిష్ట ధామ ముని సన్నుత పావన నామ ! సద్గుణా
రామ ! దురాత్మ దానవ విరామ ! త్రివిష్టప సార్వభౌమ ! నీ
కోమల పాద పద్మములకున్ బ్రణమిల్లెద వేంకటేశ్వరా !

లోకము లెల్ల నీ కడుపులోఁ గదలాడుచునుండ, నిశ్చల
త్వాకలనన్ జెలంగు పరమాద్భుత దైవము నీవు - తావకా
లోకము లోక జీవన నిరూపణ హేతువు - పాద తోయ దూ
రీ కృత పాప పంక ముఖరీ కృత నూపుర ! వేంకటేశ్వరా !

కప్పురపుం బరాగములు క్రమ్మిన యట్టులు, కమ్మ తేనియల్
చిప్పిలి నట్లు, గందవొడి చిందిన యట్టులు అన్నమయ్య తా
ముప్పది రెండు వేల పదముల్ మృదువుల్ నినుఁ గూర్చి భక్తితోఁ
జెప్పెను ధన్యతా గరిమఁ జెందెను మా వర ! వేంకటేశ్వరా !

సుందర మందహాస పరిశోభిత దివ్య ముఖారవింద ! గో
వింద ! ముకుంద ! యోగి జన బృంద హృదబ్జ మిళింద! పక్షిరాట్
స్యందన ! భక్త లోక హరి చందన ! దీనులవింద ! సంతతా
నందమయాకృతీ ! నళిన నాభ ! కృపాకర ! వేంకటేశ్వరా !

అకళంకోజ్జ్వల చంద్ర బింబ వదనంబై, కంబు కంఠంబునై
సకలాభీష్టద దక్ష సద్వరద హస్తంబై, ప్రభా పూర్ణ ర
త్న కలాపాంచిత సుందరాంగక కదంబంబై విరాజిల్లు తా
వక దివ్యాకృతి లోక మోహనము దేవా ! వేంకటేశ ప్రభూ !

కలుషము లెల్ల బాపగను, గష్టములన్ దొలగింపఁగా, వరం
బులు దయసేయఁగ సతము బ్రోవగ, శ్రీయము సంగ్రహింపఁగాఁ
గలతలు దీర్చి యాదుకొనఁగా నినుఁ బోలిన దొడ్డ దైవ మీ
యిల పయి లేఁడు లేఁడనుచు నెంతయు గొంతుక విచ్చి,యేడు కొం
డల పయినెక్కి చాటెద జనార్దన ! కేశవ ! వేంకటేశ్వరా !

నేత్ర జితాబ్జ మిత్ర ! ముఖ నిర్జిత పూర్ణ శశాంక ! నీ కొగిన్
బత్రమొ, పుష్పమో, ఫలమొ భక్తి నొసంగెడి వారి కైహి కా
ముత్ర ఫలంబులిత్తువు ప్రభూ ! భవదీయ దయా ప్రభావముల్
చిత్రములై యెసంగు సఫలీకృత ! వాంఛిత ! వేంకటేశ్వరా!

గొడుగై, మెత్తని పానుపై, సుఖముగాఁ గూర్చుండగాఁ బీఠమై
యడుగుం దామర లుంచఁ బీటయయి నిత్యం బాదిశేషుండు పెం
పడరంగా నినుఁ గొల్చువాఁ డిపుడు దివ్యత్ సప్త శైలాకృతిన్
బడి సేవించుచునుండె నిన్ను మృదు భావా ! వేంకటేశ ప్రభూ!

ఓ కమలా మనో రమణ ! ఓ భువన త్రియ సృష్టికారణా !
ఓ కరుణా గుణాభరణ ! ఓ ఘన సంసరణాబ్ధితారణా !
ఓ కలుషౌఘ సంహరణ ! ఓ శ్రితలోక విప న్నివారణా !
ఓ కరిరా డ్వ్యథా హరణ ! ఓ గిరి ధారణ ! వేంకటేశ్వరా !

గాణల పాటలన్, శ్రుతి సుఖం బగు మంగళ వాద్య ఘోషపుం
బోణిమి, వజ్రపున్ రుచుల ముగ్గులు, సంతత దీప్త దీపికా
శ్రేణులు, వేద పాఠము లసించెడు నీ నిలయంబు నిత్య క
ల్యాణము పచ్చ తోరణమునై విలసిల్లును వేంకటేశ్వరా !

తూరుపు దిక్కునన్ వెలుఁగు తోచియుఁ దోచక మున్నె వాయు సం
చారము చల్ల చల్లగను సాగగ, తావక సుప్రభాత గీ
తా రవముల్ జగ త్త్రియము నంతకు చక్కని మేలుకొల్పులై
వారక భావ సంపదను వర్ధిలఁ జేయును వేంకటేశ్వరా !

అలమే ల్మంగ కనుం గవన్ మెఱయు నవ్యాలంక్రియా స్నిగ్ధ క
జ్జల రేఖా మృదు రూప ! రత్న మయ భూషా వేష ! పద్మాలయా
లలనా ముగ్ధ కపోల పాళికలపై రాజించు కస్తూరికో
జ్జ్వల పత్రాంగుళి మంగళాకృతి విలాసా ! వేంకటేశ ప్రభూ !

నెల వంకల్ నలు వంకలన్ జిలుగు వన్నెల్ చింద చందాన ని
స్తులమౌ వజ్ర విభూషణ ప్రతతి కాంతుల్ దిక్కులన్ బ్రాకగాఁ
గొలువై శోభిలుచున్న నిన్ను గని భక్తుల్ ముక్తి సౌధాగ్ర సీ
మలకున్ దారులు వేసికొందు రట శ్రీమ ద్వేంకటేశ ప్రభూ !

రాకాచంద్ర సమాన మంజు వదనా ! రాజీవ పత్రేక్షణా !
నీ కారుణ్య రసంబు నా పయిని సుంతే జిల్కినన్ జాలు - లీ
లా కల్పంబుగఁ బున్నెపుం బువుల మాలల్ చుట్టెదన్ ముక్తి క
న్యా కంఠంబునఁ బుస్తె గట్టెదను దేవా ! వేంకటేశ ప్రభూ !

హిమకరుఁడున్ బ్రభాకరుఁడు నెంతయు మేలుగ శంఖ చక్ర రూ
పమును వహించి నీకు నిరువైపుల నిల్చి భజింతుర; తారకా
సమితి మనోజ్ఞ వజ్ర విలస న్నవ భూషణ చారు తార హా
రము లయి నిన్నుఁ గొల్చెడిని రమ్య గుణాకర! వేంకటేశ్వరా !

నళిన దళాక్ష ! నీ మధుర నామము సేమము మాకు; నీరదో
జ్జ్వల లలితాంగ ! నీ చరణ సన్నిధి పెన్నిధి మాకు; రోచి రూ
ర్జ్జలు వెలయించు నీ రుచిర రూపము దీపము మాకు లోక మం
గళ కర శీల ! నాగవర కంకణ భూషిత ! వేంకటేశ్వరా !

వేదము గాచి, శైలమును వీపున మోచి, విషాణ కోరపై
మేదినిఁ దేల్చి, రక్కసుల మేటరి పొట్టనుఁ జీల్చి, పొట్టి రూ
పాదటఁ క్షత్రియ జనాళిని గొట్టడఁ గూల్చి, భాను వం
శోదయ మోద్వియై మురళి నూది, యహింసనుఁ జెప్పి, సాదియై
శ్రీ దశ రూపకంబులు ధరించిన దేవర ! వేంకటేశ్వరా !

చీఁకటి నూతి రీతి కడు జే బగు సంసరణంపు గోతిలోఁ
గూకటి బంటిగా మునిఁగి కొందల మందెదు దీన మానవా
నీకము నుద్ధరించుటకు నేమముఁ బూనిన యట్టి వేల్పు క
న్నాకు ! ఖగేంద్ర కేతన ! సనాతన చేతన ! వేంకటేశ్వరా !

నిను సేవించెద, నిన్ భజించెదను, నిన్నే యెప్డు పూజించెదన్
నిను భావించెద, నిన్ జపించెదను, నిన్నే భక్తిఁ గొండాడెదన్
నిను వర్ణించెద, నిన్ నుతించెదను తండ్రీ ! నీకు కై మోడుపుల్
నను రక్షింపుము శేష శైల శిఖరేంద్రా ! వేంకటేశ ప్రభూ !

మడులును,మాన్యముల్,మణులు,మానికముల్, తపనీయ భూషలున్
గొడుగులు, చామరంబులును, గుఱ్ఱము, లేన్గులు, గోవు లాదిగా
నుడుగర లిచ్చి నిన్ గొలిచి యుండిరి భక్తిని రాజు లెందఱో
పుడమిని నీ మహో మహిమ పొంపిరి వోపగ వేంకటేశ్వరా !

విశ్వ వ్యాపక ! విశ్వ రూప ! వరదా ! విశ్వాత్మ ! విశ్వాధిపా !
విశ్వారాధిత ! విశ్వ భావ నిలయా ! విశ్వంతరా పూరితా !
శశ్వ చ్ఛాంతి సుఖ ప్రదాయక ! సువేషా ! వాసుదేవా ! సమ
స్తైశ్వర్యాంచిత ధామ ! రూప జిత కామా ! వేంకటేశ ప్రభూ !

మనసుల్ పూలుగ, భావ పాళి ఫలనంభారమ్ముగాఁ బ్రాణముల్
ఘన నీ రాజన దీపికా కళికలుంగా నాత్మసేవా సమ
ర్చనముల్ సేసెడు భక్తవర్యు లపవర్గ ప్రాపకుల్, నిత్య నూ
తన భోగ ప్రమద ప్రఫుల్ల విశ దాత్మా ! వేంకటేశ ప్రభూ !

సిలుగులఁ బాపి కావఁగను, శ్రీయములన్ సమకూర్ప, కోరు కో
ర్కెలు సఫలమ్ము సేయఁగను, కీ డెడబాపగ, వేంకటాద్రిపై
వలమురిదాల్పు వేల్పు మన పాల గలం డని నిశ్చయమ్ముగాఁ
బలుకుచునుందు రెల్లపుడు భక్తి వరేణ్యులు వేంకటేశ్వరా !

కలియుగ మందు దైవత శిఖామణి వేంకట శైల నాథుఁడే
కొలిచిన ఆ ప్రభూత్తమునె కొల్వవలెన్, మఱికష్ట వేళలోఁ
దలచిన ఆ విభున్ మది సదా తలపన్వలె నంచు నెంతయున్
బలుకుచునుందు రెల్లపుడు భక్తి వరేణ్యులు వేంకటేశ్వరా !

కూరిమి చూపి నిన్ గొలిచి కొందఱు నీ కృపఁ జూర లాడగా
నేరమి చూపి కొందఱు ద్రవించిరి నీ కరుణా స్రవంతిలో
నారయ చిత్రముల్ భవ దనంత నితాంత దయా విలాసముల్
శ్రీ రమణీ మనః కమల భృంగ శిరోమణి ! వేంకటేశ్వరా !

మాయాతీత ! ముకుంద ! భక్త జనతా మందార ! లోక త్రయా
శ్రేయో దాయక శేష శైల నిలయా ! చిద్రోచి రాకార ! ధా
త్రీ యోషాతత భూరి భార హరణా ! శ్రీకృష్ణరాయార్చితా !
మేయశ్రీకలితా ! యశో లలిత ! స్వామీ ! వేంకటేశ ప్రభూ !

ముడుపులు గట్టి, దీప మిడి, మ్రొక్కులు వెట్టి, యుపాస ముండి తా
ముడుగర లిచ్చి, నోములు - రథోత్సవముల్ పొనరించి సల్పు దో
పిడుల నొసంగి, భక్త జన బృందము నిన్ను భజించి సంతతం
బిడుమలఁ బాయుచుండును మునీంద్ర మనోహర! వేంకటేశ్వరా!

తలచెద డెందమందు సతతంబు జనార్దన ! దైత్య మర్దనా !
పిలిచెద రమ్ము - కావు మని విశ్వ విరాజిత దేవ పూజితా !
కొలిచెద మల్లికా కుసుమ కోమల హాస కళా విలాస ! నిన్
విలిచెద భక్తి విత్తమున విశ్రుత వైభవ ! వేంకటేశ్వరా !

అరుణములై యనంత నిగమాంత వధూ తిలకోల్లస చ్ఛిఖా
భరణములై, జగ న్నుత నభ స్తటినీ మధురాంబుపూర ని
స్సరణములై భవాంబునిధి సంతరణమ్ములనై చెలంగు త్వ
చ్చరణము లెప్డు మాకు బహుధా శరణమ్ములు వేంకటేశ్వరా !

నారద గీత మాధురి సనారతమున్ జవి గాంచు, సామ గా
నారవ సార పూరణ సుధాంబుధి వీచులఁ దేలి సౌఖ్య సం
భార వినోదివై వెలయు స్వామివి మా మొఱ లాలకింతు వే
తీరున ? సుప్రభాభవ ! సుధీనుత వైభవ ! వేంకటేశ్వరా !

శ్రీపాణీ స్వ శితమ్ములున్, శ్రుతి వధూ సీమంత సిందూర రే
ఖా పృక్తమ్ములు, భాసురమ్ములు, జగ త్కల్యాణ సంధాయక
వ్యాపారమ్ములు, శత్య లాంఛన కళా ప్రాచుర్యముల్. స్నిగ్ధముల్
నీ పాదమ్ములు దిక్కు మా కెప్పుడు తండ్రీ ! వేంకటేశ ప్రభూ !

వేల కొలంది భక్త జన బృందములున్ భవదీయ దర్శనా
లోల మనస్కతన్ శ్రమకు లోగక కొండల నెక్కి వచ్చి నీ
యాలయ మంటపాంతరమునందున శ్రేణులు దీర్చి నిల్చి సు
శ్రీల నెసంగు నిన్ను దరిశించి తరింతురు వేంకటేశ్వరా !

కల్యాణామృత గాత్ర ! భోగి శయనా ! కారుణ్య సౌజన్య సౌ
శీల్యాది ప్రముఖ ప్రసన్న గుణ రాశీ ! నిత్య సౌభాగ్య సా
కల్యాభ్యంచిత దివ్య ధామ ! నవ మేఘ శ్యామ ! దైత్యారి ! కై
వల్యానంద నిదాన ! భాను నిభ శోభా ! వేంకటేశ ప్రభూ !

నీ పద పంకజమ్ములను నెమ్మది నమ్మినవార లెప్పు డే
యాపద లొందబోవరు యథార్థము ; దీనికి మారు లేదు – సం
దీపిత భక్తి కజ్జలము దిద్దిన వారల కబ్బు మోక్ష ని
క్షేపము ; శ్రీ శుభంకర ! వశీకృత కింకర ! వేంకటేశ్వరా !

ఆమోదాంచిత పుష్ప సంగ్రథిత మాలాలంకృతా ! చారు ము
క్తా మాణిక్య విభూషణోజ్జ్వల శుభాంగా ! రత్న కోటీర ! వి
శ్వామిత్రాత్రి వశిష్ఠ గౌతమ భరద్వాజాది సప్తర్షి వా
చా మాధుర్య రసానుభోగ ! మృదు హాసా ! వేంకటేశ ప్రభూ!

తిరుమణి బొట్టు నిద్దముగ దిద్దిన ముద్దుల మోము గోము చూ
పరులగు వారికిన్ గనుల పండువు సేయఁగ భక్త కోటికిన్
వరము లొసంగుచున్ వెతలఁ బాపుచుఁ బ్రోన్నత శేష శైలమం
దిరవుగ వెల్గు నీ విభవ మెన్న నశక్యము వేంకటేశ్వరా !

భావాతీత మహా ప్రభావ కవితా ! భక్తాళి గోవింద ! శ్రీ
గోవిందా ! యని కంఠ మెత్తి కడు నిన్ గొండాడుచున భూరి భ
క్తావేశంబున గొండ లెక్కి భవదీయ ప్రోల్లస ద్దర్శన
శ్రీ వాల్లభ్యము నొందు నిర్జర జనార్తీ ! వేంకటేశ ప్రభూ !

పన్నగ శాయి ! భక్త రస పాయి ! సమస్త శుభ ప్రదాయి ! యా
పన్న జనావనా ! పరమ పావన భావన ! దివ్య రూప సం
పన్నవ మోహనా ! విహగ వల్లభ వాహన ! సౌఖ్య దోహనా !
యెన్నెద నిన్ను మౌని జన హృద్గుహ భాస్వర వేంకటేశ్వరా !

మల్లెల్,జాజులు,పొన్నలున్, బొగడలున్, మందారముల్, సంపెగల్
మొల్లల్, కల్వలు, సారసమ్ములు, గులాబుల్, పచ్చ చేమంతులున్
గొల్లల్గా సమకూర్చి మాలికలుగాఁ గుంఫించి కై సేయఁగాఁ
ద్వ ల్లీలాకృతి లోచనోత్సవము కాదా ! వేంకటేశ ప్రభూ !

కమ్మని తేట మీగడలు గట్టిన చిక్కని పాల సంద్రమం
దిమ్ముగఁ బాము పానుపున నింపు దలిర్పఁగఁ బవ్వళించి మో
దమ్మును నొందువాడ విటు ధాత్రి పయిన్ బెను గొండలందు వా
స మ్మొనరించుటల్ జనుల సాకగనేకద వేంకటేశ్వరా !

మీఱిన భక్తి భావము సుమింపఁ గవీంద్రు లొసంగు కావ్యమం
దార సుమ స్రజంబులకుఁ దద్దయు హర్షముఁ జెందినావు - ఆ
ళ్వారుల ద్రావిడోక్త సుధలన్ బులకించినావు బృం
దారక బృంద వంది పదా ! ప్రమద ప్రచ , వేంకటేశ్వరా !

* * *

శ్రీ రామానుజ కీర్తి కౌముది - జగత్ క్షేమం కరంబై, తమో
భారంబున్ దొలగించి, యోగి పరిషత్ భావోత్పలోల్లాస రే
ఖా రీతిన్ వెలయించి చల్వలు చెలంగన్ భూ జనాహ్లాద తో
త్సేకంబున్ నవరించి సర్వ దిశలన్ జెన్నారి వర్ధిల్లెడున్ !





శ్రీ భగవద్రామానుజులు

# పరమార్థ తత్త్వము

భాషా ప్రవీణ - విద్వాన్ - లలిత కవి

శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు



"నమామి నారాయణ పాద పంకజం
కరోమి నారాయణ పూజనం సదా
వదామి నారాయణ నామ నిర్మలం
స్మరామి నారాయణ తత్త్వ మవ్యయమ్."

## సృష్టి - మానవుఁడు

చరాచరాత్మక మగు ఈ సృష్టియందు, పిపీలికాది బ్రహ్మ పర్యంతము గల తొంబది కోట్ల జీవ రాసులలో - ఎనుబది నాల్గు లక్షల జన్మ లెత్తిన పిదప జన్మ మెత్తిన మానవున కొక్కనికి మాత్రమే అసాధారణ మైన జ్ఞాన సంపద కలదు. అదియే లేకున్న, మానవునకును - పశు పక్ష్యాది తిర్యక్ జంతువులకును వ్యత్యాసము లేక, సమానుఁడే యగును. అందువలననే మన తత్త్వ శాస్త్రవేత్తలు - అసాధారణ మగు మానవ జన్మ దుర్లభ మని చెప్పుచు - 'దుర్లభో మానుషో దేహః' అనియు, 'జంతూనాం నర జన్మ దుర్లభమ్' అనియు ప్రబోధించి యున్నారు.

## మానవుఁడు - జ్ఞానము

అఖిల హేయ ప్రత్యనీకానంత జ్ఞానానంద స్వరూపుఁడును, జ్ఞాన శక్త్యాది కల్యాణ గుణ మండితుఁడును, దివ్య భవ్య విగ్రహ విశిష్టుఁడు నగు సర్వేశ్వరుని సాయుజ్య సామ్రాజ్యమును సంప్రాప్తింపఁ జేయునదియే జ్ఞానము. అట్టి జ్ఞానము గలవాఁడే మానవుఁడు. అట్టి జ్ఞానము విద్యచే లభించును.

"అవిద్యయా మృత్యుం తీర్త్వా
విద్యయా అమృత మశ్నుతే."

అవిద్య వలన మానవుఁడు అధోగతిఁ జెందు ననియు, విద్య వలన అమృత పదవిని పొందఁ గలఁ డనియు వేద మాత వివరించు చున్నది. ఇట అవిద్య యనఁగా - భుక్తి కుపయుక్త మగు అవిద్య. అట్టి అవిద్య వలన, సంసార రూప మగు మృత్యువు జీవునకు సంప్రాప్తించును.

## జ్ఞా న ము - అ జ్ఞా న ము

దీపము వంటిది జ్ఞానము. గాఢాంధకారము వంటిది అజ్ఞానము. కనుక, మానవుఁడు తరింపవలె నన్న, జ్ఞాన మావశ్యకము. జ్ఞాన మనఁగా - బ్రహ్మ జ్ఞానము. అది - కోటి సూర్య సంకాశము వంటిది. అట్టి బ్రహ్మ జ్ఞానమును బడయుటకు - ఇరువది గుణము లావశ్యకము లని, భగవద్గీత నొక్కి వక్కాణించుచున్నది :-

## జ్ఞా న సా ధ న ము లు

"అమానిత్వ మదంభిత్వ మహింసా క్షాంతి రార్జవమ్
ఆచార్యోపాసనం శౌచం స్థైర్య మాత్మ వినిగ్రహః
ఇంద్రియార్థేషు వైరాగ్య మనహంకార మేవ చ
జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషానుదర్శనమ్
అసక్తి రనభి ష్వంగః పుత్ర దార గృహాదిషు
మయి చానన్య యోగేన భక్తి రవ్యభిచారిణీ
నిత్యంచ సమ చిత్తత్వ మిష్టానిష్టోపపత్తిషు
వివిక్త దేశ సేవిత్వ మరతి ర్జన సంసది
అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వం తత్త్వ జ్ఞానార్థ దర్శనమ్
ఏతత్ జ్ఞాన మితి ప్రోక్త మజ్ఞానం యదతోఽన్యథా."

- [భగవద్గీత 8 శ్లో॥ నుండి 12 శ్లో॥ వఱకు]

౧. అమానిత్వము ౨. అదంభిత్వము ౩. అహింస ౪. క్షాంతి ౫. ఆర్జవము ౬. ఆచార్యోపాసనము ౭. శౌచము ౮. స్థైర్యము ౯. ఆత్మ వినిగ్రహము ౧౦. వైరాగ్యము ౧౧. అనహంకారము ౧౨. దుఃఖ దోషానుదర్శనము ౧౩. అసక్తి ౧౪. అనభిష్వంగము ౧౫. సమ చిత్తత్వము ౧౬. అనన్య భక్తి ౧౭. వివిక్త దేశ సేవిత్వము ౧౮. అరతి ౧౯. అధ్యాత్మజ్ఞాన నిత్యత్వము ౨౦. తత్త్వజ్ఞానాభిదర్శనము అను యిరువదియు జ్ఞాన సాధనములు. వీని వివరణ మిది :-

౧. అమానిత్వము :-

తన అకించనత్వము నెఱుంగక, కన్ను - మిన్ను గానక, గర్వించి, పెద్దలను చిన్న చూపు జూచుచు, తాను పూజింప బడ వలె ననెడి అపేక్ష - 'మాన' మనఁబడును. అది లేకుండుటే అమానిత్వము.

౨. అదంభిత్వము :-

కీర్తి ప్రతిష్ఠలు పరమ ప్రయోజనముగ భావించుట 'దంభ' మనఁబడును. అది లేకుండుటే అదంభిత్వము.

౩. అహింస :-

పరులను బాధించుట, తనను తా బాధించుకొనుట 'హింస' అనఁబడును. అది లేకుండుటయే అహింస.

౪. క్షాంతి :-

తనను బాధించినవారి విషయమున, తూష్ణీ భావము వహించుట.

౫. ఆర్జవము :-

పరుల యెడ సమ భావము కలిగి యుండుట. దీనినే 'సర్వ మానవ సౌభ్రాత్ర' మందురు.

౬. ఆచార్యోపాసనము :-

అనవరతము ఆచార్యుని (గురువును) సేవించుచుండుట.

౭. శౌచము :-

వ్యసన సప్తకమును వీడి, సత్యవాక్పాలకుఁడై, శాస్త్ర నిషిద్ధ పద్ధతులను విడనాడి, త్రికరణము లనఁబడు మనోవాక్కాయములను పరిశుద్ధముగ నుంచుకొనుట.

౮. స్థైర్యము :-

భగవత్తత్త్వము నందును, ధర్మారాధనము నందును, సంప్రదాయ పరిరక్షణము నందును నిశ్చయ - నిర్మల జ్ఞానము కలిగి యుండుట.

౯. ఆత్మ వినిగ్రహము :-

వైదిక కర్మ మార్గము నుండి మనస్సును మరలింప కుండుట.

౧౦. వైరాగ్యము :-

భగవచ్చింతన యందు తక్క, త దితరము లందు వైరాగ్య భావము కలిగి యుండుట.

౧౧. అనహంకారము :-

దేహమే ఆత్మయనెడి బుద్ధిని, అద్వైత భావనను విడనాడి,

జీవాత్మ - పరమాత్మలు వేరను భావము కలిగి, భగవంతుఁడు సర్వ రక్షకుఁడనియు, ఆ స్వామికి తాను దాసుఁడనియు తలంచుట.

౧౨. దుఃఖ దోషానుదర్శనము :-

జన్మము, మృత్యువు, జర, వ్యాధి యను వాని యందలి దుఃఖ రూపమును తదేకముగ తలంపక, దానికి అతీతుఁడై యుండుట.

౧౩. అసక్తి :-

సతీ సుతాదులందు నిస్సంగుఁడై యుండుట.

౧౪. అనభిష్వంగము :-

ఇతరుల సుఖ దుఃఖముల యందు అభినివేశము లేకుండుట.

౧౫. సమ చిత్తము :-

సకల భూతము లందును సమ భావము కలిగి, ఇష్టానిష్టము లందును, మానావమానము లందును హర్షము విషాదము లేకుండుట.

౧౬. అనన్య భక్తి :-

సర్వేశ్వరుని యందు సంపూర్ణ భక్తి కలిగి యుండి, దేవ తాంతర భజన పరిత్యాగ పూర్వకముగ, సహజ శేషి యగు భగవంతుని యందు ఏకాంత భక్తి కలిగి యుండుట. అట్టి ఏకాంత భక్తి మార్గ మున పయనించిన వారిలో - ప్రహ్లాద, నారద, పరాశరాది పరమ భాగవతోత్తములు, పరాంకుశ - పరకాలాది దివ్య సూరులు, నాథ - యామున - రామానుజాది ఆచార్య వర్యులు, అన్నమాచార్యాది భగవ న్నామ సంకీర్తనానంద మగ్న మానసులు ముఖ్యులు.

౧౭. వివిక్త దేశ సేవిత్వము :-

ఏకాంతమున నివసించి, భగవ ద్భాగవతాచార్య నామ స్మరణము, అష్టాక్షరీ మహా మంత్ర జపము, ద్వయ మంత్రానుసంధానము చేయుచు, సమయమును సద్వినియోగము గావించుట.

౧౮. అరతి :-

ప్రాకృతుల సాంగత్యము వీడి, సజ్జన సాంగత్యము గావించుచు, వారి మూలమున సత్కర్మానుష్ఠాన విధాన మెఱుంగుచు, ఎఱింగిన దానిని మఱువక, అనుష్ఠించుట.

౧౯. అధ్యాత్మ జ్ఞాన నిత్యత్వము :-

ఆత్మ జ్ఞానమునందు స్థిర మైన బుద్ధి కలిగి యుండుట. తా నెవరు ? తన కీ మానవ జన్మ యేల లభించెను ? తన కర్తవ్య మేమి? ఇట్టి అధ్యాత్మ చింత చేయుచు, పరమార్థ సాధనకు ప్రయత్నించుట.

౨౦. తత్త్వ జ్ఞానార్థ దర్శనము :-

సర్వ కాల సర్వావస్థల యందును భగవ త్తత్త్వము నెఱుంగ యత్నించుట. భగవ ద్గుణానుభవము గావించుట.

ఇవియే జ్ఞాన సాధనకు మార్గములు. ఈ యిరువది సాధనముల వలన జ్ఞానము లభించును. దానికి భిన్న మగున దంతయు అజ్ఞాన మనియే తెలియ నగును.

## ఆచార్యోపాసనము - భగవ దనుగ్రహము

పై యిరువదింటిలో - ఆచార్యోపాసన మనునది అతి ముఖ్య మైనది ఏల యన, పూర్వ జన్మ కర్మ సంచితముచే, స్వస్వరూప - పరమాత్మ స్వరూపములను మఱచి, త న్మూలమున, బహు విధము లగు

కష్ట నష్టముల కగ్గల మగుచు, తీర మెఱుంగని ఘోర సంసార కూపమునఁ బడి, దారి గానక, అల్లాడుచున్న జీవునకు, దయా సముద్రుఁ డగు దేవ దేవుని అనుగ్రహముచే, సదాచార్య కటాక్షము సంప్రాప్తించును. అట్టి ఆచార్య దర్శన విశేషము వలన, భగవ ద్దర్శన భాగ్యము లభించును.

వేదాంత శాస్త్ర రహస్యములను ఆచార్యుని ఉపదేశ మూలము ననే ముముక్షువులు, గ్రహింపవలసి యున్నది. ఆచార్యుఁ డనఁగా - గురువు. గురు వనఁగా - అజ్ఞాన మను అంధకారమును తొలఁగించు వాఁడు. భగవ దనుభవము పొందిన సద్గురువులు మాత్రమే శిష్యుల అజ్ఞానమును తొలఁగించి, వారికి భగవ త్సాక్షాత్కార మార్గము చూపగలరు. దైవ సాక్షాత్కారము నొందుటే - దేవుఁ డున్నాఁ డను టకు ప్రబల నిదర్శన మని సనాతన ధర్మము వక్కాణించుచున్నది.

## భ గ వ చ్ఛ బ్దా ర్థ ము

భగవ చ్ఛబ్దమునకు - అగణిత కల్యాణ గుణ రత్నాకరుఁ డనియు, అనంత శుభ గుణ కళా ప్రపూర్ణుఁ డనియు అర్థము. ఈ భావమునే బ్రహ్మ సూత్రము (324) ఇట్లు వ్యక్తీకరించుచున్నది:-

"న స్థానతోఽపి పరస్యోభయలింగం సర్వత్రహి." (3-2-1)

ఈ సూత్రమును శ్రీ భగవద్రామానుజ యతి సార్వభౌములు తమ శ్రీభాష్యమున నిట్లు వ్యాఖ్యానించి యున్నారు :-

"న స్థానతోఽపి పరస్యేతి న పృథివ్యాది స్థానతోఽపి పరస్య బ్రహ్మణః అపురుషార్థ గంధ స్సంభవతి. కుతః ? ఉభయ లింగం సర్వత్ర హి - యతః సర్వత్ర శ్రుతి స్మృతిషు పరం బ్రహ్మ ఉభయ లింగం - ఉభయ లక్షణ మభిధీయతే; నిర స్త నిఖిల దోషత్వ కల్యాణ గుణాకరత్వ లక్షణోపేత మి త్యర్థః అపహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో ఽవిజిఘత్సోఽ పిపాస - స్సత్య

సంకల్పః, సమస్త కల్యాణ గుణాత్మకో౽సౌ స్వశక్తి లేశాద్భృత భూత సర్గః. తేజో బలైశ్వర్య మహావబోధ సువీర్య శక్త్యాది గుణైక రాశిః, పరః పరాణాం సమస్త హేయ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్, ఇత్యాది శ్రుతి స్మృతిభ్యః ఉభయ లక్షణం హి వాహ్యావగతమ్."

అసంఖ్యాకములైన భగవంతుని కల్యాణ గుణములలో - ౧. జ్ఞానము ౨. శక్తి ౩. బలము ౪. ఐశ్వర్యము ౫. వీర్యము ౬. తేజస్సు అను ఆరు గుణములు ముఖ్యములు.

## షడ్గుణ విశేషములు

౧. జ్ఞానము :-

'తస్య యథా కప్యాసం పుండరీక మేవ మక్షిణీ' అని ఉపనిషత్తులలో వర్ణింపబడి, గంభీరాంభ స్సముద్భూత సుమృష్టనాళ రవి కిరణ వికసిత పుండరీక దళాయతేక్షణముల సాపేక్షముగను, లీలా విభూతి యందును, నిత్య విభూతి యందును గల సమస్త వస్తు జాతమును ఒక్క పర్యాయముగ, స్వభావ సిద్ధముగ కానవచ్చుట.

౨. శక్తి :-

సకల చరాచర ప్రపంచమునకును భగవంతుడే మూల కారణము. ఆ సర్వేశ్వరుని దివ్య శక్తి - సర్వ నిర్వాహక మైనది.

౩. బలము :-

'ఇచ్ఛామాత్రి ప్రిభో !' అన్నట్లు, తన సంకల్ప మాత్రము చేతనే బ్రహ్మాండ భాండమును తనలో ధరింపగల బలము.

౪. ఐశ్వర్యము :-

అప్రతిహత మగు సర్వ నియమన సామర్థ్యము గల్గి, సకల సంపదలకును నిలయుఁడై తేజరిల్లుట.

౫. వీర్యము :-

సర్వమున కాధారభూతుఁడై, సర్వము నియమింపఁగలవాఁడై యున్నప్పటి సౌరభము వలె, తన స్వరూప స్వభావములను విడనాడకుండుట.

౬. తేజస్సు :-

పరాభిభవన సామర్థ్యమును తేజస్సని పలువు రనఁగా, సర్వ కార్యములందును సహకారి నిరపేక్షిత్వ మని మఱి యొక సూక్తి చెప్పుచున్నది.

భగవంతునకు - సౌశీల్య, వాత్సల్య, మార్దవ, ఆర్జవ, సౌహార్ద, సామ్య, ధైర్య, శౌర్య పరాక్రమాది కల్యాణ గుణము లెన్నియో కలవు. వానిలో - పై నుడివిన ఆఱు గుణములు అతి ప్రధానములుగా పరిగణింపఁబడుచున్నవి.

## పంచావతారములు

భగవంతుని స్వరూపము - పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చావతారములుగ పంచ విధములై యుండును.

౧. పరత్వము :-

పితామహ ప్రభృతి - దేవేంద్రాదులకు సైత మిది అంతు చిక్కనిదై యుండును. నిత్య సూరులకు, ముముక్షువులకు అత్యంత సుగమమై శుద్ధ స్ఫటిక సంకాశమై, అనుపమానమై, ఊహాతీతమై, స్వర్ణ

ప్రాకార గోపుర మంటప ప్రాసాదాదులచే విరాజమానుఁడై, అతి సుందర మగు తిరుమామణి మండపమున, శేష పర్యంకమందు - లక్ష్మీ సమేతుఁడై, అనంత గరుడ విష్వక్సేనాది దివ్య సూరులచే సేవింపఁబడు వాఁడై, జ్ఞాన శక్తి బలైశ్వర్యాది షాడ్గుణ్య పరిపూర్ణుఁడై, కోటి సూర్య ప్రకాశమాన తేజ స్సంపన్నుఁడై విరాజిల్లుచుండును.

౨. వ్యూహము :-

సంకర్షణ - ప్రద్యుమ్న - అనిరుద్ధ రూపములతోఁ గలసి యుండు రూపమే వ్యూహము. ఒక్కొక్క రూపము - గుణ ద్వయముతోఁ గూడియుండును. సంకర్షణుఁడు - జ్ఞాన - బలములతోఁ గలసి, జగత్సంహారమునకు ఆమోద లోకమునకు కర్తయై యుండును. ప్రద్యుమ్నుఁడు - ప్రమోద లోకమునకు కర్తయై, ఐశ్వర్య వంతుఁడై, పరాక్రమోపేతుఁడై యుండును అనిరుద్ధుఁడు - స్థితికి కర్తయై, తేజశ్శక్తి కలిగి, సమ్మోద లోకమున నుండును.

3. విభవము :-

విజాతీయుఁడై ఉద్భవించి, ముఖ్యము, గౌణము, (అముఖ్యము) అని, విభవము ద్వివిధములుగ నుండును. పరిపూర్ణము లైన రామ కృష్ణావతారములు ముఖ్యములు ఆవేశావతారము లగు జామదగ్న్యాదులు గౌణములు.

౪. అంతర్యామిత్వము :-

"అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా"

అని శ్రుతియు -

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేఽర్జున ! తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా."

అని భగవ ద్గీతయు ( 18-61 ) వక్కాణించినట్లు, సర్వ జీవుల హృదయములందును నివసించి,నియంతయై యుండుట అంతర్యామిత్వ మనఁబడును. అంతర్యామి యైన సర్వేశ్వరుఁడు - సర్వ ప్రాణులకు, సర్వ కాలమును తన చేయూత నిచ్చుచు, వారల పరిరక్షణ తన కర్తవ్య మని భావించి, నీల వలాహక ద్యుతుల నీను శుభాశ్రయ విగ్రహుఁడై, చుట్టపు మేకువై, భక్త మానసాంబురుహ వాసియై యుండును.

౫. అర్చావతారము :-

భక్తాభీష్ట వరప్రదుఁ డైన భగవానుఁడు విగ్రహ రూపము దాల్చి యుండుటె అర్చావతారము. పర - వ్యూహ - విభవ - అంతర్యాముల కంటెను సౌలభ్య గుణ యుక్త మైన అర్చావతారమే సంపూర్ణ మైన దని శ్రుతి పలుకుచున్నది :-

"ఇదం పూర్ణ మదః పూర్ణం పూర్ణా త్పూర్ణ ముచ్యతే
పూర్ణస్య పూర్ణ మాదాయ పూర్ణ మేవావశిష్యతే
సర్వం పూర్వగ్ం సహోమ్."

## అర్చావతార వైభవము

ఆగమము లన్నియు అర్చావతార వైభవమును విపులముగను, విస్తృతముగను విశదీకరించుచున్నవి. పన్నిద్దరాళ్వారులు పాడిన పాశురములలో విశేషించి అర్చావతార వైభవమునే కీర్తించుచున్నవి. ఋషి ప్రోక్తము లైన దర్శనములును అవకాశము ననుసరించి, సంసార బంధమును తొలఁగించుకొని, వివేక - వైరాగ్యముల ద్వారా, అర్చా మూర్తిని అర్చించి, మోక్ష మార్గము నుపదేశించుచున్నవి.

సకల కల్యాణ గుణ పూర్ణ మగు బహు విధ విభవ రూపములు ఆవిర్భవించిన అర్చావతారము - అవతారము లన్నింటికన్న మిన్నగ నెన్నఁదగి యున్నది. ఈ అర్చావతారమున, జ్ఞాన - శక్త్యాది సకల

కల్యాణ గుణములు సంపూర్ణములుగ నున్నవి. అట్టి అర్చావతారమును గూర్చి భాగవతములో - ఏకాదశ స్కంధమున ఉద్ధవుని ధర్మ సందేహము, కృష్ణుని సమాధానము గమనింపదగినవి :-

"రూపు లేని నీకు రూఢిగ యోగులు
రూపు నిల్పి నిన్ను రుచిర భక్తి
గొల్చి యుండ, వారి కోర్కెల నిల్చెద
వేమి లాగు ? మాకు నెఱుఁగ బలుకు."

అని యుద్ధవుఁ డడిగిన, నారాయణుం డిట్లనియె :- "నేను సర్వ వర్ణంబులకు సమం బయిన పూజా ప్రకారంబును పాషాణ మృణ్మయ దారువులం గల్పించి, నా రూపంబుగ నిల్పుకొని కొందఱు పూజింతురు. కాంస్య త్రపు రజత కాంచన ప్రతిమా విశేషంబు లుత్తమంబులు. నా రూపంబునందు మ ద్భావంబు నుంచి కొల్చిన వారలకు నే ప్రసన్నుండ నగుదును. ఈ లోకంబున మనుష్యులకు ధ్యానంబు నిలువ నేరదు, కావున, ప్రతిమా విశేషంబు లనేకంబులు కలవు. వాని యందు సౌందర్య సారంబులును - మనోహరంబులు నైన రూపంబుల నే నుందు కావున, దుగ్ధార్ణవ శాయిగా భావించి, ధౌతాంబర మాల్యానులేపనంబులను, దివ్యాన్న పాయసంబులను, షోడశోపచార పూజా ప్రకారంబులను, రాజోపచారంబులను, బాహ్య పూజా విధానంబుల నాచరించి, మన స్సంకల్పితంబు లయిన పదార్థంబులు సమర్పించి, నిత్యంబును నాభ్యంతర పూజా విధానంబుల పరితుష్టినిం జేసి, దివ్యాంబ రాభరణ మాల్యాను శోభితుండును, శంఖ చక్ర కిరీటా ద్యలంకార భూషితుండును, దివ్య మంగళ విగ్రహుండునుగా తలంచి, ధ్యాన పరవశుఁ డయిన యతండు నాయందులం కలయు. ఉద్ధవా ! నీ వీ ప్రకారంబున గరిష్ఠాతిరేకంబున యోగ నిష్ఠుండవై, బదరికాశ్రమంబు చేరి, మ త్కథితం బైన సాంఖ్య యోగం బంతరంగంబున నిల్పుకొని, కలియుగావసాన పర్యంతంబు వర్తింపుము' అని పరమేశ్వరుం డానతిచ్చిన, ఉద్ధవుండు నానందభరితుండై, త త్పాదారవిందంబుల హృదయంబునం జేర్చుకొని, పావనం బైన బదరికాశ్రమంబున కరిగెను."

ఇట్లనేక శాస్త్ర పురాణేతిహాసాదులలో - అర్చావతార వైభవము అతి విస్తృతముగను, పరమ భోగ్యముగను, అతివేలముగను ప్రతిపాదితమై యున్నది.

## భగవత్కటాక్షము - పరమార్థ ప్రాప్తి

నిర్హేతుక భగవత్కటాక్ష లబ్ధ నిర్మల జ్ఞాన సంపన్ను లగు నిత్య సూరులు, వారి మార్గము ననుసరించిన ఆచార్య శేఖరులు అర్చా రూపి యగు భగవంతుని సందర్శించి, ప్రపత్తి చేసి, మనోరథ సిద్ధిని పొందుటకు - వార లొసంగిన దివ్య ప్రబోధములు, స్తోత్ర రత్నములు మున్నగు నవియే ప్రబల ప్రమాణములు.

వేద శిఖోల్లసత్పరుఁ డగు శ్రీనివాస భగవానుని అన్నమాచార్యుఁడు, భద్రాచల తుంగ శృంగ విహార దివ్య మంగళ విగ్రహుఁ డగు శ్రీరామచంద్రుని రామదాసు - అర్చా మూర్తిని శరణించి, ఆరాధించి తరించిరి.

అట్టి వైభవముతోఁ గూడి, ఆశ్రిత ఫలప్రదుఁడై, అఖిల జీవ లోక శరణ్యుఁడై, అర్చా రూపమున నవతరించిన శ్రీమన్నారాయణుని శరణాగతి చేయుటయే చేతనుల కవశ్య కర్తవ్యమై యున్నది.

ఆ స్వామిని కనులార గాంచి, మనసార ఆనందించి, 'పత్రం పుష్పం ఫలం తోయం' అన్నట్లు యథా శక్తి పూజించి, ప్రణమించినచో - తమ భక్తి ప్రపత్తులకు తగినట్లు, ఇహ పరములలో - సమస్త సంపత్సమృద్ధులను పొందగలరు. అదియే పరమార్థము. అ య్యదియే బ్రహ్మానందము. అట్టి బ్రహ్మానంద ప్రాప్తియే చేతన కోటికి అభిలషణీయము.

"హే మర్త్యాః పరమం హితం శృణుత వో వక్ష్యామి సంక్షేపతః
సంసారార్ణవ మాప దూర్మి బహుళం సమ్యక్ప్రవిశ్య స్థితాః
నానాజ్ఞాన మపాస్య చేతసి నమో నారాయణాయే త్యముం
మంత్రం సప్రణవం ప్రణామ సహితం ప్రావర్తయధ్వం ముహుః."

—)o(—

# శ్రీ నమ్మాళ్వారుల వైభవము

దర్శన సార్వభౌమ - తర్క- భూషణ

న్యాయ వేదాంత శిరోమణి - ఉభయ వేదాంత విద్వాన్

శ్రీమాన్ టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులు



## మంగళాచరణము

శ్రీ శేషాద్రి శిఖావలాహక మణిం కారుణ్య వారాం నిధిం
శ్రీ విద్యు ల్లసితం సుదర్శన కరం శ్రీ పాంచజన్యారవమ్
సంసా రాతప శోషితా ర్తి హరణం భక్తాంతుర ప్రీణనం
వందే వేంకట నాయకం మమ పతిం భాస్వ త్సహస్రారకమ్.

య ద్గో సహస్ర మపహ న్తి తమాంసి పుంసాం
నారాయణో వసతి యత్ర స శంఖ చక్రిః
య న్మండలం శ్రుతి గతం ప్రణమ న్తి విప్రాః
త స్మై నమో వకుళ భూషణ భాస్కరాయ."

## చరిత్ర సంగ్రహము

శ్రీమ దఖండ భూమండల మండనాము మగు ఈ భరత ఖండ మున, గంగాది మహా నదులకంటెను శ్రేష్ఠ తమ మైన శ్రీ తామ్రపర్ణీ తీరమున - 'కురుకూర్' (కురుకా పురి) అనియెడి సర్వాంగ సుందర మగు దివ్య క్షేత్ర మొండు గలదు. ఈ నగరము - కౌరవ మహారాజుచే ద్వాపర యుగమున పరిపాలింపఁబడెను.

అచట - చతుర్థ కులోత్పన్నుఁ డగు 'విభూతి నాగేంద్రుఁ' డను నొక పరమ భాగవతో త్తముఁ డుండెను. అతనికి - 'ధర్మ ధరుఁ' డను

కుమారుఁ డవతరించెను. అతనికి - 'చక్రపాణి' యను తనూభవుఁ డుద్భవించెను. అతనికి - 'అచ్యుతుఁ' డను నాత్మజుఁ డవతరించెను. అతనికి - 'సుమతి'యు, సుమతికి - 'శెందామరై క్కణ్ణన్' అనియు, ఆయనకు - 'కారి' యనియును క్రమముగ పుత్ర రత్నము లుద్భవించిరి. వా రందఱును సకల సద్గుణ సంపన్నులుగా - విశేష భగవద్భక్తియుక్తులుగా ప్రకాశించిరి.

శ్రీ కారి యను భాగవతోత్తముఁడు - తుల్య శీల వయో వృత్తురాలగు 'ఉడైయ నఙ్గై' యమ్మవా రనియెడి 'నాథ నాయకి' యను కన్యా రత్నమును పెండ్లాడెను. ఆ దంపతులు కొంత కాలము సంతానము లేనివారలై, 'తిరు క్కుఱుఙ్గుడి నంబి' అనియెడు స్వామి యనుగ్రహమును సంపాదించి, ఆ భగవ దనుగ్రహముచే నొక కుమార రత్నమును బడసిరి.

ఆ కుమార రత్నము - కలి యుగము బుట్టిన నలువది మూఁడవ దినమున, ప్రమాది సంవత్సర వృషభ (వైయాసి) మాసమున పంద్రెండవ దిన మగు స్వస్తిశ్రీ వైశాఖ శుక్ల చతుర్దశీ శుక్రవాసరమున, కటక లగ్నమందు, దివ్య తేజస్సుతో వెలుంగుచు, సేనేశాంశమున దివ్య ప్రభావ సంపన్నమై యవతరించెను. ఆ కుమార రత్నము - లోకుల బిడ్డలవలె స్తన్య పానాదులను స్వీకరింపక, యేడ్వక, కనులను మూసికొని, జన్మించినది మొదలు భగవ ద్ధ్యానైక నిమగ్నుఁడై, అత్యద్భుతావహముగ దిన దిన ప్రవర్ధమాన దివ్య తేజ స్సంపన్నుఁడై వెలుగొందుచుండెను.

ఇది యేమి విచిత్రమా! యని అతని తలిదండ్రులు సంభ్రమాశ్చర్య నిమగ్నులై వితర్కించి, ఆ బిడ్డను పండ్రెండవ దినమున - 'పొలిన్దు నిన్ఱ పిరాన్' అను భగవంతుని సన్నిధికి గొంపోయి,

శ్రీ స్వామివారిని సేవింపఁజేసిరి. ఆ భగవత్సన్నిధికి జనిన మరు క్షణముననే ఆ శిశు రత్నము కన్నులఁ దెఱచి, ఆ శ్రియః పతిని కన్నులార ఆపాదచూడము సేవించి, త దనుభవ జనిత మైన పరమానంద నిమగ్నుఁడై యుండ, శ్రీ స్వామి శిశువున కొక విలక్షణమైన వకుళ మాలిక ననుగ్రహించెను. దాని నా శిశువు తన కంఠ సీమ నలంకరించుకొని, బాలార్కుని పగిది దేదీప్య దివ్య మంగళ విగ్రహుఁడై ప్రజ్వరిల్లుచు, మెల్ల మెల్లగ దేకుచు, జరిగి జరిగి, త త్పూర్వమే అచ్చట ఆది శేషుని దివ్యాంశతో నవతరించియుండు 'తిరు ళిప్పు యాళ్వార్' అనియెడు తింత్రిణీ వృక్షము (చింత చెట్టు) యొక్క మూలమునకుఁ జేరి, అం దుండు కోటరమున (తొఱ్ఱలో) పద్మాసనం బిడి, యోగ నిష్ఠా గరిష్ఠుఁడై యుండెను. ఇట్లీతని స్వభావము - భగవత్సందర్శన మాత్రముననే మాఱినందున, ఈ మహనీయునకు నాఁటినుండి - 'మాఱన్' అను తిరునామము ప్రసిద్ధ మాయెను.

ఈ రీతిగా వీరు నిరాహారులై యుండియు - నిరంతర భగవద్ధ్యానామృతాస్వాద ప్రభావము వలన, శుక్ల పక్ష చంద్రుని పగిది, దిన దిన ప్రవర్థమానులై, పదునాఱు సంవత్సరములు జ్ఞాన ముద్రతో మౌన మవలంబించి, అత్యర్కానల దీప్త మైన దివ్య మంగళ విగ్రహులై, పరమ విలక్షణులై విరాజిల్లుచుండిరి.

ఇట్లుండ, దివ్య దేశ యాత్ర సలుపుచున్న మధురకవి యాళ్వారులు బదరికాశ్రమమునుండి అయోధ్య కేతెంచి,కొన్ని దినము లచ్చట నివసించుచుండిరి. ఒకా నొక దినమున వారు జల స్పర్శ నిమిత్తమై అర్థ రాత్రమున బయటికి జనుదెంచిన సమయమున, దక్షిణ దిక్కునం దొక గొప్ప వెలుఁగు వారికిఁ గనబడెను. ఇది యేమియా ! యని అత్యంతాశ్చర్య సంకలిత మానసులై విచారించి, దాని స్వరూప స్వభావములను సంపూర్ణ ముగా గనుఁగొని గుఱి బెట్టుకొని, రాత్రులందు

దక్షిణ దిక్కునకు పయన మగుచు, నిఖిల దేశముల గడచి వచ్చి, క్రమముగ కురికాపురికి వచ్చి చేరిరి.

ఇటుల ఆ దివ్య తేజము ఆ నగరి వఱకే కనఁబడి, దాని వెనుక గనఁబడ దాయెను. అందుచే, ఈ యూరియందే ఆ దివ్య తేజ స్సుండి తీరవలయు నని నిశ్చయించుకొని, అచ్చటి వారలను అచ్చట గల విశేష విషయములను విచారించిరి. ఆ యూరివారలు - శ్రీ నమ్మాళ్వారుల విషయమును వారికి దెలుపగా, వెంటనే ఆళ్వారుల సన్నిధానమునకు త్వరిత గతిని వచ్చి చేరి, ముకుళిత హస్తులై, చిర కాలము నిరీక్షించియు - వారు కన్నుల దెఱచిచూడనందున, ఒక పెద్ద ఱాతి నెత్తి క్రింద పడవైచిరి. ఆ ధ్వనిని విని, నమ్మాళ్వారులు కండ్లు తెఱచి చూచిరి. త దు ప రి, వీరి మహిమాతిశయములను దెలియఁగోరి, 'స్వామీ! అచేతన మగు ప్రకృతి గర్భమున చేతనుఁ డుదయించిన, దేనిని తిని, ఎచ్చట నుండును?' అని భావ గర్భముగ ప్రశ్నింప, వెంటనే ఆళ్వారులు - 'దానిని తిని అచ్చటనే యుండును' అని గంభీరముగ బదులు పల్కిరి. దానిని విని మధుర కవులు - 'వీరు మహా ప్రాజ్ఞులు, మహానుభావులు' అని తీర్మానించుకొని, పరమ ప్రీతులై, ఆళ్వారులయందు విశేష ప్రతిపత్తిని గలిగి, వారికి సర్వదేశ సర్వకాల సర్వావస్థలయందును, సకల విధములైన నిత్య సేవలఁ జేయుచుండిరి.

ఇట్లుండ, నమ్మాళ్వారులు లోక యాత్రను పూర్తిగా వదలి, ధారక పోషక భోగ్య రూపము లగు సమస్త భోగ్య భోగోపకరణములనుగా కేవలము భగవ ద్దివ్య మంగళ విగ్రహ కల్యాణ గుణ గణ చారిత్ర నామాదులనే చేసికొని, త దేక నిరతులై యుండుటను దిలకించి, ఆ యా దివ్య దేశములయందు వేంచేసియుండు అర్చా స్వరూపు లగు భగవ న్మూర్తు లందఱును నమ్మాళ్వారులు నివసించి యుండు ఆ తింత్రిణీ వృక్ష మూలమునకే విచ్చేసి, వీరికి తమ దివ్య

మంగళ విగ్రహ సేవాదుల ననుగ్రహించి, వీరి మంగళాశాసనమునకు పాత్రులై, ధన్యమ్మన్యులై, తమ తమ దివ్య సన్నిధులకు విచ్చేసిరి.

అటుల సకల దివ్య దేశ వాసు లగు భగవ న్మూర్తులకును, మంగళాశాసన మొనరించుచు, పరమ విరాగ చక్రవర్తులై, పర భక్తి - పర జ్ఞాన - పరమ భక్తులు ఒక్కమ్మడి యున్మస్తకములు కాఁగా, భగవంతుని దివ్య మంగళ విగ్రహ విభూత్యాదుల ననుభవించి యను భవించి, ఆ యనుభవామృతము లోపల నిమడక, బహిః ప్రవాహ పరీవాహ రూపముగా ప్రవహింప, నూరు (100) పాశురములు గల 'తిరువిరుత్తము' - ఏఁడు (7) పాశురములు గల 'తిరువాశిరియము'- ఎనుబదియేఁడు (87) పాశురములు గల 'పెరియ తిరువన్దాది' - వెయ్యిన్ని నూట రెండు (1102) పాశురములు గల 'తిరు వాయి మొళి' అను నాలుగు దివ్య ప్రబంధముల ననుగ్రహించిరి.

ఈ నాలుగు దివ్య ప్రబంధములును - ఋ గ్యజు స్సామాథర్వ ణము లను సంస్కృత వేదముల సారాంశ రూపములై యున్నందున, వీరికి - 'వేదం తమిళ్ శెయ్‌ద మాఱన్' (వేదములను తమిళ భాషలో రచించిన మాఱులు) అను ప్రసిద్ధి ప్రచారములు గలిగినవి.

మఱియు, జీవుల కజ్ఞానమును కలుగఁజేయు శఠ వాయువును కోపించినందున, 'శఠ కోపులు' అను నామధేయము గలిగినది. ఇటు లనే, పగడ పుష్పముల మాలను ధరించినందున, 'వకుళాభరణు' లనియు, భగవంతునకును - ప్రపన్ను లందఱకును మిక్కిలి యభిమాన పాత్రు లగుటచే, 'నమ్మాళ్వారులు' (మన ఆళ్వారులు) అనియును వ్యవహరింపఁబడిరి.

ఇంకను వీరికి :- కారిమాఱులు, కారి సూనులు, మాఱన్, శఠకోపులు, పరాంకుశులు, వేదం తమిళ్ శెయ్‌ద మాఱన్ పెరుమాళ్

తిరువాయ్మొళి ప్పెరుమాళ్, ఉదయ భాస్కరులు, తిరు నా వీఱుడైయ పిరాన్, కురుకేశులు, గురుగై ప్పిరాన్, తిరుక్కురుగూర్ నంబి, తెన్న రంగం పొన్నడి, వకుళ భూషణులు, తిరువరంగన్ పొన్నడి, అరుళ్ మాఱన్, ప్రపన్న జన కూటస్థులు అను దివ్య నామధేయములు ప్రసిద్ధములై యున్నవి.

వీరు, భగవ దనుగ్రహోపాదిత విలక్షణ విమల జ్ఞాన సంపన్ను లగు దివ్య సూరుల (ఆళ్వారుల)లో ప్రధాన భూతులు. కనుకనే, వీ రను గ్రహించిన నాలుగు దివ్య ప్రబంధములును ద్రావిడ వేదములై యలరారుచున్నవి. ఇతర దివ్య సూరు లానతిచ్చిన దివ్య ప్రబంధము లన్నియును వీని శంగములు. ఇందువలననే శ్రీ నమ్మాళ్వారులు అవయవముగను, ఇతరులు వీరికి అవయవభూతులుగను అభివర్ణింపఁ బడిరి. ఇచ్చట, వీని కాధారముగ పెద్ద లనుగ్రహించిన రెండు శ్లోకము లనుసంధిపఁబడగియున్నవి :-

"భూతం శిరో హ్రద మహోహ్వయ మక్షి యుగ్మమ్
భట్టార్య మాస్య మథ భార్గవ మస్య కంఠమ్
బాహూ వదన్తి కులశేఖర యోగివాహౌ
దోర్మధ్య నాభి చరణా నితరాన్ శఠారేః."

శ్రీ నమ్మాళ్వారులకు పూదత్తాళ్వారులు శిరస్సు పొయ్గై యాళ్వారులును, పే యాళ్వారులును రెండు నేత్రములు. పెరియాళ్వా రులు తిరు ముఖ మండలము. తిరుమళిశై యాళ్వారులును కంఠము. కులశేఖరాళ్వారులును, తిరుప్పాణాళ్వారులును రెండు బాహువులు. ఇతరు లగు ఆళ్వారులను - హస్తములు, మధ్యము, నాభి, చరణములు గను పెద్దలు వర్ణించు చున్నారు.

"భూతం మస్తక మక్షిణీ ప్రహ్వద మహ త్సూరి చ భట్టేశ్వరమ్
వక్త్రం భక్తి ఘనం గళం కుల శిరో భూషం మునిం గాయకమ్
దో ర్యుగ్మం హరిదాసవ ద్విజ ఉరో నాభిం కలి ధ్వంసినమ్
శ్రీపాదం మధురం కవిం యతిపతిం బాహూ శ్శఠారే ర్బుధాః."

శ్రీ నమ్మాళ్వారులకు పూదత్తాళ్వారులు మస్తకము. పొయ్గై యాళ్వారులు, పే యాళ్వారులు నేత్రములు. పెరియాళ్వారులు వక్త్రము. తిరుమళిశై యాళ్వారులు గళము. కులశేఖరాళ్వారులు, తిరుప్పాణాళ్వారులు హస్త ద్వంద్వము. తొండరడిప్పొడి యాళ్వారులు వక్షఃస్థలము. తిరుమంగై యాళ్వారులు నాభి. మధుర కవులును, శ్రీమ ద్రామానుజులును చరణ ద్వంద్వము అని పెద్దలు అభివర్ణించు చున్నారు.

వీరి శిరస్సు శ్రీరంగనాథులు. హస్తాదులు పది మంది యాళ్వారులు. నడుము, పిరుదులు, తొడలు నాథ యామునాదులు. శ్రీపాదములు - శ్రీమ ద్రామానుజులు అనియును మఱి కొందఱు అభివర్ణించుచున్నారు.

"త్రైవిద్య వృద్ధ జన మూర్ధ విభూషణం యత్
సంపచ్చ సాత్త్విక జనస్య యదేవ నిత్యమ్
య ద్వా శరణ్య మశరణ్య జనస్య పుణ్యమ్
త త్సంశ్రయేమ వకుళాభరణాంఘ్రి యుగ్మమ్."

## శ్రీ వకుళాభరణుల అవతార వైభవము

"భక్తి ప్రభావ భవ దద్భుత భావ బంధ
సింధు క్షిత ప్రణయ సార రసౌఘ పూర్ణః
వేదార్థ రత్న నిధి రచ్యుత దివ్య ధామా
జీయా త్పరాంకుశ పయోధి రసీమ భూమా."

ఆళ్వారుల వాచామగోచర మగు దివ్య మహిమలను బరికించి, విబుధులు అనేక విధములుగ నుల్లేఖించుచున్నారు. సంస్కృత వేదోద్ధరణమునకై సాక్షాత్తుగ శ్రీమ న్నారాయణుఁడే శ్రీ వ్యాస మహర్షి స్వరూపమున నవతరించినటుల, ద్రావిడ వేదోద్ధరణమునకై ఈ యాళ్వారుల రూపమున మరల శ్రీమ న్నారాయణుఁ డవతరించె నని కొందఱు వర్ణించుచున్నారు.

'సేనేశోఽవతరిష్యతి' అను ప్రమాణ వచనము లున్నందున, శ్రీ విష్వక్సేనులే వీర లని మఱి కొందఱు కీర్తించుచున్నారు. ఇటులనే, లోకోజ్జీవనార్థ మవతరించిన నిత్య సూరులలో నొక రనియు, 'కరైకణ్డార్' అనునటుల భగవ న్నియమనానుసారము సంసారి చేతనుల నుజ్జీవింపఁజేయుటకై యవతరించిన ముక్తులలో నొక రనియు, జన్మాంతర సహస్ర సంచిత సకల సుకృత పరిపాక ఫలముగ బద్ధ చేతనుల యందే ఒకరి ట్లవతరించియుందు రనియు బహు భంగుల వితర్కించు చున్నారు. ఏది యె ట్లున్నను - భగవ న్నిర్హేతుక జాయమాన దివ్య కటాక్ష పరీవాహ పరిపూరితు లగుటచే, అతి విలక్షణ దివ్య జ్ఞాన వైరాగ్య భక్తి యుక్తు లగు మహానుభావులు వీ రనుట మాత్రము నిర్వివాదమైన యంశము.

వీరి జన్మ కాలాది నిఖిల చరిత్రాంశములును, సకలేతర విలక్షణ వైభవాదులను, వీరి దివ్య ప్రబంధ ప్రకర్షాదులును స త్సంప్రదాయానుసారముగ శ్రీమ ద్రామానుజుల సమకాలికు లగు శ్రీ గరుడ వాహన పండితులచే విరచిత మగు 'శ్రీ దివ్య సూరి చరిత్ర' కావ్యము నందును, శ్రీ నంబిళ్ళై స్వామి వారి శిష్య రత్న మగు శ్రీ పిన్బళగియ పెరుమాళ్ జీయర్(పశ్చాత్ సుందర దేశికులు) వా రానతిచ్చిన 'గురు పరంపరా ప్రభావము' నందును, 'అణ్ బిళ్ళై కందాడై అప్పన్' అను వారు ఆన తిచ్చిన 'పెరియ తిరుముడి యడైవు' అను గ్రంథము

నందును, శ్రీ మణవాళ మహామునులు ప్రసాదించిన 'ఉపదేశ రత్నమాల' అను దివ్య ప్రబంధము నందును, శ్రీమ దనంతాచార్య కృత మగు 'ప్రపన్నామృతము' నందును, 'ముముక్షు జన కల్పకము' 'ఆచార్య సూక్తి ముక్తావళి' మొదలగు ఆంధ్ర గ్రంథముల యందును విశిష్ట క్రమముతో నిరూపింపఁబడి యున్నవి.

ఇది యిట్లుండ, అధునికు లగు విమర్శకాగ్రేసరులును శాసనాది ప్రమాణముల నాధారముగ జేసికొని, ఆంగ్లమునను, ద్రావిడమునను శ్రీయుతులు - గోపీనాథరావు, రాఘవయ్యంగారు మున్నగువారు కొన్ని గ్రంథములను విరచించి, చక్కగ విమర్శించియున్నారు. దేశ కాలాదులలో భేద మున్నను, ఆళ్వారుల అప్రతిమ ప్రభావమున నెవ్వరికిని విప్రతిపత్తి లేదు.

శ్రీ పిళ్ళలోకాచార్యులవారి యనుజవర్యు లగు శ్రీమ దళగియ పెరుమాళ్ నాయనారులు -'ఆచార్య హృదయము' అను అత్యాశ్చర్య కర మగు గంభీర రమ్యమైన విశిష్ట గ్రంథములో - శ్రీ నమ్మాళ్వారుల అప్రతిమ ప్రభావములను, వారి దివ్య ప్రబంధ వైభవాదులను అత్యద్భుత ప్రక్రియలతో - బహు భంగుల, మహా విస్తారముగ నిరూపించియున్నారు. అది యొక అపూర్వ రచనా సంవిధానము. అసదృశము. ఉల్లోక మహిమాన్వితము.

## నమ్మాళ్వారుల దివ్య ప్రబంధ దివ్యానుభవము

"ఋషి జుషామహే కృష్ణ తృష్ణా తత్త్వ మివోదితమ్
సహస్ర శాఖాం యోఽద్రాక్షీత్ ద్రామిడం బ్రహ్మ సమ్మితామ్."

నమ్మళ్వారులు తమ దివ్య ప్రబంధమున, తమ భగవ దనుభవ ప్రకారముల ననేక భంగుల నభివర్ణించియున్నారు. కర్మ సాధ్యమై,

భగవత్ప్రాప్తికి సాధనమైన ఉపాసకుల భక్తి కంటెను - సర్వేశ్వరుని యాచించి, కైంకర్యార్థము ప్రపన్నులు పొందెడు భక్తి కంటెను, ఆళ్వారుల భక్తి స్వరూపము పరమ విలక్షణమైనది. సర్వేశ్వరుఁడు - తన నిర్హేతుక కృపా కటాక్ష సర్వస్వమును ఈ యాళ్వారులపై ప్రసరింపఁ జేసి, తన సంశ్లేషణములచే వీరి పరభక్తి - పరజ్ఞానాదుల నభివృద్ధి నొందించుచుండెను ఆ యనుభవానంద రస ప్రవాహమే దివ్య ప్రబంధ దివ్యామృతము. సంశ్లేష మనఁగా - బాహ్యానుభవము లభింపనందున, కలతఁ జెందిన యతఃకరణమునకు శైథిల్యావస్థను పొందుచున్నారు. ఇట్టి స్త్రీత్వావస్థను వీరు - సఖి (తోళిమార్), జనని (తాయిమార్), నాయకి (మంగళ్) అను త్రివిధ భావములతో ననుభవించిరి.

ఇచ్చట - ప్రణవము నందలి అకార వాచ్యుఁడైన సర్వేశ్వరునకును, మకారవాచ్యుఁడైన జీవునకును ఏర్పడియున్న అనన్యార్హ సంబంధ జ్ఞానమే వానితో వీనిని చేర్చుచున్నది గాన, సఖియగా చెప్పఁబడుచున్నది. ఇటులనే - 'స్వతంత్రించుట స్వరూప విరుద్ధ' మని యుపదేశించెడి 'నమః' పద ప్రతిపాద్యమైన ఉపాయాధ్యవసాయ జ్ఞానమే తల్లిగా నిరూపింపఁబడుచున్నది. 'పుంసాం దృష్టి చిత్తాప హారిణం' అనునటుల పురుషుల యొక్కయు దృష్టి చిత్తాదుల నపహరించు పరమ పురుషుని లోకోత్తర కమనీయ దివ్య మంగళ విగ్రహ సౌందర్య సౌభాగ్యాదులు ఆళ్వారులకు స్త్రీత్వ భావనను గలుగజేయుట చేతను, 'అనన్యార్హత్వ - అనన్య భోగ్యత్వ - అనన్య శరణ్యత్వము' లను పతివ్రత కుండు ఆకార త్రయము వీరికి స్వాభావసిద్ధముగ నుండుట చేతను వీరికి నాయకావస్థ సుసంప్రతిపన్నమే. ఇట్టి స్వాపదేశార్థము (వ్యంగ్యార్థము) లన్నియు భగవద్విషయ వ్యాఖ్యానాదుల మూలమున విపులముగా తెలియనగును. ఈ రీతిగా వీరి గ్రంథములు నవ రస భరితములై, భక్తి శృంగార వైచిత్ర్యముల బహు భంగుల నిరూపించుచు,

పరమ భోగ్యములై యున్నవి. కనుకనే, శ్రీనమ్మాళ్వారులకు - 'ఋషి' యనియు, 'కవి' యనియు గూడ వ్యవహార మున్నది.

వీరి లోకానుభవమును - దివ్య జ్ఞానమును - బోధనా శక్తిని - వర్ణనా నైపుణ్యమును - శృంగార చేష్టలను - ఆర్తిని - భగవ ద్భక్తిని బాగుగా పరిశీలించితిమేని, నమ్మాళ్వారులు - నిస్సమాభ్యధిక కవి తల్లజు లని మనము గ్రహింపఁగలము వీరి శిష్య తల్లజు లగు మధుర కవులు - 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను దివ్య ప్రబంధమున వీరి దివ్య కవితా మాధుర్యాదులను, అప్రతిమాన వైభవాదులను బహు భంగు లుగా అభివర్ణించియున్నారు. ద్రావిడ కవి చక్రవర్తి యగు కంబ మహా కవియును - మహానుభావు లగు వీరి కవితా రీతులకు ముగ్ధుఁడై, వీరికి ప్రశిష్యు లగుటయే కాక, 'శ్రీ శఠకోప నందాది' అను గ్రంథ రత్న మాలను గూడ గురు దక్షిణగా సమర్పించిరి. అంతా కంబ కవి - నిఖిల సాహిత్య వాఙ్మయము ఆళ్వారుల పాశురములలో నొక పాదము నకు సరిపోల దని నొక్కి వక్కాణించియున్నాఁడు.

## నమ్మాళ్వారుల అవతార ప్రమాణములు

**"వకుళాభరణం వన్దే జగదాభరణం మునిమ్**
**య శ్శృతే రుత్తరం భాగం చక్రే ద్రామిడ భాషయా"**

శ్రీ శఠకోప మునీంద్రుల దివ్య చరిత్ర, ప్రభావము లన్నియు పురాణాగమాది గ్రంథములలో వర్ణింపఁబడి యున్నవి.

శ్రీ మ ద్భాగవతములో —

**"కృతాదిషు నరా రాజన్ కలౌ విచ్ఛన్తి సంభవమ్**
**కలౌ ఖలు భవిష్యన్తి నారాయణ పరాయణాః**
**క్వచి త్క్వచి న్మహా భాగాః ద్రవిడేషు చ భూరిశః**
**తామ్రపర్ణీ నదీ యత్ర కృతమాలా పయస్వినీ**
**కావేరీ చ మహా భాగా ప్రతీచీ చ సరస్వతీ."**

శ్రీ విష్ణు పురాణములో –

"యే పిబన్తి జలం తేషాం మనుజా మనుజేశ్వర ।
తేషాం నారాయణే భక్తి ర్భూయసీ నిరుపద్రవా."

అనన్త సంహితలో –

"తతః కలియుగ స్యాదౌ వైశాఖ్యాం విశ్వ భావనః
ఆవిర్భవిష్యతి శ్రీమాన్ శఠకోప మహామునిః
సేనేశ కరుణా లబ్ధ పంచ సంస్కార సంయుతః
తథా మధుర కవ్యాదేః పంచ సంస్కారదో గురుః
తస్మై ద్రవిడ వేదానాం చతుర్ణా ముపదేశకృత్
పునశ్చ నాథ మునయే పంచ సంస్కార పూర్వకమ్
భట్టనాథ ప్రభృతిభిః నిర్మితై ర్దివ్య యోగిభిః
దివ్యై ర్వింశతిభి ర్భోగ్యైః ప్రబన్ధై స్సహ దేశకః
తేషాం ద్రమిడ వేదానాం చతుర్ణా ముపదేశకృత్
వరయోగి ప్రభృతిభి స్స్వన్యై ర్వరవరో మునిః
శ్రీ నగర్యాం మహా తేజా స్తింత్రిణీమూల సంశ్రయః
తత్త్వ దర్శి నతాం శ్రేష్ఠో వర్తిష్యతి వసుంధరే."

"క్రూరే కలి యుగే ప్రాప్తే నాస్తికైః కలుషీ కృతే
విష్ణో రంశా సముద్భూతో వేద వేదార్థ తత్త్వవిత్
స్తోత్రం వేదమయం కర్తుం ద్రావిడ్యా పిచ భాషయా."

ఇట్లింకను శ్రీ పాంచరాత్ర సంహితలలో – ద్రావిడ వేదమును గూర్చియు, ఆళ్వారుల వైభవాదులను గూర్చియు విపులముగ దెలుపఁబడి యున్నది.

## శ్రీ నమ్మాళ్వారులే ప్రపన్న జన కూటస్థులు

"యత్యై శ్శ్రియః ప్రసాదేన ప్రాప్తి సర్వజ్ఞ సంపదమ్
ప్రపన్న జన కూటస్థం ప్రపద్యే శ్రీ పరాంకుశమ్."

పరమ కరుణామయుఁ డగు సర్వేశ్వరుఁడు మొట్ట మొదట చతుర్ముఖుని సృజియించి, అతని ద్వారా నిఖిల ప్రపంచమునకును ఉపదేశించిన మాతా పితృ సహస్రములకన్న వత్సలతరములైన వేద శాస్త్రములు –

"న్యాస ఇ త్యాహు ర్మనీషిణో బ్రహ్మాణం న్యాస ఇతి బ్రహ్మా."

అని, న్యాస శబ్దార్థముచే ప్రపత్తిని, పరమ పురుషార్థ రూపమైన మోక్షానుభూతికి పరమ సాధనముగ నుపదేశించుచున్నవి. కర్మ జ్ఞాన భక్త్యా ద్యుపాయములవలె గాక, ప్రపత్తి సర్వ సులభమై, స్వరూపానురూపమై, సర్వాధికారమై, దేశ కాలాది నియమ విరహితమై, అవిలంబముగ సకల పురుషార్థములను కరతలామలక మొనర్చునదై, సిద్ధోపాయమైన శ్రీమన్నారాయణుని శరణ వరణ రూపమై యున్నందున, చరమ పరమ తరణోపాయముగా ప్రాముఖ్యము వహించి యున్నది.

"పతిం విశ్వస్య బ్రహ్మణే త్వా మహస ఓమి త్యాత్మానం యుంజీత."

అని, దాని ప్రయోగమునుగూడ, ఈ యుపనిషత్తు బోధించుచున్నది నిఖిల ప్రపంచ రక్షకుఁ డగు పరమాత్ముని చరణ నళినములో ప్రణవము నుచ్చరించుచు, ఆత్మను సమర్పింపవలయు నని దాని యర్థము

"తస్మా దపి వధ్యం ప్రపన్నం న, ప్రతి ప్రయచ్ఛన్తి."

అను ప్రమాణములు – వధ్యుని గూడ ప్రపత్తి కధికారిగా నిర్ణయించుచున్నవి.

"యది వా రావణ స్స్వయమ్,"

అనిగదా శ్రీ రామచంద్రమూర్తి అన తిచ్చినది ! శ్రీకృష్ణ భగవానుఁడు – 'పుణ్యాపుణ్యముల నన్నింటిని పరిత్యజించి ర' మ్మనెను.

'పరమ కరుణామయుఁ డైన శ్రీరామచంద్రమూర్తి, పాపము తోడ నైనను రమ్మనె' నని ఆచార్యు లానతిచ్చియున్నారు.

మఱియును - వేద శాస్త్ర జన్య జ్ఞానము, ఆ ప్రక్రియయు అత్యంతము దుష్కర మైనందున, అవశ్య జ్ఞాతవ్యమైన రహస్య త్రయ మును పరమ కరుణాకరుఁ డగు ఆ సర్వేశ్వరుఁడే ప్రవర్తింపఁజేసెను. అందు - బదరికాశ్రమమున, స్వాంశీభూతుఁడైన నరుని వ్యాజీకరించు కొని, తిరుమంత్రమును, పరమ పదమున పెరియ పిరాట్టి (శ్రీ లక్ష్మీ దేవి) ని వ్యాజీకరించుకొని ద్వయ మంత్ర రత్నమును, కౌరవ పాండవ యుద్ధారంభ సమయములో రథోపస్థమున పార్థుని వ్యాజీక రించుకొని చరమశ్లోకమును నిఖిల ప్రపంచమున కుపదేశించెను. అట్టి ప్రపత్తి మార్గమును, దీర్ఘ శరణాగతి రూప మగు తమ 'తిరు వాయ్ మొళి' దివ్య ప్రబంధమునందు సాంగోపాంగముగ నిరూపించుటయే గాక, శ్రీ లక్ష్మీ దేవిని పురుషకారముగఁ జేసికొని, శ్రీనివాస భగవా నుని దివ్య పాదారవిందములలో - 'ఉలగముణ్డ పెరువాయా' అను 6 - వ పది 10 - వ దశకమున -

"అగలగిల్లేన్ ఇఱైయు మెన్ఱు అలర్ మేల్ మంగై యుఱై మార్పా
నిగరిల్ పుగళాయ్ ఉలగమ్ మూన్ఱుడైయాయ్ ఎన్నై యాళ్వానే
నిగరిల్ అమరర్ మునిక్కణజ్ఞళ్ విరుమ్బుం తిరువేంగడతానే
పుగళొ న్ఱిల్లా అడియేన్ ఉన్నడిక్కీళ్ అమర్న్దు పుగన్దేనే."

అని, అకించన్య అనన్యగతిత్వరూప మగు స్వరూపమును విజ్ఞాపన చేసికొనుచుఁ పరమాత్ముని శ్రియః పతిత్వ - సౌలభ్య - సౌశీల్య - స్వామిత్వ - వాత్సల్య - కారుణ్యాది స్వరూప నిరూపక - నిరూపిత స్వరూపక - ఆశ్రయణ సౌకర్యాపాదుకాది నిఖిల కల్యాణ గుణ గణము లను, దివ్య మంగళ విగ్రహ విభూత్యాదులను అభివర్ణించుచు, సాంగోపాంగ మగు ప్రపత్తిని అనుష్ఠించుచున్నారు. అందుచే, వీరే

'ప్రపన్న జన కూటస్థులు' అని ప్రసిద్ధిని జెందిరి. వీరి ననుసరించియే యామున మునులును –

"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ
న భక్తిమాన్ త్వ చ్చరణారవిందే
అకించనో ఽనన్యగతి శ్శరణ్యం
త్వ త్పాదమూలం శరణం ప్రపద్యే."

అని స్తోత్ర రత్నమునందును, శ్రీమ ద్రామానుజ ముని సార్వభౌములు –

"ఓమ్ భగవ న్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభ వై శ్వర్య శీలా ద్యనవధికాతిశయాసంఖ్యేయ కల్యాణ గుణగణాం పద్మావనాలయాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్య మహిషీం అఖిల జగ న్మాతరం అస్మ న్మాతరం అశరణ్య శరణ్యాం అనన్య శరణః శరణ మహం ప్రపద్యే."

అని యారంభించి, శరణాగతి గద్య యందును శ్రీ దేవిని పురస్కరించుకొని, ఆ శ్రియఃపతి దివ్య చరణార విందములయందు సాంగోపాంగ మగు ప్రపత్తి ననుష్ఠించిరి. వస్తు తత్త్వమున, స్తోత్ర రత్న గద్య త్రయాదు లన్నియు నమ్మాళ్వారుల శ్రీసూ క్త్యుపజ్ఞములే.

మఱియును ప్రబంధారంభముననే – 'ఉయర్వర ఉయర్ నలమ్' అను పాశురమున, సర్వేశ్వరుని దివ్య మంగళ విగ్రహ విభూత్యాదుల నెల్ల నభివర్ణించి, 'వారి దివ్య తేజ స్సంపన్నములైన శ్రీపాదముల నాశ్రయింపు' మని తమ మనస్సును ప్రబోధించు ప్రణవము నందలి అక్షరముల మూడింటిని వ్యత్యస్త పఱచి, 'ఉ – మ – అ' అని పాదాదులయందు పొందుపఱచిరి. మొదట, పురుషకార భూతురాలైన శ్రీదేవిని, లేక – అనన్యార్హ సంబంధమును బోధించు

'ఉ' కారమును, తదుపరి - చేతనుని బోధించు 'మ' కారమును, పిమ్మట - పరమ చేతనుని బోధించు 'అ' కారమును సంఘటిత మొనర్చుటలో - అనేకములైన పరమార్థములు నిబిడీకృతములై యున్నవి. ఇదియును గాక, అధికృతాధికార మగు ప్రణవమును సర్వాధికారముగా గూడ నొనర్చిరి.

ఇట్లు సర్వ సులభ మగు ప్రపత్తి ననుష్ఠించి, దాని పరమ ప్రయోజన మగు పరమాత్మ నిత్య సంశ్లేషము తమకు సిద్ధించిన దని, 'ఎన్ అనావఱ చ్చూళ్న్దాయే' అను ప్రబంధము యొక్క అంతమునం దున్న పాశుర భాగముచే నభివ్యక్త మొనరించిరి. అదియునుఁ గాక, స్వాంతరంగ శిష్యు లగు శ్రీ మధుర కవులకు తా మానతిచ్చిన దివ్య ప్రబంధముల నన్నిటిని, సర్వేశ్వరుఁడు తన జ్యేష్ఠ పుత్రుఁ డగు చతుర్ముఖునకు నిఖిల వేదముల నుపదేశించినటుల నుపదేశించుటయే గాక, కాల వైపరీత్యమున మధ్య కాలములో - ఆళ్వారుల దివ్య ప్రబంధము లన్నియును ఉచ్ఛిన్నములు కాఁగా, శ్రీ మధుర కవు లను గ్రహించిన 'కణ్ణినుణ్ శిఱుత్తాम्బు' అను మహా ప్రభావ సంపన్న మగు దివ్య ప్రబంధము యొక్క నిరంతర జప ధ్యానాదులచే సంతుష్టులై, స్వాంతరంగ భక్తులైన శ్రీమ న్నాథమునులకు సాక్షాత్కరించి, ఆళ్వారు లందఱును ప్రసాదించిన నిఖిల ప్రబంధములను తమ దివ్య వదనారవిందమునుండియే ప్రసరింపఁజేసిరి. కనుకనే, శ్రీ నమ్మాళ్వారులు ప్రపన్న జన కూటస్థు లని ప్రసిద్ధి వహించిరి.

'నాథోపజ్ఞం ప్రమత్తమ్' అని శ్రీ వేదాంత దేశికుల వా రానతిచ్చి నటుల, ఉభయ వేదాంతములును శ్రీమ న్నాథమునులనుండియే ప్రవర్తిల్లి నందున, వారికి ప్రథమోపదేశికులైన శ్రీ నమ్మాళ్వారులు ప్రపన్న జన కూటస్థు లగుచున్నారు. కనుకనే,

"మాతా పితా యువతయ స్తనయా విభూతిః
సర్వం య దేవ నియమేన మ దన్వయానామ్
ఆద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం
శ్రీమ త్త దంఘ్రి యుగళం ప్రణమామి మూర్ధ్నా."

అను శ్లోకమున శ్రీ ఆళవందారులు – 'ఆద్యస్య నః కులపతేః' అని స్పష్టముగ నిర్దేశించియున్నారు. శ్రీమ ద్వేదాంతదేశికులను – 'మన సంప్రదాయమునకు ఈ కలియుగారంభమున శ్రీ శఠకోప మునీశ్వరులు ప్రథమ ప్రవర్తకులైరి' అని, ఈ విషయమునే వ్యక్త పఱచిరి.

## శ్రీ శఠకోపమునీశ్వరులు – శ్రీశఠకోపము

"వకుళాలంకృతం శ్రీమ చ్ఛఠకోప పద ద్వయమ్
అస్మ త్కుల ధనం భోగ మస్తు మే మూర్ధ్ని భూషణమ్."

పై తనియన్ శ్లోకములోని 'ఆద్యస్య నః కులపతేః' అనియును అర్థమును కొందఱాచార్యులు నిర్వహించున్నారు. లక్ష్మీ నాథ సమారంభము గదా శ్రీవైష్ణవ గురుపరంపర ! అప్పుడు వారి అంఘ్రి యుగళము వకుళాభిరాము లగు శ్రీ నమ్మాళ్వారు లనియే స్పష్ట మగు చున్నది. కనుకనే – భగవంతుని శ్రీపాదుకలకు – 'శఠకోప' మని ప్రసిద్ధి గలిగినది. దివ్య దేశములుగా వ్యవహరింపఁబడు శ్రీ వైష్ణవ దేవా లయములలో – శ్రీ శఠకోపుల (నమ్మాళ్వారుల) విగ్రహ మొకవేళ లేకున్నను, భగవంతుని పాదుక లగు శఠకోపము మాత్రము తప్పక ప్రతిష్ఠింపఁబడవలసి యున్నది. అది లేని దివ్య దేశమే యెచ్చటను ఉండదు.

శ్రీ మహా విష్ణువు శఠకోపుఁ డను రాక్షసుఁడు శ్రీవారి చరణ నళినములపై తన శిరస్సును వాల్చి, 'ఇటుపై శ్రీవారి చరణములు, నా పేరుతో వ్యవహరింపఁబడునటుల అనుగ్రహింపుఁడు' అని ప్రార్థించి నటులను, నాఁటినుండియే శ్రీవారి చరణములకు - 'శఠకోప' మని పేరు ప్రసిద్ధులు గలిగిన వని కొందఱు చారిత్రకులు చెప్పుచున్నారు. ఈ విషయమును ప్రతిపాదించు కొన్ని శ్లోకములుగూడ, శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయ పత్రికయందు ప్రకటింపఁబడినవి. అయినను, అది అంత తాత్త్వికమైన - ప్రశస్తమైన నిర్వాహము కాదని స్పష్టముగా దెలియుచున్నది. ఎట్లనఁగా, త్రివిక్రమావతారమునందు సర్వేశ్వరుఁడు తమ శ్రీపాదములను వివేక్యవివేకి విభాగముఁ జూపక, అందఱి శిరస్సుల పైనను తమ శ్రీపాదములు నుంచి, ఆ శ్రీపాద స్పర్శ ప్రభావమువలన, నిఖిల ప్రాణుల సకల విధ పాపముల దహింపఁజేసి, పరమ పుణ్యమును గలుగఁజేసి, ఎల్లఱిని తరింపఁ జేసినటుల తమ మృదు మధుర మకరంద సందోహ మగు ద్రావిడ దివ్య ప్రబంధముచే, నిఖిల ప్రాణి కోటిని గూడ సర్వేశ్వరుని దివ్య కరుణా వాత్సల్యముల కభిముఖులుగా నొనరించి, తరింపఁజేసిన శ్రీ నమ్మాళ్వారులే తచ్చరణారవింద వ్యపదేశ భాజను లగుట - సమంజసమే గాని, వేరు గాదు. 'స్తనంధయ ప్రజకు, జననీ స్తన మండలము మొట్ట మొదటి రేవయినటుల, పరమ ప్రపన్నునికి సర్వేశ్వరుని దివ్య చరణారవిందములే మొట్ట మొదటి అవగాహన స్థానము' అని, అభియుక్తాగ్రేసరులు సెలవిచ్చియున్నారు. సర్వేశ్వరుని దివ్య కల్యాణ విభూత్యాదుల ననుభవించుటకు నమ్మాళ్వారుల దివ్య ప్రబంధమునకంటె వేఱొక గ్రంథము లేదు; కలుగబోదు. 'న భూతో న భవిష్యతి.' అందువలననే, నమ్మాళ్వారుల నామాంతర మగు శఠకోప నామమున భగవంతుని శ్రీపాదుకలు వ్యవహరింపఁబడుచున్న వనుట - సమంజసమైన విషయము.

శ్రీ వేదాంతదేశికులవారి పాదుకా సహస్రమును అనుభవించిన వారి కిట్టి సంశయమే గలుగదు. శ్రీమ దళగియ మణవాళ నాయనార్ల 'పద కమల సహస్ర' మను గ్రంథ రత్నము గూడ అవతరించి నటులఁ దెలియుచున్నది కాని, మన యభాగ్య వశమున అది యుపలబ్ధము కాలేదు. 'తెన్న రంగన్ పొన్నడి' (శ్రీరంగనాథుల పద కమలము)-'తిరువరంగం పొన్నడి' అను నామధేయములు నమ్మాళ్వారుల కున్నవని సంప్రదాయజ్ఞు లెల్లఱును ఎఱుంగుదురు.

మఱి యొక పరమార్థముగూడ శ్రీవైష్ణవ సంప్రదాయమున నున్నది. 'శిరియ తిరువడి'(చిన్న శ్రీపాదము)-'పెరియ తిరువడి'(పెద్ద శ్రీపాదము)అను వ్యవహారము శ్రీ హనుమంతునకును, శ్రీ గరుత్మంతునకును ఉన్నవి. 'తిరువడి' అనఁగా - శ్రీపాదము. ఇట్లుండ, శ్రీ విష్వక్సేనుల స్వరూపు లగు శ్రీ నమ్మాళ్వారులకు శ్రీవారి పాదుకా వ్యవహారము అత్యంత ముపపన్నమై యున్నది. కనుకనే, 'పరమ భాగవతోత్తములైన ఆళ్వారుల సంబంధము ఎటులనైనను గలిగిన, అందఱును తరింతురు' అని యోచించియే, సమయజ్ఞులు - మహా ప్రాజ్ఞులగు శ్రీవైష్ణవ సమయాచార్యులు విష్ణ్వాలయములలో శఠకోప (శఠారి) ప్రతిష్ఠను విధిగ నేర్పాటుచేసి యున్నారు. శ్రీ పాంచరాత్ర-వైఖానసా ద్యాగమములయందును శ్రీ శఠారి ప్రతిష్ఠా క్రమము విశిష్టముగ పేర్కొనఁబడి యున్నది. అదియునుఁ గాక, భగవంతుని పరమ ప్రసాదముగ ఆంతరమైన మాలిన్య నివృత్తికిని భగవ త్సంబంధ ప్రాప్తికిని శ్రీవారి పాదుకలైన శ్రీ శఠారిని తలలపై నుంచుటను, సకల లోకోజ్జీవనార్థమై, సువిశాల హృదయముతో - పరమౌదార్యముగ ఏర్పాటు చేసి యున్నారు. ఆహా ! ఏమి వారి యౌదార్యము !! ఏమి వారి విశాలదృక్పథము !!!

భగవంతుని శ్రీపాదుకలకు - 'శఠకోప' మనియు, 'శఠారి' యనియు వ్యవహార మున్నటుల, శ్రీ నమ్మాళ్వారుల శ్రీపాదుకలకు-

'రామానుశన్' (శ్రీరామానుజులు) అనియు, శ్రీమ దాశ్రిమానుజుల వారి పాదుకలకు - 'ముదలి యాండాన్ (దాశరథి) యనియు వ్యవహారము లా యా దివ్య సన్నిధులలో నున్నవి. ఇటుల వారి వారి యంతరంగ భక్తుల నామధేయమే వారి వారి పాదుకలకు వ్యవహరింపఁబడుచున్నది. వీని కెల్ల మూల కారణము - శఠకోప వ్యవహారమే అనుటలో సందియము లేదు.

"యత్పాదాంభోరుహ ధ్యాన విధ్వస్తాశేషకల్మషః
వస్తుతా ముపయాతోఽహం యామునేయం నమామి తమ్."

అను శ్లోకమున, 'పదాంభోరుహ' శబ్దముచే, శ్రీమ దాశ్రిమానుజ మునులకు శిష్యులైన పంచ పూర్ణులు(పెరియ నంబి, తిరుక్కోట్టియూర్ నంబి మొదలగు ఐదు మంది ఆచార్యులు) కీర్తింపఁబడుచున్నా రని సంప్రదాయాభిజ్ఞు లగు పెద్ద లానతిచ్చుచున్నారు.

## దివ్య ప్రబంధ వైభవ సంగ్రహము

"భక్తామృతం విశ్వ జనాను మోదనం
సర్వార్థదం శ్రీ శఠకోప వాఙ్మయమ్
సహస్ర శాఖోపనిష త్సమాగమం
నమా మ్యహం ద్రావిడ వేద సాగరమ్."

శ్రీ నమ్మాళ్వారుల దివ్య ప్రబంధములు - వేద తుల్యములు ; వేదోపబృంహణములు. వేద సూక్త ద్రష్టల వలె ఆళ్వారులును ఋషి ప్రవరులు. ఋగాది వేద చతుష్టయమునకు పదు నాలుగు అంగోపాంగము లున్నట్లే, శ్రీ నమ్మాళ్వారుల నాలుగు ప్రబంధములకును - 'ఇరుం తమిళ్ నూల్ పులవన్' అను నటుల, అగాధ మగు ద్రావిడ వేద శాస్త్ర పారంగతులైన శ్రీ తిరుమంగై యాళ్వారు లనుగ్రహించిన శాస్త్ర రూపము లగు ఆఱు ప్రబంధములును, తక్కిన ఎనిమిది మంది

ఆళ్వారు లొసంగిచ్చిన దివ్య ప్రబంధములును అంగోపాంగములుగ నున్నవి. ఇతర విద్య లన్నిటికన్నను వేదములు ప్రధానము లైనట్లు, ఇతర దివ్య ప్రబంధము లన్నిటి కన్నను, శ్రీ నమ్మాళ్వారుల ప్రబంధ చతుష్టయము ప్రధానమై యున్నది.

శాస్త్ర మనియు, భగవ దాజ్ఞా రూప మనియు, నిత్య నిర్దుష్ట మనియు, సత్య ప్రతిపాదక మనియు, పరమ శ్రావ్య మనియు, అనా ద్యంత మనియు వేదమున కుండు సకల లక్షణములును ఈ ద్రావిడ దివ్య ప్రబంధములకు గూడ నున్నవి. భగవంతుని దివ్య చరణార విందమునుండి వేదము లావిర్భవించి, చతుర్ముఖాదులచే ఉపదేశ పరం పరగా ప్రవర్తితము లైనటుల, ఆ భగవంతుని ప్రసాదాసాదితములై, శ్రీ నమ్మాళ్వారుల దివ్య వదనారవిందము నుండి, భగవ దనుభవ పరీవాహ రూపముగ ద్రావిడ దివ్య ప్రబంధము లావిర్భవించినవి.

వేదవ్యాసుని వలెను - మంత్ర ద్రష్ట లగు ఋషుల వలెను, 'ఋషి' యనియు, 'కవి' యనియు వ్యవహారము నమ్మాళ్వారుల కున్నందున, వేదము లెటుల పూర్వ కల్పీయములుగా భావితము లైనవో - అటులనే, దివ్య ప్రబంధోపదేశము గూడ, యథా పూర్వ కల్పనమే గాని, అపూర్వ సృష్టి మాత్రము కాదు. విశ్వామిత్రాది ఋషులు, తమ తప శ్శక్తిచే వేద మంత్రములను దర్శించి. 'వేద ద్రష్ట' లని కీర్తి గాంచి నటుల, శ్రీ నమ్మాళ్వారులును తమ పర భక్తి పర జ్ఞాన పరమ భక్తుల ప్రభావము వలన, ద్రావిడ వేద మంత్రములను దర్శించి, 'ద్రావిడ దివ్య ప్రబంధ ద్రష్ట' యని కీర్తి గాంచిరి. సర్వేశ్వరుఁడే రేయిం బవళ్ళు సంత జెప్పగా అధికరించితి నని శ్రీనమ్మా ళ్వారులే పలు తావుల బలికెను. శ్రీ మధుర కవులు, శ్రీమ న్నాథ మునులు మొదలగు వారికిని, గురూచ్చారణ పూర్వకానుచ్చరణ రూప మగు అధ్యయన క్రమము తోడనే ఆళ్వారుల దివ్య ప్రబంధము లన్ని

యును సంప్రాప్తము లైనవి తిరువిరుత్తము, తిరువాశిరియము, పెరియ తిరువన్దాది అను మూఁడు దివ్య ప్రబంధములును - ఋగ్వేదము, అథర్వ వేదము, యజుర్వేదముల వంటివి. ఇఁక గాన రస మగు తిరు వాయ్ మొళి - దివ్య గాన మేదుర మగు సామ వేదము వంటిది.

ఋగ్వేదము సామ వేదముచే రస యుక్త మైనదై, స్తోభముచే విస్తరించిన చందమున, తిరువాయ్మొళియును తిరువిరుత్తము చేర, సంయుక్త మైనదై, శబ్దార్థ రసములతో నిండి నిబిడీకృతమై, సహస్ర పద్యాత్మకముగా విస్తరించెను. 'వేదానాం సామవేదో ఽస్మి' అని సర్వేశ్వరుఁ డానతిచ్చినట్లు మాత్రమే గాక, అందును సార తమ మైన ఛందోగ్య సామమే తిరువాయ్మొళి దివ్య ప్రబంధ మని తోచునటుల, 'ఉద్గీధ' సామము యొక్క ప్రతీక మైన ప్రణవమునందలి 'ఉత్' అను ప్రధానాక్షరములలో - 'ఉయర్వర' అని ఉపక్రమమున 'ఉ' కారమును 'ఉయర్న్దే' అని ఉపసంహారమున 'త' కారమును చేర్చి సంపుటీకరించి కీర్తించుటయే గాక, 'ఉ - మ - అ' అను ప్రణవాక్షరములను పాదాది యందు సంఘటిత మొనర్చి, అర్చిరాది గమన వర్ణముతో సమాప్తి నొనరించియున్నారు. సామ వేద గానము నిత్య ముక్తులకు భోగ్యమై యున్నటుల, భగవ ద్గుణానుభవపరు లగు ముక్తులకు దీనిని అమృత ముగాఁ జేసి, సామ ఘోషము వలె గొప్ప ధ్వని గల 'తిరువధ్యయన' మని ప్రీతితో బాడుట వలన, తిరువాయ్మొళి ఛాందోగ్యోపనిషత్తునకు సమాన మైన దని పెద్దలు చెప్పుదురు. కనుకనే,

"సహస్ర శాఖాం యోఽద్రాక్షీత్ ద్రామిడీం బ్రహ్మ సంహితామ్."

"సహస్ర శాఖోప నిష త్సమాగమం నమా మ్యహం ద్రావిడ వేద సాగరమ్."

అని, తనియన్లలో ననుసంధించుచున్నారు వేదాధ్యయనమును, అష్టాంగయోగాభ్యాసమును అభ్యసించియు, మహర్షులు ఆశా పాశము లచే బంధింపఁబడిరి. సర్వేశ్వరుఁడు ప్రసాదించిన దివ్య చక్షుస్సుతో,

అనితర దుర్లభుఁడగు సర్వేశ్వరుని సేవించినతోడనే, 'ఇన్నిస్ట నీర్మె యినియా మఁజామై' అని బాహ్య విషయ సంబంధములు నమ్మాళ్వారులకు నిశ్శేషముగా విడివడి పోయినవి. ఇంతియే గాక, భగవంతుని స్వరూప విభూతి చేష్టితములను, దివ్య మంగళ విగ్రహమును, దివ్య కల్యాణ గుణ గణములను, జ్ఞాన శక్తి బలైశ్వర్యాదులను, నిత్య విభూతి లీలా విభూతి వైభవములను, విశిష్ట సంకల్ప వ్యాపారాదులను విశద పఱచునట్టి శ్రీ పాంచరాత్ర శాస్త్ర పురాణేతిహాసములవలెనే ఈ దివ్య ప్రబంధములును నీలమేఘ శ్యామల వర్ణమును, జ్యోతి స్స్వరూపము నగు దివ్య మంగళ విగ్రహమును వివరించి తెలుపునట్టి వేదోపబృంహణ మనియు పెద్దలు చెప్పుదురు. ఋషులలో నొక్కఁడగు పులస్త్యుని యనుగ్రహము-ఋషి ప్రోక్తము లగు గ్రంథములకు మూల కారణము. సాక్షాత్తుగ, సర్వేశ్వరుఁడగు శ్రియఃపతి యొక్క దివ్యానుగ్రహము నమ్మాళ్వారుల దివ్య ప్రబంధావతరణమునకు మూల కారణము.

శ్రియఃపతి విషయక మగు కవన మని ప్రతిజ్ఞ చేసి, ఆ ప్రతిజ్ఞాను సారముగ ఇతర పరము లగు శబ్దార్థములను పరిశీలించి, వాని నెల్ల తీసి పాఱవైచి, భగవ దేక ప్రవణము లగు లలితోచిత సన్నివేశము లైన శబ్దార్థములను మాత్రమే ఏర్చి కూర్చి, సుధా మధురముగ సంతరించిన దీ తిరువాయ్‌మొళి దివ్య ప్రబంధము.

"వేదేషు పౌరుషం సూక్తం ధర్మశాస్త్రేషు మానవమ్
భారతే భగవద్గీతా పురాణేషు చ వైష్ణవమ్."

శ్రుతి స్మృతీతిహాస పురాణములలో – పురుష సూక్తము, మను స్మృతి, భగవ ద్గీత, శ్రీ విష్ణు పురాణముల వలెనే, ఆళ్వారులు ప్రసాదించిన ఈ తిరువాయ్‌మొళి, నిఖిల దివ్య ప్రబంధములలో సార భూత మైనది.

గురు శిష్య గ్రంథ విరోధములను, పర మతాపాదనాదులచేఁ బరిహరి పనక్కఱలేకుండ,'శెం జుల్''శెన్దమిళ్''ఇన్ కవి' అనునటుల, పరస్పరము శ్లాఘించుకొనుచు, వీక కంఠులై విలసిల్లు వారిలో - 'ఎన్నిల్ మిగుమ్' అనునటుల విలక్షణ మగు తిరువాయ్‌మొళి నాధార ముగఁ జేసికొనియే, శాస్త్రార్థములను నిర్ణయింపవలసి యున్నందున, 'వలం కొండ' అన్నట్లు, ప్రతిపాదన సామర్థ్యము గల ఈ దివ్య ప్రబంధములతో విరోధించునట్టి గ్రంథములు - మనుస్మృతి విరుద్ధము లగు ధర్మ శాస్త్రాదుల వలె పరిత్యాజ్యములు.

శ్రీ భాష్యకారు లగు భగవ ద్రామానుజులు గూడ,ఈ తిరువాయ్ మొళిని బాగుగ నధికరించి జీర్ణించుకొని, దీనిని గొనియే సూత్ర వాక్యముల కైకకంఠ్యమును దెలిపియున్నారు.

"విధయ శ్చ వైదికా స్త్వదీయ గంభీర మనోఽనుసారిణః"

అను ఆళవందారుల శ్రీసూక్తి ఇచ్చట అనుసంధింపదగినది. వేదములు వ్యాస - మను - బ్రహ్మాదులఁ బేర్కొని నటుల, శ్రుతి - మార్కండేయుఁడు, పార్థుఁడు అను నామములఁ బేర్కొని యున్నది.

శ్రీ మహా భారతమున భగవద్గీతయు - వేదమున ఉపనిషత్తులును వేద వ్యాఖ్యాన రూపములై, వేద రహస్యములై యుండు నటుల, తిరువాయ్‌మొళియును, వేద రహస్యము గూడ కా దగి యున్నది.

ఉదాత్తాది స్వరములు, పద - క్రమ - జటా ఘనాదులు, పాద - వృత్త - ప్రశ్న - కాండ - అష్టక - అధ్యాయ - అంశ పర్యాదులును నగు వేదా ద్యలంకారముల వలెనే, అక్షరము_అశై - శీర్ - పన్దమ్ - అడి - తొడై - నిరైనిరై - ఈశై - తళై - ఇనమ్ - యాప్పు - పా-తుఱై - పణ్ - ఇశై - తాళమ్ - పత్తు - నూఱు - ఆయిరమ్ మొద లగు అలంకారములు దీనికి గలవు. మఱియు,

"వేద వేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా."

అని అభియుక్తులు అభివర్ణించినటుల, భగవంతుని పరత్వము దెలుపు పురాతన మగు వేదము - వ్యూహములను, అంత ర్వ్యాప్తి, అవతారములను సర్వేశ్వరుఁడు పొందినప్పుడు - పాంచరాత్రము, మనుస్మృతి, శ్రీమ ద్రామాయణ మహా భారతములుగ నవతరించు చున్నది. అటులనే, అతఁడు అర్చా రూపముగ నవతరించినపుడు, పరమ భోగ్య మగు సులలిత మధుర మయ ద్రావిడ దివ్య ప్రబంధము లుగా నవతరించినది. ఇదియును గాక, మేఘము ద్రావిన సముద్రోద కము వలెనే, వేద విద్యా సముద్రము యొక్క వాఙ్మరము - శ్రీనమ్మాళ్వారుల వాక్కును పొందిన తోడనే, మధురాతిమధుర మగు అమృత రస మయమై, సర్వదా సర్వాధార మైనది.

ఇవి - సంస్కృత భాషామయములు గాక, శిష్టాపరిగ్రాహ్య ముఁగ శపింపఁబడిన ద్రావిడ భాషామయములుగా నున్న వే యనిన, భాషను మాత్రము పరిశీలించితిమేని, సంస్కృత భాషా మయము లగు పంచకాసత్యము లైన వేద బాహ్య శాస్త్రాదులును పరిగ్రాహ్యములు కావలసివచ్చును. మహా ప్రభావ సంపన్ను లగు ఆళ్వారులచే పరిగ్ర హింపఁబడినందున, భాషా దోషము గూడ పరాస్త మయినది ఈ విషయ మును ద్రమిడోపనిష త్తాత్పర్య రత్నావళిలో శ్రీ వేదాంత దేశికుల వారు - 'భాషా గతిః ప్రశస్తా భగవతి వచనాత్' అను శ్లోకమున చర్చించి, దోషమును పరిహరించిరి.

కులము మాత్రమే చూచితిమేని, పంచమ వేదముగా నెన్నఁబడిన మహా భారతము, ప్రమాణ తమం బైన భగవ ద్గీతలును త్యాజ్యములు కావలసివచ్చును. జనక - దశరథ - వసుదేవ వంశములకు క్రమముగ జ్యేష్ఠ కుమార్తె (సీతయు), మధ్యమ కుమారుఁడు (భరతుఁడు),

కడగొట్టు పిల్లవాఁడు (శ్రీకృష్ణుఁడు) వలెనే, శ్రీ నమ్మాళ్వారులును అవతరించి, కీర్తిని, కుల మర్యాదను కాపాడి, చెరను పోగొట్టినారు.

సూర్యునికిని, శ్రీరామ దివాకరునికిని, అచ్యుత భానువులకును తొలఁగని లోపలి చీకటి (అజ్ఞానాంధకారము) పోయినది - శుష్కింపని సంసార సముద్రము శుష్కించినది - వికసింపని హృదయము వికసించినది శ్రీమద్వకుళ భూషణ లను భాస్కరు లుదయించినపుడే గదా! వంశ భూముల నుద్ధరించుటకై శ్రీ గోపాల వరాహులవలెనే, వీరును సంసారమునఁ బడియుండువారిని సంరక్షించుటకై, క్రింది కులమున జన్మించిరి. ఇట్టి యవతార విశేషమైన దివ్య ప్రబంధములును ఉల్లోక ప్రభావ సంపన్నములై, కేవల భగవ ద్విభూతి స్వరూప రూప కల్యాణ గుణ చారిత్రా ద్యభివర్ణనైకతానములై, వేదముల కెల్ల వేదములుగను, వేదోపబృంహణము కెల్ల ఉపబృంహణములుగను కావ్యముల కెల్ల మహా కావ్యముగను, గానముల కెల్ల దివ్య గానముగను, అన్నిటి కన్న మిన్నయై, లలితోచిత సన్నివేశ రమ్యమైన మృదు మధుర సుభగ మంగళ దివ్య ప్రబంధములుగను విలసిల్లుచు. భగవన్ముఖోల్లాస కరములై, పరమ పావనములై నిఖిల చేతనుల నుజ్జీవింపఁజేయుచున్నవి. వీనిలో మొదటి ప్రబంధమున బంధ నాశమును ప్రార్థించి, రెండవ ప్రబంధమున సర్వేశ్వరుని కల్యాణ గుణ గణములను అనుభవించిరి. మూఁడవ ప్రబంధమున, వాని ననుభవించుటకై, తృష్ణను పెంపొందించుకొనిరి. ఇఁక నాల్గవ ప్రబంధమున - యావన్మనోరథ ఫలముల ననుభవించిరి.

## శ్రీ వైష్ణవులకు ద్రావిడ వేదము పరమోపాదేయము

శఠకోప మునిం వందే శఠానాం బుద్ధి దూషణమ్
అజ్ఞానాం జ్ఞాన జనకం తింత్రిణీ మూల సంశ్రయమ్.

శ్రీమన్నారాయణుఁడే ఉపేయము. కర్మ జ్ఞాన భక్తి ప్రపత్త్యాదులు - అతని అనుగ్రహైక సంపాదకములు. అతఁడే ప్రథమాచార్యుఁడు. అతఁడే నిరుపాధిక జనకుఁడు. అతఁడే నియామకుఁడు. అతఁడే సంరక్షకుఁడు. వేయేల! సర్వమును ఆ పరాత్పరుఁడే. చేతనుఁడు అతనికి ఆధేయుఁడు - విధేయుఁడు - శేషుఁడునై యున్నాఁడు. అచేతనమెటుల చేతనునికి శరీరమై యున్నదో, అటులనే - ఆ చేతనుఁడును యథేష్ట వినియోగార్హుఁ డగుటచే, సర్వేశ్వరునకు శరీరమై యున్నాఁడు. సూక్ష్మ చిదచిచ్ఛరీరకుఁ డగు ఆ సర్వేశ్వరుఁడే జగత్కారణము. స్థూల చిదచిచ్ఛరీరకుఁ డగు అతఁడే కార్య జగత్తు. సకలేతర విలక్షణుఁ డగు అతఁడే పరబ్రహ్మము. అవయవభూతమైన అచేతనమునకు స్థూల సూక్ష్మ పరిణామ రూప వికారమే గాని, అవయవి యగు చేతనునకు లేనటుల, పరమావయవి యగు పరబ్రహ్మము గాని, చేతన గతమైన జ్ఞాన సంకోచ వికాసములు గాని లేవు. ఆ పర బ్రహ్మము, పర - వ్యూహ - విభవ - అంతర్యామి - అర్చా రూపము లను అయిదు స్వరూపములతో నుండి, నిఖిల జగత్తులను సంరక్షించుచున్నది 'విలక్షణ దేశ విశిష్ట బ్రహ్మానందానుభవమే మోక్షము' అను వేదాంత శుద్ధాంత సిద్ధాంత రహస్యముల నెల్ల నిష్కృష్టముగను, సులలితముగను, పరమ భోగ్యముగను నిరూపించుచు, పరమోపాదేయములై యుండు సర్వాధికారము లగు ద్రావిడ వేదములు - శ్రీవైష్ణవు లందటి చేతను అవశ్యాధ్యేయములై యున్నవి.

"ఋచో యజూంషి సామాని తథైవాఽథర్వణాని చ
సర్వ మష్టాక్షరాంతస్థం య చ్చాన్య దపి వాఙ్మయమ్."

అనునటుల, అష్టాక్షర బ్రహ్మ విద్యా వివరణరూపమైన శ్రీ శఠకోప దివ్య సూరీశ్వరాదు లనుగ్రహించిన ద్రవిడోపనిషద్రూపము లగు దివ్య

ప్రబంధముల యందే శ్రియఃపతికి అభిమాన మధికముగా నుండు నని తెలియవలయును.

మార్కండేయ పురాణములో - మధ్య భాగ మగు భగవ ద్ధర్మ మున, ౧౮వ అధ్యాయమునందు, ద్రావిడ ప్రబంధమాల యాధిక్యము విపులముగ -ముక్త కంఠముగ అభివర్ణితమై యున్నది అచ్చట సనత్కు మారులను గూర్చి సేనేశులు -

"కృపయా త త్ప్రణీతాం తు బ్రహ్మ విద్యాం మహత్తరామ్
అధ్యేష్య న్తి ద్విజా భూపాః వైశ్యా శ్శూద్రా శ్చ సర్వశః."

అని యారంభించి,

"సంస్కృత శ్రుతయో య ద్వత్ ద్రావిడ శ్రుతయ స్తథా."

అని సుప్రసిద్ధముగ నిర్ణయించి యున్నందున, ముముక్షువు లైన ప్రపన్న ద్విజులకు గూడ త దధ్యయము అత్యంతావశ్యకము.

కురుకాపురీ మాహాత్మ్యమునందును -

"అధ్యేతవ్యం ద్విజ శ్రేష్ఠైః వేద రూప మిదం సదా
స్త్రీభిః శూద్రాదిభి శ్చైవ తేషాం ముక్తిః కరే స్థితా."

అని వ్యక్తీకరింపఁబడి యున్నది 'స్వాధ్యాయో ఽధ్యేతవ్యః' - 'అకా రణః షడంగో వేదో ఽధ్యేతవ్యః' ఇత్యాదులైన వేదాధ్యయన విధాయక శ్రుతులు, సంస్కృత వేదములవలె ద్రావిడ వేదములను గూడ బోధించుచున్న వని స్వీకరించి తీరవలయును. 'అనంతా వై వేదాః' అను వేదానంత్యము దెలుపు వాక్యము - భాషా భేదముల గూడ పరామర్శించుచున్నది. కనుకనే, 'భక్తామృతమ్' ఇత్యాది తనియను శ్లోకమున, 'విశ్వజనానుమోదనమ్' అను విశేషణము ద్వారా,

ద్రావిడ వేద సాగరమున కుండు సర్వ ప్రాణి హృదయంగమత్వము - సర్వ ప్రాణి హితంకరత్వము అభివర్ణితమై యున్నది.

శ్రీ భాగవతమున గూడ 'తామ్రపర్ణీ నదీ యత్ర' ఇత్యాదుల వలనను - 'దక్షిణాదిక్కృతా యేన శరణ్యా పుణ్య కర్మణామ్' అనియు - 'వణ్డమిళ్ మాముని' అనియును ప్రశంసింపఁబడుచున్న అగస్త్య మహాముని నివసించు భూమియందవతరించి, విశ్వకర్మ శాపముచే నీచత్వమును బొందిన అతని ద్రావిడ భాషను వేదోపము లగు తమ దివ్య ప్రబంధములచే మహా పవిత్రమైన దానినిగను, పరమ ప్రసిద్ధమైన దానినిగను, పరమోపాదేయమైన దానిని గను జేసి, 'భాషా గానం న కర్తవ్యమ్' అను నిషేధమున కపవాదము కల్పించిన మహాను భావులైన హరి కీర్తన గాన పరు లగు శ్రీ ఆళ్వారుల వైభవమే అభివర్ణితమైన దని స్పష్ట మగుచున్నది మఱియును, యజుర్వేదమున 7 - వ కాండ 5 - వ ప్రశ్నములో -

"పృథివ్యై స్వాహా - ఋగ్భ్య స్వాహా - యజుర్భ్యస్స్వాహా - సామభ్య స్వాహా అంగిరోభ్య స్వాహా - వేదోభ్య స్వాహా - గాథాభ్య స్వాహా-నారాశగ్ంశీభ్య స్వాహా వైభీభ్య స్వాహా."

అను అనువాకమున, 'నారాశగ్ంశీభ్యః' నర ప్రోక్తములైన 'గాథాభ్యః' దివ్య ప్రబంధములచేత అని, ఆళ్వారుల దివ్య ప్రబంధ ములే కీర్తింపఁబడుచున్నవని పెద్దలు నిష్కర్షించుచున్నారు.

సంస్కృత వేదమువలె వేదత్వ వ్యవహారము, ద్రావిడ దివ్య ప్రబంధములకే ప్రసిద్ధమై, శ్రీవైష్ణవులకు - 'ఉభయ వేదాంత ప్రవర్త కులు' అను బిరుదము గూడ నేర్పడి, సర్వత్ర ప్రసిద్ధమై యున్నది. ఇంకను,

"సహస్ర పరమా దేవీ శతమూలా శతాంకురా
సర్వగ్‌ం హరతు మే పాపం దూర్వా దుస్స్వప్న నాశినీ."

ఇత్యాది శ్రుతులును - సహస్ర గాథాత్మక మగు ద్రావిడ దివ్య ప్రబంధ వైభవమును చెప్పుచున్న వని, షడ్విధ తాత్పర్య లింగములను ప్రదర్శించి, ప్రసిద్ధముగ పండిత ప్రకాండులు నిర్వహించుచున్నారు. కనుక, ద్రావిడ వేదములు గూడ ప్రపన్ను లగు శ్రీవైష్ణవు లందఱికిని అవశ్యాధ్యేయములై యున్నవి.

## ద్రావిడ దివ్య ప్రబంధములు — శ్రీమ ద్రామానుజులు

"యో నిత్య మచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహిత స్త దితరాణి తృణాయ మేనే
అస్మ ద్గురో ర్భగవతో ఽస్య దయైక సిన్ధోః
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే"

శ్రియఃపతి యైన భగవానునకు - శ్రీమ ద్ద్రమిడోపనిష త్ప్రబంధానుసంధానము జేయువారలయందే ప్రీ త్యతిశయము గల దని భగవానుఁడే ఆన తిచ్చినటుల శ్రీ భాగవతమున నున్నది.

"న ప్రీతి ర స్తి మమ వక్షసి లాలితాయాం
లక్ష్మ్యాం తథా సకల భూత నిదాన సీమ్ని
మ జ్జన్మ కర్మ గుణ బన్ధ యుతాన్ ప్రబన్ధాన్
సంకీ ర్తయ త్యనఘ భ క్త జనే య థై వ."

ఈ భగవ ద్వాక్యములో - అట్టి దివ్య ప్రబంధము లు, ద్రావిడ దివ్య ప్రబంధములే గాని వేరు గాదు. ఈ విషయమును శ్రీ రంగ రాజ భట్టరు వారే ఇట్లు నిర్ణ యించియున్నారు :-

"విద్యన్తే హి పరాశరాది మునిభిః ప్రోక్తాః ప్రబన్ధాః పరాః
భక్తా ఏవ హితే తథాఽపి సకలం త్యక్త్వా ఽత్ర రంగేశ్వరః
భక్తానేవ పరాంకుశాది పురుషాన్ తత్ప్రబన్ధాంశ్చ తాన్
అత్యాదృత్య సదోపలాలయతి యత్తద్గాపనం తత్ప్రియే."

శ్రీమన్మధుర కవులును – 'కణ్ణినుణ్ శిరుత్తాంబు' అను మృదు మధుర సారతమ దివ్య ప్రబంధమునందు, శ్రీ శఠకోప దివ్య సూరీశ్వరుల యొక్కయు, ద్రావిడ దివ్య ప్రబంధములయొక్కయు మహిమాతిశయాదులను తా మనుభవించిన ప్రకారములతో, అత్యాశ్చర్యముగ అభివర్ణించియున్నారు.

ఉభయ వేదాంత ప్రవర్తకు లగు శ్రీమన్నాథమునులును – 'భక్తామృతం' అను తనియ శ్లోకమున, ద్రావిడ ప్రబంధ వైభవాదులను అభివర్ణించియున్నారు

శ్రీమత్పరమాచార్యులైన 'ఆళవందారులు' ను – 'మాతా పితా యువతయః' అను శ్లోకముచే, శ్రీ నమ్మాళ్వారలయందుండు ప్రావణ్యాతిరేకమును వ్యక్తీకరించుటయే గాక, వారి తిరువాయ్మొళిని జీర్ణించుకొనియే సిద్ధిత్రయాది నిఖిల గ్రంథములను ప్రసాదించిరి. చతుశ్శ్లోకీ స్తోత్రరత్నాదులు – తిరువాయ్మొళిని ఫణికి పుచ్చుకున్నట్లున్నవి.

సకల దివ్యసూరి నిఖిలాచార్య స్వరూపు లగు భగవద్రామానుజులవారును – తమ గద్య త్రయాది దివ్య ప్రబంధములను అట్లే యనుగ్రహించిరి. మఱియును, ద్రావిడ దివ్య ప్రబంధములను సర్వవిధముల పోషించి, అభివృద్ధిలోనికిఁ దెచ్చినదియును వారే. ఈ విషయమును శ్రీమదనన్తాళ్వానులు –

"ఏయ్న్ద పెరుం కీర్తి యిరామానుజ ముని దన్
వాలకున్ద మలర్ పాదం వణజ్గు న్దేన్
ఆయ్న్ద పెరుం శీరార్ శఠగోపన్ శెన్దమిళ్
వేదం తరిక్కుం పేరాద వెళ్ళం పెఱ."

అని యభివర్ణించియున్నారు. శ్రీ భట్టరువారును -

"వాన్ తిగళుమ్ శోలై మది శరఙ్గర్ వణ్
పుగళ్ మేల్ ఆన్ద తమిళ్ మఱైగళాయిరముమ్
ఈన్ద ముదల్ తాయ్ శఠగోపన్ మెయ్మ్బాల్
వళర్త ఇదత్తా యిరామానుశమ్."

అని వ్యక్తీకరించియున్నారు. మఱియును, శ్రీమద్రామానుజుల వారి కల్యాణ గుణములనే ధారక పోషకములుగా గలిగి, వారి కత్యంతాంతరంగు లగు తిరువరంగత్త ముదనారులు - తమ రామానుజ నూత్తన్దాది దివ్య ప్రబంధమున, శ్రీమన్నారాయణుఁడు - నివాస శయ్యాసన పాదుకాది స్వరూపములతో, తన సర్వ దేశ సర్వ కాల సర్వావస్థోచితములైన సకల విధ కైంకర్యములకును నిర్వాహకులైన శ్రీమదాదిశేషులను శ్రీ నమ్మాళ్వారుల కాశ్రయమైన తింత్రిణీ వృక్షముగ నవతరింపఁజేయుటయే గాక, వారి ద్రమిడోపనిషత్తును అభివ్యాప్తి నొందించుటకై, ఆ దివ్యప్రబంధములే మహదైశ్వర్యాది సర్వ విధ బంధు శ్రేష్ఠము లగునటుల, శ్రీమద్రామానుజాచార్యుల నవతరింపఁ జేసిరని -

"ఉఱు పెరుం శెల్వముం తన్దైయుం తాయుమ్
ఉయర్ గురువుమ్ శెన్దమిళారనమే
యెన్నిన్నణిలత్తోర్ అఱిదర విన్ద
ఇరామానుశన్ ఎనక్కారముదే."

అను పాశురమున అభివ్యక్త మొనరించిరి. మఱియును, తా మాన తిచ్చిన శ్రీభాష్యాది గ్రంథముల కన్న,పర మత నిరాసాదులకు భగవ ద్గుణానుభవ కైంకర్యాదులకును, తాము పెంచి పెద్ద చేసిన దాౢవిడ వేదములే తగిన వని శ్రీమదాౢమానుజులు అత్యంతాభినివేశ ముతో నుందు రనియును -

"పణ్దరు మాఱన్ పళుం తమిళ్ ఆనన్దం పాయు మిదమాయ్
విణ్ణ్దధ పెజ్గళి రామానుశ ముని వేళమే .... .... "
"కలమిక్క శెన్నల్ కళలిక్కుత్తైయల్
కలై పెరుమానొళిమిక్క పాదలైయుణ్ణు తన్నుళ్ళం తడిత్తు."

అను పాశురములలో స్పష్టపఱుపఁబడి యున్నది. వేయేల! ఆ యెంబెరుమానారులే సాదించిన ఈ క్రింది శ్లోక ద్వయముఁలో, ఈ విషయము సుస్పష్టమై యున్నది.

"పద్మాసనోపవిష్టం వర పద యుగళీ వివిష్ట చైతన్యమ్
పర తత్త్వ బోధ ముద్రం పరమాచార్యం పరాంకుశం వన్దే."
"వకుళ ధవళ మాలా వక్షసం వేద బాహ్య
ప్రబల సమయవాది చ్ఛేదనం పూజనీయమ్
విపుల కురుక నాథం కారిసూనుం కవీశం
శరణ ముపగతోఽహం చక్రహస్తైభచక్రమ్ "

## వేదాంత సూత్రములు - ద్రావిడ దివ్య ప్రబంధములు

"నిరస్తాఖిల దుఃఖోఽహం అనన్తానన్దభాక్ స్వరాట్
భవేయ మితి మోక్షార్థీ శ్రవణాదౌ ప్రవర్తతే."

అని భగవ దాౢమానుజాలవా రానతిచ్చినటుల, నిఖిల ప్రాణు లును - ఆత్యంతిక దుఃఖ నివృత్తి పూర్వక అమందానందానుభవ స్వరూప మగు నిత్య నిరవధిక నిరుపాధిక సుఖ స్వరూప మైన మోక్ష

రూప పరమ పురుషార్థమును బొందుటకై, తత్సాధనానుష్ఠాన సంపాదనకై ప్రవర్తించుచున్నారు. అట్టి ముముక్షు వగు చేతనునికి అవశ్య జ్ఞానమైన తత్త్వ హిత పురుషార్థములను విపులముగ యోచించిన, అర్థ పంచకములను పరిబోధించుచున్నవి. దీనినే హరివంశము నందు తులాధార జాబిలి సంవాదమున, ఈ క్రింది విధముగా వివరించి యున్నారు :-

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం ప్రాప్తు శ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫల ప్రాప్తేః తథా ప్రాప్తి విరోధి చ
వదన్తి సకలా వేదాః సేతిహాస పురాణకాః
మునయ శ్చ మహాత్మానో వేద వేదాన్త పారగాః."

బహుముఖములైన వేదాంతార్థములను సమన్వయించుటకై, శ్రీ భగవ దవతార స్వరూపు లగు శ్రీమ ద్బాదరాయణ ముని సార్వభౌములు, చతు రధ్యాయాత్మక మగు తమ వేదాంత సూత్రములలో-

"కారణత్వం అబాధ్యత్వం ఉపాయత్వం ఉపేయతా."

అని కీర్తింపఁబడు నిఖిల వేదాంతములయందలి ఆ పరబ్రహ్మ యొక్క నిఖిల జగ త్కారణత్వము, ఇతరావిరోధము, ఉపాయము లగు ద్వా త్రింశ ద్విద్యల స్వరూప స్వభావములు, పరమ పురుషార్థ లక్షణ మగు మోక్ష స్వరూపాదులను, న్యాయ ప్రమాణోక్తి సమన్వయ పూర్వకముగ, ప్రౌఢ గంభీరముగ వ్యవస్థాపించిరి ఆ విషయములనే శ్రీ నమ్మాళ్వారులు పరమ భోగ్య మైన రీతిలో - తిరువాయ్‌మొళి దివ్య ప్రబంధమున, సులలిత రమణీయ సరణిలో - మధురాతిమధురముగ అనుభవింపఁజేసిరి

అట్లైనచో, - శ్రీమ ద్రామానుజులవారు లోకహితార్థమై ప్రసాదించిన శ్రీసూక్తి షట్కమున, ద్రావిడ వేదాధ్యయనమునకును

లనుగా నొనర్చి, వారి ద్వారా దివ్య ప్రబంధ - దివ్య రసామృతాస్వాద పరిమేదురు లగు శ్రీమ ద్భట్ట (భట్టర్) పాదులను విశేషముగ కటాక్షించి, వారి ద్వారా ప్రపత్తి మార్గమును, త ద్బోధనైక ప్రవణము లగు పరమ చోద్యములైన ద్రావిడ దివ్య ప్రబంధములను, నఞ్జీయర్, నమ్బిళ్ళై మొదలగు ఆచార్య పరంపరా ముఖమున ప్రవర్తింపఁ జేసిరి. ఇదియే గాక, శరణాగతి గద్య, వైకుంఠ గద్య, శ్రీరంగ గద్య ప్రముఖము లగు గ్రంథములయందు సాక్షాత్తుగ, ఆళ్వారుల సూక్తు లగు శబ్దార్థములతో పొందు పఱచిరి. అంతరంగ శిష్యులకు సదానుభవ యోగ్యముగ, ఆళ్వారుల ద్రావిడ ప్రబంధ దివ్యార్థములను స్వయముఁగ, తామే కాలక్షేప ముఖమున అనుగ్రహించిరి. వీరి పరమాచార్యు లగు శ్రీమ ద్యామునమునులు - తమ స్తోత్రరత్నాదులయందు, అత్యంత ప్రావణ్యముతో శ్రీ నమ్మాళ్వారులయు - వారి దివ్య ప్రబంధములయు విషయములలో, అత్యంత ప్రావీణ్యము గలిగి యుండుటయే - 'అద్యస్య నః కులపతే ర్వకుళాభిరామం' అని శ్రీ నమ్మాళ్వారులను ప్రపన్న కులమునకు కూటస్థులనుగా కీర్తించిరి. అట్లుండ, సర్వ విధముల శ్రీమ ద్యామున మునులకు శిష్య రత్న మగు శ్రీమ ద్రామానుజులవారు - అన్యథా ఎటుల నుండగలరు ? కనుక, శ్రీమ ద్రామానుజ ముని సార్వభౌములకును, అత్యంత ప్రావణ్యము దివ్య ప్రబంధములయం దున్న దనుటలో సంశయ మినుమంతయును లేదు. అదియునుఁ గాక, అధ్యాయ చతుష్టయాత్మకమైన శారీరక మీమాంసా శాస్త్రమునకును, తిరువాయ్మొళి దివ్య ప్రబంధమునందలి మొదటి రెండు తిరువాయ్మొళులకును ఐక కంఠ్యమునుగూడ శ్రీమ దాచార్యవర్యులు పరంపరగా నుపదేశించుచున్నారు.

శ్రీ నంబిళ్ళై స్వామివారి శిష్య రత్న మగు శ్రీ వడక్కు త్తిరువీధి ప్పిళ్ళై స్వామివా రనుగ్రహించిన 'ఈడు' అను ముప్పత్తారాయిరప్పడి

(ముప్పది యాఱు వేల గ్రంథములు గల వ్యాఖ్యానము) లో - 'వీడుమిన్ ముత్తవుమ్' అను పాశురపు ప్రవేశమున -

"తత్త్వ పరమాయుమ్ ఉపాసన పరమాయు మిఱే మోక్ష శాస్త్రన్దానిరుప్పదు; అదిల్ తత్త్వపరమాగ చ్చొల్లవేణ్డువ దెల్లామ్ శొల్లిత్తు కీళ్ తిరువాయ్ మొళియిలే; ఉపాసన పరమాగ చ్చొల్లవేణ్డుమ్ అవత్తు క్కెల్లామ్. సంగ్రహ మాయిరుక్కిఱదు ఇత్తిరువాయ్మొళి."

అని, వేదాంత శాస్త్ర ద్రమిడాగమాద్య దశక ద్వంద్వైక కంఠముగ ప్రతిపాదింపఁబడినది. 'అరు మ్పద' మను టీకయందు, ఆ క్రమమంత యును బాగుగా నిరూపింపఁబడి యున్నది దీని ననుసరించియే శ్రీ వేదాంతదేశికాచార్యులవారును, తమ ద్రమిడోపనిష త్తాత్పర్యరత్నా వళిలో - 'ఆదౌ శారీరకార్థ క్రమ మిహ విశదం వింశతి ర్వ్యక్తి సాగాత్' అని, ముక్తకంఠముగ ఈ యైక కంఠ్యమును ద్రఢీకరింపఁజేసిరి.

"పురా సూత్రై ర్వ్యాసః శ్రుతి శత శిరోఽర్థం గ్రథితవాన్
వివవ్రే తం శ్రావ్యం వకుళధరతామే త్య స పునః
ఉభా వేతాగ్రన్థౌ ఘటయితు మలం యుక్తిభి రసౌ
పున ర్జజ్ఞే రామావరజ ఇతి స బ్రహ్మ ముకురః."

అను శ్లోకముచే, శ్రీ ఆచ్చాన్ పిళ్ళై గారు - 'శ్రీ వేద వ్యాస భగవాను లనుగ్రహించిన సంస్కృత వేదాంత శాస్త్రమునకును, శ్రీ నమ్మాళ్వారు లనుగ్రహించిన ద్రావిడ వేదాంత శాస్త్రమునకును ఐక కంఠ్యమును సంపాదించి పరమార్థములఁ దెలిపి, అందఱిని ఉజ్జీవింపఁజేయుటకునై, బ్రహ్మ ముకుర (పర బ్రహ్మమునకు దర్పణ) స్థానీయు లగు శ్రీమ ద్రామానుజులవారు అవతరించి' రని అత్యద్భుత ముగ అభివర్ణించియున్నారు. ఈ యైక కంఠ్యమును, శ్రీమ త్కాంచీ సౌమ్యజామాతృమునులు - సర్వ ప్రమాణోపపత్త్యాదులతో వివరముగ నిరూపించియున్నారు.

శ్రీమ ద్విశిష్టాద్వైత సిద్ధాంతమునకు ప్రతి తంత్ర సిద్ధ మైన జగ ద్బ్రహ్మల కుండు శరీర శరీరి భావము - ఉపనిషత్తులకంటెను, అంతర్యామి బ్రాహ్మణాదులకంటెను తిరువాయ్‌మొళి యందే - 'పఱన్ద తన్పరవైయుళ్ పరన్దు ఎఙ్గుల్ పరన్దుళన్' అను పాశుర ఖండాదులచే, సంశయ విపర్యాదులు గలుగకుండునటుల, సులలిత ప్రక్రియతో నిరూపింపబడియున్నది.

"బృహత్వాత్ బృంహణత్వా చ్చ త ద్బ్రహ్మే త్యభిధీయతే."

"బృహత్వం చ స్వరూపితో గుణై శ్చ యత్రానవధికాతిశయాసోఽస్య ముఖ్యోర్థః."

అని నిరూపించిన బ్రహ్మ శబ్దార్థము -

"ఉయర్వఱ ఉయర్నల ముడైయవన్ యవనవన్."

అను ఆళ్వారుల శ్రీసూ క్త్యుపజ్ఞమే -

"ఐతదాత్మ్య మిదం సర్వం స ఆత్మా త త్త్వ మసి శ్వేతకేతో."

అను ఉపనిష ద్వాక్యములలో ప్రతిపాదింపబడిన 'జగ చ్ఛరీర క త్త్వమును బాగుగ 'ఇల నదు' ఇత్యాది పాశురములచే నిరూపించి, 'తిడ విశుమ్బు' అను పాశురమున, సకల చేతనాచేతన పదార్థాంతర్యామిత్వమును అత్యద్భుత ప్రక్రియతో - 'ఉడ మ్మిశై ఉయరెన క్కరమ్బి' అను భావముచే దెలుపుట మాత్రమే గాక, నిత్య నిరవద్యమైన శ్రుతులకును ఇదియే పరమ తాత్పర్య మని 'శుడ మిగు శురుదియుళ్' అను భాగముచే చిక్కు దీర్చి, నిస్సంశయము వ్యక్తకరించిరి. దీని నాధారముగఁ దీసికొనియే శ్రీమ ద్రామానుజులవారు - భేద శ్రుతులకును, అభేద శ్రుతులకును ఘటకముగ నుండు ఘటక శ్రుతులను గనుగొని, ఆ శ్రుతులను సమన్వయ పఱచి, శ్రీమ ద్విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రతిమితప్రసిద్ధాంత సిద్ధమైన జగ ద్బ్రహ్మల కుండు శరీర శరీరి భావము

కనుగొనుటతో వ్యవస్థాపించిరి. ఇట్లుండ, శ్రీమ ద్రామానుజులవారికి ద్రావిడ వేదాంతమునందు ప్రావణ్యము లే దనియు, ద్రావిడ పాశురములు శ్రీవైష్ణవులకు అనావశ్యకము లనియు, ఇది ద్రావిడ దేశస్థులు పన్నిన పన్నాగ మనియు కొందఱు వాదించు వాదములు సరియైనవి గా వని ప్రాజ్ఞు లెల్లఱును ఎఱిగిన విషయమే. ఆ వాద మంతయు సంప్రదాయానభిజ్ఞతా విజృంభితమే గాని, వేరు గాదు.

ద్రావిడ దివ్య ప్రబంధములే లే కున్న, శ్రీమ ద్విశిష్టాద్వైత సిద్ధాంతమే ప్రతిష్ఠితము గా దనిన,అతిశయోక్తి కాదు.దివ్య దేశములు, దివ్య ప్రబంధములు, సౌందర్యాది నికేతన భగవ దర్చా దివ్య మంగళ విగ్రహములు, సర్వ సాధారణ ప్రప త్త్యుపాయము - ఇవి యన్నియు సకల ప్రాణి సమభ్యుదయమున విలసిల్లుచున్న మహా నిధులు గాని, వేరు గాదు. అందువలన, శ్రీవైష్ణవుల కెల్లఱకును ప్రపన్న జన కూటస్థు లగు శ్రీ నమ్మాళ్వారు లనుగ్రహించిన ద్రావిడ దివ్య వేదాంతములు అవశ్యాధ్యేయము లనుట నిస్సంశయము.

"శ్రీ నగర్యాం మహా పుర్యాం తామ్రపర్ణ్యోత్తరే తటే
శ్రీ తింత్రిణీ మూలధామ్నే శఠకోపాయ మంగళమ్."



# పరకాల విలాసము

'సంగీత సాహిత్య కళా నిధి'

శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



త్రిదశేంద్రుడు సుధర్మలో నలరు రీతిం జోళ ధాత్రీశ్వరుం
డదె రత్నాంచిత సింహపీఠి పయి నధ్యాసించె వింజామరల్
సుదతుల్ వీవఁగ ఛత్రముల్ పరిజనుల్ పూనంగ వైతాళికుల్
పదముల్ బాడఁగ వంది మాగధులు కైవారమ్ము లర్పింపగన్.

ఒకచో భూమి జలాగ్ని వాయు వియదాద్యుత్పత్తి నూహించు తా
ర్కికులుం, దద్గత కృత్స్వరూపములకున్ రీతుల్ గవేషించు శా
బ్దికు లిం కొక్కెడ, బ్రహ్మసూత్రములకున్ భిన్నార్థముల్ దెల్పు వా
రొకచో జ్యౌతిషి కాళియై నృపవరుం డొడ్డోలగం బుండెఁ దాన్.

అటు రాజన్యక మిట్లు ధీ సచివు లయ్యై చోట్ల సామంత రా
ట్పృతుల మ్మొక్కెడ వాహినీ పతుల సంభావింపఁ దేజస్సము
ద్భుతుఁడై వెల్గ లలాట సంఘటిత హస్త ద్వంద్వుఁడై దర్శకుం
డటు కేతెంచి జరాబరిన్ నిలచి యి ట్లాడెన్ ధరాజానితోన్.

దేవర చిత్తగింపవలెఁ దెల్పెద నెవ్వఁడొ నీలుఁ డంటు - స
ద్భావముతోడ వచ్చె నఁటు - దర్శన మీవలె నఁటు - లేనిచో
బోవనె పోవ డంటు - బలు పోటరి యంటు - పుళిందుఁ డంటు - కా
ర్యావసరమ్ము గద్దఁటు యనంతర మేలికయే ప్రమాణమౌ.

తను వవ్వానిది ప్రావృషేణ్య జలజోత్కర్షాపకర్షక్షమం
బను తర్షారుణ నేత్రముల్ సరసిజా తాప ప్రథా నూత్రముల్
ఘన దోర్దండములున్ మదేభ కర ధిక్కార క్రియా శౌండముల్
కన వక్షమ్ము కవాట నిర్దళన దక్ష మ్మక్షముల్ రూక్షముల్.

మకుటార్ద మిధి యని ప్రకటింపఁ గాబోలు
దెలిపాఁగ జుట్టెను దల కతండు
ఏరు న న్నెదిరింపలే రని తెల్పఁగాఁ
గాఁబోలుఁ దాల్చెఁ దాఁ క త్తళమును
అసహాయ శూరుండ నని తెల్పఁ గాఁబోలు
నస్త్రి బూని వచ్చె సభాగ్రమునకు
ఖల్ మూఁకలనుఁ జెండు బలియుండ నని తెల్పఁ
గాఁబోలు విల్ బట్టెఁ గరమునందు

అతులు సింగంబు మాడ్కి నీలాహ్వయుండు
గమన వేషమ్ములనె మగంటిమి వెలార్ప
చోళ భూపాలుఁ డాతనిఁ జూచి - నీ వె
వండ విటు రాఁగఁ గత మేమి ? పల్కు మనఁగ.

అవనీ పాల వరా ! తిరుక్కొళయలూ రస్మ న్నివాసంబు - నా
యవతారంబు పుళింద వంశమున - నీలాఖ్య ప్రథం గాంచితిన్
బవరం బన్న సముత్సహించు నెపు డీ బాహార్గళం బిద్ది నా
వివరం బాలము గూర్తువో ! కడిమి నా విజ్ఞాపనం బోర్తువో !

చిర కాలమ్ముగ నొక్క కోర్కె గల దాజిం గాంక్షయే కాదు - రా
జ్య రమా కాంక్ష నిజమ్ము వక్కెదఁ బిశాచ మ్మట్లు బీడింప నీ
దరి కేతెంచితి నెంతయో వలదు - మ త్ప్రాంతమ్మె కొక్కొల్లు; సం
గరమో - దేశ విభాగమో వడిఁ బరిష్కార్యంబు ధాత్రీశ్వరా !

అనిన ధరావరుం డతని యాకృతికిన్ గత సాధ్వస ప్రవ
ర్తనమునకున్ మనోభిలషితమ్మునకుం బలుకాడు రీతికిన్
మనమున నబ్బురమ్ము వడి, ప్రమోన్నడి, కొంతకుఁ దెప్పరిల్లి, మం
తన మొనరించి త జ్జనపదమ్మున కాతనిఁ జేసి నేతగన్.

నీలుఁడవు కావికం బర
కాలుండవు – నాకుఁ గొంత కప్పం బిడుచున్
బాలింపుము దేశ మ్మని
చోళాధీశ్వరుఁడు సొచ్చె శుద్ధాంతమ్మున్.

నాటి సుత ధర్మ సంగతి
బాటించి పరాక్రమించు పరిపాలించెన్
గాటముగాఁ బరకాలుఁడు
చేటీ పీటీ పటీర శృంగారముగన్.

భూపతిఁ గొల్చినం బడయు భూమి పతిత్వము, విత్తవంతునిన్
బ్రాపుగఁ జేరినన్ బడయు ద్రవ్యము, నెవ్వఁడ యేనిఁ జోళ ధా
త్రీపతి సేవచే సకల దిక్పతి భావము నీలుఁ డందె భో
గోపగమ ప్రభా నియమనోద్ధతి శైత్య బలార్థ సిద్ధులన్.

జాతి పుళిందుఁ డయ్యుఁ బర జాతి గుణావగుణ ప్రసక్తికిన్
వాతలు వెట్టు నన్య పరిపాలన మేర్పడె నంచు భూ జన
వ్రాతము లూహ సేసెడి విపర్యయ మెద్దియు దెచ్చి పెట్టఁ డా
హా! తగు బాగు బాగనుచు నందఱు మెచ్చిరి తద్వ్యవస్థకున్.

పరకాల పాలనమ్మునఁ
బరకాల భయంబు లే దవనిఁ గతమా? ద్వా
పర కాలమ? యిది యని ద్వా
పర కాలంబు సంఘటించెఁ బ్రతి పదమందున్.

ప్రజ లెన్నం బ్రభు భక్తియం ద్రవనతుల్ – స్వాతంత్ర్య భావోన్నతుల్
విజయోన్మాదులు – యుద్ధ రంగమున వ్రేద్విధిఁ బ్రస్తావ్యాస్పృతుల్
భుజ సారంబున దుర్గముల్ – విఫల వాఙ్మోక్షమ్మునం దక్షతల్
రజనీ కాంతులు నైజ మందు రవి విక్రాంతుల్ స్వ తేజమ్మునన్.

అనుచుఁ బరకాలుఁ డాత్మలో నరయు వేళ
వారు వీరును వచ్చి యుద్వాహమునకుఁ
బ్రోత్సహించుచు నిషధేశు బ్రోల హంస
వలికి నట్లుగ నీ రీతిఁ బలికి రపుడు.

తిరుణాంగూ రను పత్తనం బలరు నీ దేశమ్మునన్ ధారుణీ
శ్వర ! యవ్వీడు సమస్త సంపదల కావాలమ్ముగాఁ దోఁచు, నిం
దిర మందేతర వీక్షలం బరపియుండెంబోలు శ్రీవారికిం
బరమోపాస్యము సౌందరీ ప్రథిత సేవా భావ సంచారికిన్.

ఆ పురి బాయకుండు గరుడాంక శుభాంక మనోజ్ఞ మూర్తి, సే
వా పరమార్థ యోగి, జ్వర వాత కఫాది సమస్త రోగ వి
క్షేపణ దక్షుఁ, డార్య కుల సేవన పక్షు, డధోక్షజాంఘ్రి పూ
జా పర తంత్రి చిత్తుఁడు, భిష ఙ్మణి - వా ఙ్మణిహార ధారుఁడై.

అతని కొక్కతే యొకతె యాత్మజ ; త త్తనురూప వర్ణనా
కౌతుక మీా తరిన్ నిజముగా నవిచార మనోజ్ఞమై చనున్
శ్రోతలు మీా సముత్సుకత జూచి కడంగితిమయ్య ! మా నుడుల్
కైతలు కావు, వర్ణనలుఁ గావు - యదార్థములం చెఱుంగుమా !
బంగరు వన్నెకుం దఱుఁగు వాటిలు గాని, మెలంత మేనికిన్
రంగు దొరంగఁ బోదు - చికురమ్ముల నీలిమ జూచి మేఘముల్
భంగము జెంది సంతతము బాష్ప జలమ్మును రాల్చి తెల్లనై
క్రుంగి కృశించి దిక్తటులకుం బఱు వెత్తె శరణ్య శూన్యతన్.

లలిన భవుండు తొల్లి లలనన్ సృజియించెడి వేళ నబ్జ[5] మం
డల మొకమాఱె వచ్చి యెదుటం బడి తన్వి శరీర రాజ్యమం

5. అబ్జ శబ్దమునకు నానార్థములు - చంద్రుడు, పద్మము, శంఖము, ఈ అబ్జమండలమున, ఈ మూఁ డర్థములు గ్రాహ్యములు.

దలఘు పదమ్ము మా కొసఁగు మంచు బలాత్కృతి సేయ,జంద్రునిన్
నిలిపెను ఫాల భాగమున, నీరజ మక్షులయందు, శంఖమున్
గలమునఁ, బుట్టినింటఁ గల గాదిలిచే మఱి రెండు స్థానముల్
నలువ యొసంగె హస్త చరణంబుల నంబుజపాళి కద్దిరా !

అధరమ్ముం బొడగాంచి భృంగములు గాఢాసక్తి నేతెంచి, త
న్మధు పానం బొనరించి తుట్టతుద కుత్కృత్తమ్ములై దాని కే
వ్యథ గల్గించునొ యంచుఁ బద్మజుఁడు దూరాలోచనాశక్తి న
య్యధరాగ్ర స్థలిఁ జంపక భ్రమద నాసాకారము న్నిల్పెఁ దాన్.

కోక చయమ్ములా ? ద్విరద కుంభములా ? కలశమ్ములా ? పురం
ధ్రీ కమనీయతా పరిమితిం దులఁ దూచెడి వంచు జర్చలం
దేక ముఖమ్ముగాఁ బరిగణింపఁగలేక నిలీనులైరి - వ
ల్మీక శరాంబు యానముల మేటి కవీశ్వరు లెంత చిత్రమో !

శ్రీకారమ్ములు కర్ణము
లాకార విహీన మతివ యవలగ్నము రా
మాకార మ్మితితర ల
జ్ఞాకారము నప్సరోవ్రజమ్మున కెల్లన్.

చిరు నగవా ! యద్ది విరివిల్లు - పాదుసా
    తఱిమెన బట్టించి తాల్చు కత్తి
కులుకులా ! యవి యిక్షు కోదండమం దుండి
    వలఱేడు విడచిన వాల్కులుకులు
పలుకులా ! యవి కావు - బరమ్మునకు వచ్చు
    మరుతేజి నకిలింత లరసి చూడఁ
దళుకులా ! యవి కావు - దయమాలి సిరి చూలి
    గుప్పిన యమ్ముల నిప్పు రవలు

ఇంతి నడకలు దా మభ్యసింపలేక
యేపు పెడిపోయి మోమునుఁ జూపలేక
యెగిరిపోయెను రాజహంసేంద్ర మెటకొ
యణఁగె నైరావతము భూమి యడుగునందు.

కొల్లలు కిలికించితములు
మొల్లలు పలువరుస - వ్రేళు ల్ముకురమ్ములు - భూ
వల్లుల్ స్మర విశిఖ జ్యా
వల్లుల్ తారకలు కుముదవల్లీ నఖముల్.

పలు వచనంబు లేల ! నర పాలక ! పల్లవ పాణి యన్నిటం
దుల యగు నీకు నీ వగుదు తొయ్యలికిన్ సరి ; బ్రహ్మ యిట్టి మేల్
కలయిక గూర్చినన్ యుగ యుగాలుగఁ ద చ్చతురాననత్వమున్
నిలుచును ; కాని పక్షమున నిల్చును వట్టి చతుర్ముఖత్వమే.

లేశమ్మున్ విడఁబోని యా కుముదవల్లీ విభ్రమావృత్తిచేఁ
బాశాకృష్ట నిరుద నిర్మద బలీవర్దమ్ము చందానఁ ద
ద్దేశం బేఁగి, భిషగ్వరుం గదిసి స్వోద్దిష్టం బెఱింగింప, ధా
త్రీశానుం గని వెజ్జు వల్కెను యథా వృత్తాంత మీ రీతిగన్.

క్షితిపాలోత్తమ ! నీ ప్రసాదమున నా గేహంబు ధన్యంబు - నీ
యతి దూరాధ్వగతిశ్రమం బుడుప నా యావాసమం దీశ్వరాం
చిత సంపత్తులు లేవు; తిన్నొ యిదియే సింహాసన మ్మాశ్రమో
చిత శాల్యన్నమె రాజ భోజనము - నీ చిత్తంబు నా భాగ్యమౌ.

భోజనమ్ముల వైవాహ యోజనముల
తెర మరుఁగులుఁ బై పైని మెరుఁగు లోరుల
క న్నొఱుంగులు నాకు శ్లాఘ్యములు గావు
గాన, వినిపింతు నా సమగ్ర చరితమ్ము.

---

6. చతుర = నిపుణమైన, ఆనన = ముఖము.

వైద్య వృత్తియె నాకు జీవనము ఘనము
భగవ దారాధనమ్ము పావనము ధనము
వంధ్యుఁడను తొల్లి నా యీ భవనము
స్వామి మెచ్చెనో యేమొ సేవనము వినుము.

ధరణీశా! యవధాన చిత్తమున శ్రోతవ్యమ్ము - నా వృత్తికై తరువల్లీ సుమ కందమూల ఫల సంధానార్థమై యేఁగి, బంధుర కాంతార మొకండు సొచ్చితిని - త చ్ఛోభా ప్రశంసా పరశ్చరణౌత్సుక్యము నిల్పె న న్నిపుడు వాచస్పత్య పీఠమ్మునన్.

శార్దూల[7] మత్తేభ సంసక్తి సత్కవీ
శ్వరు కావ్య రీతిఁ గైవసము సేయ
ఖడ్గ[8] భల్ల స్ఫూర్తి కారణమ్మున వీర
భటు చమూ సాంకాశ్య పదవి నందు
గరుడ[9] చక్రాది సంగతి సేసి వైకుంఠ
భవ్య విగ్రహ విడంబనము సేయుఁ
గీచ[10] కోత్కర తిరస్కృతి సదధ్వం[11] బౌట
విరటు రాజ్య శ్రీని వెక్కిరించు

---

7) కావ్య పక్షమున - వృత్తములు.

8) అటవీ పక్షమున - ఖడ్గ మృగములు, ఎలుఁగుబంట్లు, సేనా పక్షమున కత్తులు, బల్లెములు.

9) అటవీ పక్షమున - గరుడ పక్షులు, చక్రవాక పక్షులు.
వైకుంఠ విగ్రహ పక్షమున - గరుత్మంతుఁడు, సుదర్శన చక్రము.

10) అటవీ పక్షమున - వెదుళ్ళు. విరటు రాజ్య పక్షమున - కీచక సోదరులు.

11) అటవీ పక్షమున - నక్షత్ర మార్గము.
విరటు రాజ్య పక్షమున - మంచి మార్గము.

సతత శిఖి శిఖా[12] పరిచయాంచిత శరవణ[13]
జాత జని హేతు వౌట ధూర్జటినిఁ బోలె
భుజగ[14] వలయ ప్రచుర మౌచుఁ బొలుపు మీఱు
భీమమై[15] తోఁచు నా యటవీ తలమ్ము.
భీమమే కాదు - హృదయాభిరామ మహహ !
సరస సారస సంచార చారు భావ
పూరితామృత కాసార తీరసాల
వార వారిత పథిక సంజ్వరము కరము.

వన లక్ష్మిన్ వరియించె మాధవుఁడు - త ద్వైభోగ సంప్రేక్షకుల్
ఘన హింతాల తమాల తాలముఖ వృక్షమ్ముల్ - శుకీ భృంగ ని
స్వనముల్-మంగళ గీతముల్ - పిక విరావమ్ముల్ - మహా మంత్రముల్
అనువాదమ్ములు హంస కూజితము, లుద్య ద్భాను చంద్రవ్యు దం
చనముల్ - మంగళ సూత్ర సంగత రుచుల్ - సౌగంధ్య సత్కారకుం
డనిలుం, డుద్ద్యుతి బంధుక ప్రసవ సాక్ష్యం, బగ్ని సాక్ష్యంబు - పు
ష్ప నికాయమ్ములు, నక్షతల్ - సరసిరు ట్పుత్రింబు, లాహ్వాన తే
ఖనముల్ - చూత ఫలమ్ము, లోరెములు- వృక్షచ్ఛాయ, లావాసముల్
మనువుం గూర్చినవాఁడు మన్మథుడు సామాన్యుఁడె ? గాఢోపగూ
హన సమ్మోహితులైరి యా వధు వరుల్ యావ త్ప్రమోదమ్ముగన్.

---

12) అటవీ పక్షమున శిఖి శిఖా = అగ్ని జ్వాలలు.
ధూర్జటి పక్షమున - నెమలి పింఛము.
13) అటవీ పక్షమున - శరవణ జాత = రెల్లు వనముల సమూహము.
ధూర్జటి పక్షమున - శరవణ జాత = కుమారస్వామి.
14) అటవీ పక్షమున - పాము చుట్టలు.
ధూర్జటి పక్షమున - సర్ప భూషణములు.
15) అటవీ పక్షమున - భయంకరము.
ధూర్జటికి - భీముఁ డను నామము కద్దు.

అచ్చెరు వందినారటు వియచ్చరు లెల్ల ఱు - దేవ లోకమం
దెచ్చటు లేని యీ సొబఁగు నెంచి క్రమమ్ముగ నిద్ది నాకమం
దచ్చువడెన్ సుపర్వ హృదయంబుల నొక్క వసంతవేళయం
దచ్చర లెల్ల వచ్చిరి విహారముః సేయఁగ ని వ్వనంబునన్.

అం దొక సుందరి యనె నఁటు
ఇందువదనలార ! మనకు నిది ధర్మంబా ?
ఇందిర కంబుజ మందిర
కుం దగుఁ జూపంగ నిట్టి క్షోణీ దివమున్.

శ్రీరంగమ్ము వికుంఠధామ మనియే శ్రీదేవి చిత్తంబు - కాం
తార మ్మిద్దియు శ్రీకి రంగ మని యా తన్వీ లలామంబె నో
రారం బల్కును - దీనిఁ గాంచి, మనపై హార్దమ్ము నెక్కొల్పునం
చారామల్ సిరితోడ వచ్చి రిల కీ యారామ సంసేవకై.

కాసారమ్ములు డిగ్గి, కోకనదముల్ కంఠోపకంఠమ్మునన్
గై సేయన్ ముఖ చంద్ర మండల సమీక్షన్ విచ్చె వక్షస్థలీ
వ్యాసక్తమ్ములు వెన్నునన్ వెలయు కల్వల్ మోడ్చె నారీ కచ
వ్యాసంబుం గని యంధకార మను విభ్రాంతిన్ ధరావల్లభా !

కొలఁకునుఁ జూచి డిగ్గ నళుకుం గను లక్ష్మినిఁ జూచి యచ్చరల్
జలనిధి పుత్రికిం దగునె ? సాధ్వస మంచు హసింప నేది మీ
రలు దిగఁ డంచు నామె యన- రా గమకించియు వెన్క బోవు వా
రలఁ గని యప్సరోమణులు రం డనెఁ దా నెకసక్కె మాడుచున్.

పరిహాస భాషలును - సం
బరములుఁ గ్రీడలు - వినోద వాక్యమ్ములతోఁ
దరుణీమణు లుండఁగ, భీ
కర శార్దూలమ్ము వారికడ కరుదెంచెన్.

అంత సురలోక వనితలే యైనఁగాని
యప్రతిద్వంద్వ గమనలే యైనఁగాని
స్వైర రూపమ్ము ధరించువారె కాని
ప్రకృతి సిద్ధమ్ము గద భీతి పడతుల కిల !

రంభారంభముఁ దూలె' నూర్వశి తమోరాశిం బ్రవేశించె, సం స్తంభం మ్మందె, ఘృతాచి మేనక సముత్సాహంబు వమ్మయ్యె, ని ర్దంభత్వమ్ము తిలోత్తమన్ వలచెఁ, గ్రూర వ్యాఘ్ర నిధ్వాన దు ర్దంభోళిప్రతిఘాతపాతమునఁ బూర్ణం బయ్యె దిగ్గంధముల్.

వ్యాధుని బొడగని హరిణీ
యూథంబులమాడ్కిఁ, బయితరోగ్ర వ్యాఘ్ర
క్రోధమున కడలి పారి రనాథలు
నాథలు త్రిదివాదినాథ నాథలు కలఁకన్.

పక పక లాడుచు - మఱి, వికవిక
వికలాడుచు నెగయు నాక వేశ్యా రమణుల్
చకితత్వ మందుచు - వికా
వికలైరి క్షణములోన విడచి హరి సతిన్.

జలమున శ్రీ వరాహపతి జయ్యన రక్ష యొసంగుగాక ! భూ తలమున వామన ప్రభుఁడు దప్పక రక్ష యొనర్చుగాక ! ఈ స్థలమున నారసింహుఁడు సదా శరణం బగుగాక ! సర్వ భూ తలమున గేశవుం డభయ దాయకుఁడై నను నోముగావుతన్ !

అని సిరి భయ మఱి నరహరి
మనమున శరణమ్ము గోరి స్మరణము సేయన్
కను మూసి తెఱచులోపల
జనె శార్దూలమ్ము సంకుచ ద్వాలమ్మై.

అంత నా దేవి యా విపినాంతరమున
గలువ నొక దానిఁ జే బట్టి కలఁకతోడ
నొంటిమై మానవాకృతి నుండ, నేను
గంటి - వెఱ గంటి - యా మచ్చెకంటి కంటి.

బాలామణి! యెవ్వతె, వా
ఖీల వనమునందు దిరుగ వెఱ వెయ్యది? యీ
లీల ముఖమందు దైన్య మ
దేలా? నను దండ్రిగాగ నెంచుము చేలా!

అన విని బాలికామణి నయమ్ముగ నింతకుమున్న నేను దె
ల్పిన కథ యంతఁ దెల్పి, పృథివిన్ విడిపోవఁగలేక యుంటి నం
చన విని యేను - సంతసము నంది, కుమారి! మదీయ గేహమం
దనువుగ నుండ రమ్ము, హృదయమ్మున సందియ మేల? నావుడున్.

'వల్లె' యటంచు నీ కుముదవల్లి - గుణంబుల పాలవెల్లి, రా
జల్లలనామతల్లి, స్మరచాప వినిర్గత నవ్యమల్లి, నా
తల్లి దలంచె నన్నుఁ దని తండ్రిగ గేమున వెల్గు వెల్గువల్
కొల్లగ నించె నాదు కుల గోత్రములన్ వెలయించె భూవరా!

కలువ చేతనుఁ బట్టి యా కడలిపట్టి
నా కొదవినట్టి యీ కారణమును బట్టి
కుముదవల్లి యన్నట్టి నామమునుఁ బెట్టి
పువ్వులం బెట్టి పెంచితిఁ బుడమి జెట్టి

ఈ కథన్ విని విశ్వసించి గ్రహించువారలు గావలెన్
ఏ కులమ్మునఁ బుట్టె, నెవ్వరొ యీమె తల్లియుఁ దండ్రియం
చే కులాగ్రణియైనఁ గోరిన నెట్లు దెల్పుదు నందు నే
వ్యాకులత్వము జెందితిన్ విషయంబు దెల్పితినం చనన్.

'కులమునకుఁ గాని, గోత్రమ్ము కొఱకుఁ గాని
ప్రథమ తాంబూల మర్పించు వాఁడఁ గాను
యేను మాత్రము పెద్ద కులీనుఁడ నొకొ ?
గుణములకు లోఁగి వచ్చి నిన్ గోరి యుంటి.

మీ కన్నియ నం జేకొన
మీక న్నియమించునట్టి విధు లొనరింపన్
మూక న్నియమించెద నొగి
మా కన్నియ[16] యామె - లేదు మా ఱాయమకున్.

ఏనె భృత్యుండ నందియ మెట్టిదియును
లేదు ; సరసాంగి పల్కులే వేదవాక్కు
లామె యాజ్ఞలె మాకు నత్యర్థ సౌఖ్య
దాయకమ్ము లవశ్య విధాయకములు.'

అని పరకాలరాజు రసనాగ్రమునుండియె కాక, మానస
ప్రణయ విశుద్ధి వెక్కొన హిరణ్మయ భూష లనర్ఘ చేలముల్
ఘన మణి హారముల్ తరుణికై బహుమాన మొసంగ, నామెయున్
దన మనమందు డాఁగిన యుదారతరాశయ మిట్లు దెల్పెడిన్.

'పంచ సంస్కారములు[17] నేను వడసి యున్న
కారణంబునఁ బంచ సంస్కార పరుఁడె
వరుఁడు నా కని నిశ్చయ పఱచుకొంటి
నారి వరియించు నధమాధికారి నెట్లు ?

16. మాఱ అన్నియ = మా కన్నియ. అన్నియ = అన్నియె.

17. తాపము, పుండ్రము, నామము, మంత్రము, యాగము అనునవి ప్రపన్నుల పంచ సంస్కారములు.

ఆచార్యాశ్రయణ మ్మొనర్చి, యితర వ్యామోహముల్ ద్రుంచియున్
వాచంయమ్యము నేర్చి, నీ యఘము వోవన్ బంచ సంస్కార స
ద్ధీప్రచీన ప్రభ లొప్పి వచ్చె నెడఁ బృథ్వీభారధౌరేయ ! నం
కోచ మ్మేది భవ త్కర గ్రహణ మత్యుగ్రమ్ముగా నెంచెదన్.'

అలఘుతరార్థముం దెలుపు నా లఘు సూక్తియె బీజమై యచం
చల మగు దీక్ష దోహదపు సంపదగా బరకాలుఁ డందఁగాఁ
గలిగె నలంతి కాలమునఁ గల్ప మహీరుహ సంభవమ్ములౌ
ఫలముల నైదిటిన్ గురు కృపావిభవావృత పేచనంబునన్.

తిరువరయూరం బరగెడి
కరుణామయుఁడైన నంబి కారుణ్యముచేఁ
బరకాలు డందుకొనె సం
స్కరణమ్ములు నైదు నచిరకాలములోనన్.

భుజ కీర్తులనుఁ దాల్చు భుజ యుగమ్మునఁ దప్త
శంఖ చక్రమ్ములు జక్కఁ దాల్చె
ప్రాచ్యతా దూరమౌ ఫాలాది తనముల
నూర్ధ్వ పుండ్రమ్ముల నొనరఁ దీర్చెఁ
బరకాలుఁడ నటంచు బలికెడి జిహ్వతో
భక్త భక్తుఁడ నని పల్కుచుండె
రాజ మంత్రము[18] సేయు రసనతో నెప్పుడు
మంత్రరాజావృత్తి మసలుచుండె

మేనిపైఁ గల యాత్మాభిమాన మెడలి
యాత్మపై గల భోక్తృతావ్యాజ మెడలి
యాత్మ నర్పించెఁ బరమాత్మ యంఘ్రులందు
నోలిఁ బరకాలుఁ డాత్మానుకూలముగను.

18. మంత్రులతో రాజు చేయు మంతనము.

19. ప్రపన్నులు నిత్యము ననుసంధించుకొను ద్వయ మంత్రము.

ప్రతిహత మౌను సూత్ర మపవాదక సూత్రముచేతఁ, గామినీ
రతు లయి సత్త్వ నిష్ఠితులె రాజస తామసు లౌటు సూత్ర మీ
వ్రతి పరకాలు గాథ యపవాదము దానికిఁ దొల్లి దుస్తమో
మతి యయి, రాజసుం డయి, క్రమంబుగ సాత్త్వికుఁ డయ్యె నాతఁడై.

ఆకారత్రయ మాకళించుకొనెఁ, బంచార్థ ప్రకారమ్ముచేఁ
బ్రాకామ్యమ్ము వహించె, జూఱగొనె శ్రీఘంబె రహస్య త్రయం
బాకంఠంబు పఠించె, నేమమునఁ బూర్వాచార్య సద్గ్రంథముల్
శ్రీకాంతాపతి వైభవాతిశయముల్ సేవించెఁ భావించె దాన్.

అట్టు లాచార్య దివ్య కటాక్ష మంది
ఏఁగు మిఁక గేస్తువై రాజ భాగవత కు
ల ప్రతిష్ఠకుఁ బూను వైళంబ' యనెడి
గురుని యనుమతిఁ బరకాల కోవిదుండు.

తిరుణాంగూ రరుదెంచి, 'రాజముఖి! నీ దివ్యాజ్ఞ బాటించితిన్
బరకాలుండను గాను - వైష్ణవులకుం బాలుండ, నాచార్య వా
క్సరముల్ మౌళి ధరించి వచ్చితి నికం గైకొమ్ము నీ వానిఁగాఁ
బరమార్థామృత దాయినీ! గురు వచః పారమ్య సంధాయినీ!'

అనెడి పరకాల సూరివర్యుని స్వరూప
సంపదనుఁ గాంచి, మనమున సంతసించి
భళిర! నీ వయ్యె కార్ముక వరుఁడ వనఁగ
ననుచు నీ రీతిఁ బల్కె యతివ మిన్న.

'వంశము[20]నందుఁ బుట్టి, గుణవత్వము[21] గల్గియు, వర్ణ సంకర[22]
భ్రంశముఁ జెంది, సిగ్గున,[23] శరమ్మున సంధి యొనర్పబోఁ డెవం
డంశము లన్ని గల్గియును నట్టి భవ చ్చరితమ్ముగా నశే
షాంశ మొకండు గ ద్దవి సమగ్రము జేసిన నిన్ వరించెదన్.

ఆరాధనములలో హ
ర్యారాధన మధిక మందు రార్యులు దానిన్
మీఱు నటు భాగవతుల స
మారాధన మద్ది నీకు నాచర్య మగున్.

ప్రతి దినమ్ము నష్టోత్తర శత సహస్ర
భాగవత సత్తముల కతి భక్తితోడ
భోజనము వెట్టి, త చ్ఛేషమును భుజింపు
మొక్క వత్సర మద్ది సర్వోత్తమంబు.

భాగవత శేష భోజన భాగధేయ
మిట్టి దట్టి దటంచు వచింపరాదు
దాని నొనరించి వచ్చెదవేని నిన్ను
మాటు మఱి లేక వరియించుమాట నిజము.'

---

20) శార్ఙ్గ ధనుః పక్షమున వెదురు.

21) నారి కలిగి యుండుట.

22) వర్ణ సంకరుఁడనఁగా - వసుదేవ తనయుఁడై, నందు నింట బెరిగిన కృష్ణపరమాత్మ. వానినుండి భ్రంశము.

23) సిగ్గు - శరము అని లోకోక్తి గలదు. ప్రకృతార్థము సులభమే.

ఆమె యాదేశ[24] మాతని కాగమమ్ము[25]
తద్ధితము[26] నందె వాని హృ త్ప్రత్యయమ్ము[27]
ధాతు[28] బలమున నుపసర్గ[29] మాతఁ డొందు
వెలఁది యుపదేశమే[30] గుణ[31]వృద్ధి[32]కరము.

'ఇంతిరో ! నీదు శాసనము నిప్పుడ దీర్చెద, నీవు నాదు నీ
మంతినిగాగ, భాగవత మండలి కర్చ యొనర్తు, నల్ప వే
శంతము గాదు - కోశము విశాల సముద్రము భీతి లేదు - వ
ర్షాంతమునందు వచ్చెద సుహాసిని ! నన్ మఱువంగఁబోకుమా !'

అని శ్రీమ త్పరకాలుఁ డాత్మ నగరమ్మం దుండి రాజ్యాభిపా
లనమున్, భాగవ తార్చలున్, నిరత ముల్లాసంబునం జేయుచున్
ఘన దర్పంబును గమ్రి నమ్రి గతియుం గల్గన్ బ్రభూత ప్రచో
దనుఁడై మెల్లగఁ బెంచె భాగవత వృత్తమ్మందు సంఖ్యా స్థితిన్.

వరుగుల్, పప్పులు, నప్పడంబులును, మవ్వంబైన శాకంబులున్
పెరుగుల్, మీఁగడ, లాజ్యముల్, రసములున్, వేపుళ్ళుఁ, బచ్చళ్ళునున్
అరిసెల్, గారెలు, బూరె, లప్పములు, బొబ్బ, ట్లావడల్ మేదినీ
వరుఁ డేర్పా టొనరించె భాగవత హృ ద్భావానుగుణ్యంబుగాన్.

మొదటఁ బైదలి ముదలచే మొదలు బెట్టి
విడువగాలేకపోయె భూవిభుఁడు భాగ
వతుల శేషోపభోగ మెవ్వండయేని
వదలఁ గల్గునె రుచి జూచి వస్తువులను.

---

24. నుండి, 32 సంఖ్యవఱకు గల పదములు — వ్యాకరణ శాస్త్రము నందలి సంజ్ఞలు మాత్రమే, పరిష్కృతార్థము వేరు.

గడువునుఁ దీర్చి వచ్చెఁ బరకాల శిఖామణి తన్వి చెంతకున్
గడుసరియే యితం డని సగంధులు మెచ్చిరి, బాలికామణిన్
దడవులు సెప్పఁబోక తలి దండ్రులు నీలుని పాణియుగ్మ మం
దిడి రుదకాభిషిక్తముగ నెల్లలు నైరి సమృష్ట భోజనుల్.

లతలు, బందితులును, వధూ లతలు నాశ్ర
యమ్ము లేకున్న శోభిల్ల రనెడి బుధుల
మాట బాటించెనేమొ రామామతల్లి
కోరి పరకాలవరుఁ జేరెఁ గుముదవల్లి

లీలన్ నీలుఁడు నేలె నా కుముదవల్లీ ప్రేమ సామ్రాజ్యమున్
చోళాధీశ్వర దత్త భూవలయ వాస్తోత్పత్త్య మాచార్య సే
వా లబ్ధార్ధ సమూహ వారి రుహ బాంధవ్యమ్ము శ్రీవైష్ణవ
ప్రాలేయాంశుక రోర్మిఘ్నితామృత రస ప్రాధాన్య సౌధన్యమున్.

ఒకటు స్నీల సమాఖ్య, రెంటు పరకాలోపాఖ్య, మూడింటు న
ల్త్రృకరేచ్ఛం గలివైర్యభిఖ్య, హరికోదండాంశసద్యోగ జా
తకుఁడై, నాల్గిఁటు శార్ఙమూ ర్త్యభిధ చేతన్ ఖ్యాతిఁ జెన్నారె, భ
క్తికి మూలం బయి ఐదిఁటుం బరగె శ్రీ తిర్మంగయాళ్వా రనన్.

పంచాహ్వాయు నీతనిం గని
పంచ మహా పాతకములు వడి నశియించున్
పంచామృత మధురము ముని
పంచాననుఁ డితని గాథ పాతక తతికిన్.

తొల్లిఁటి వృత్తిచేఁ గనిన దోష రజః పటులమ్ము వైష్ణవో
త్ఫుల్ల పదారవిందగతి తోయ ముచే నణఁగారినట్లుగాఁ
జల్లఁగ క్షీణమై చనియె శార్ఙవతారుని కోశ మెల్లఁ దా
నెల్లను మీరి నిత్య మొనరించిన భాగవతాతిథేయతన్

కోశ మందున రొక్కమ్ము కొఱత వడుటఁ
జోళ భూపాలు కప్పమిచ్చుటకు సమయు
భంగ మేర్పడ, సామ్రాట్టు పంపినట్టి
దూత యొకఁ డరుదెంచి యీ రీతి బలికె.

'ఓ నృపాలక ! యివియె దూతోచితములు;
పత్రిణితు లామీద ; చోల సమ్రాట్టు మీ కొ
సఁగిన యాజ్ఞాపన మిదిగొ చదువుఁ' డనుచు
నిడిన దానియం దిట్లు లిఖించి యుండె.

'ఒడయనిఁ జేసినాఁడ నొక యుర్వికి నిన్ వడిఁ గప్ప మీయఁగా
నొడఁబడినాఁడ వప్పు డదియు న్నెఱవేరెను బెక్కు కాల మా
వడువును విస్మరించితివి పాడియె ? నే నిదె యాన బెట్టితిన్
దడయక కప్ప మిచ్చి యుచితజ్ఞుఁడవం చనిపించుకొ మ్మికన్.

ఇదియె ప్రథమమ్ము గాదు మా ముదల మీఱి
ఒకటి, రెం డయ్యె, మూఁ డయ్యె, నిఁక సహింపఁ
బడదు మా కీయవలయు కప్పమ్ము దూత
కిచ్చి పంపుమా ఇది మాదు హెచ్చరికయె.'

అనినఁ బరకాలమౌని యాత్మాభిమాని
యైన దొలు దొల్త భేద వాక్యమ్ము లేల
యెంత యైనను సామంతుఁ డే నతండు
సార్వభౌముఁడె కద ! యని సామముఁగను.

'సార్వభౌముండు భేద్మి నొసంగినట్టి
యాధిపత్యమ్మునకు సదా యంజలిఁ తు
నతని శాసనమున కెపు డడ్డు లేదు
వ్యవధి గోరెదుఁ ద న్నిర్వహణము కొఱకు.

రాజ దశ్రివ్యము ముట్టఁబో నితర దుర్వ్యాపారమం దింతయున్
యోజింపం బని లేదు - దుర్వ్యసన మెద్దో వాసె, నన్ను త్పురా
సౌజన్యార్జిత భాగధేయ మెదియో చర్చింపఁగా జాల, నీ
హా జంబాలము లేల ? రాజ ధన మర్థ మ్మందె వెచ్చించితిన్.

రంగ ! దయాంతరంగ ! కవిరాజ వచః పరిషంగ ! శ్రిత సా
రంగ ! విరా ట్తురంగ ! కర రంజిత దివ్య రథాంగ ! మౌని హృ
దశ్రింగ ! లస త్పతంగ ! యసుర ప్రతిరోధి నిషంగ ! రంగ భూ
మంగళ సంగ ! సంగత రమా రుచిరాంగ ! అభంగ సంగరా !'

అని, శ్రీరంగని బాడుచున్ విగత మాయా మోహ మూర్ధన్యులై
అనిశంబున్ ద్వయ మంత్ర చింతన పరాయత్తాత్మ చైతన్యులై
కనులన్ బాష్పము లార, దేహము వడంకన్, గద్గద గ్రీవులై
దినముల్ బుచ్చెడి వైష్ణవో త్తముల ప త్తీర్థంబు సామాన్యమే ?

కావేరీ సరయూ కళింద తనయా గంగాది పుణ్యాపగా
సేవాఖండ ఫలమ్ము వైష్ణవ గురు శ్రీపాద తీర్థమ్మిచే
దైవాఱున్ భవ సంచరిష్ణువులకుం దాపత్రయ మ్మార్చి, స
ద్యో వైకుంఠ సుఖమ్ము నద్ది కృప సేయున్ నిర్వికల్పమ్ముగన్.

తాదృ గ్భాగవతాంఘ్రి తీర్థమునకుం ద దృుక్త శేష ప్రసా
దాదాన ప్రతిపత్తి పీఠము సమస్తార్థమ్ము మాసాంత ము
ర్యాదన్ మీఱును, రంగనాథు కృపచే నాన ఙ్యముం గాంతు, ని
త్యాదుల్ బల్కుము రాజ దౌత్యకర ! మ ద్వ్యాఖ్యానుసారమ్ముగన్.

పరమాదర మొప్పఁగ, న
ప్పరకాల విభుండు పల్కు పల్కులు చోళే
శ్వర వార్తాహరుఁ డేమియు
నరకు గొనక, నిలచి పలికె సాహస మడరన్.

'కప్పు మీఁద వీయవలయు, నే నేగవలయు
నేను నీ మాట నమ్మఁట నీటి మూట
నాదు పట్టిన పట్టు వస్త్రాదుపట్టు
చాల నను మెచ్చు నీ రోజు చోలరాజు'

అనుచు జోళదూత యమదూత రీతిగాఁ
బట్టు బట్టి ద్వారబంధమందు
నడ్డు నిలచి యున్న - హరి శార్ఙమూర్తి దా
నాగ్రహోగ్రుఁ డగుచు ననియె నిట్లు.

'విరోధమా! నరాధమా! తృణీకరింతువా? ననున్
సురాధినేత కాని, నీదు చోళనేత కాని, యా
పరేతరాజె నిన్నుఁ బ్రోవ వచ్చినన్ ద్యజింతునే
శిరోధిఁ బట్టి నెట్టి నిన్నుఁ జెండెదన్ దురాత్మకా!'

అనుచు భటులఁ జూచి, కనుసన్న సేయఁగా
వారు వచ్చి, దూత నోరు మూసి
తుంటి విరుగఁ దన్ని, గెంటిరి మెడ బట్టి
వాఁడుఁ బుడమి వ్రాలి యేడ్చు గఱచె.

మరల నెదిరింపఁ దొంటి నిబ్బరము లేక
యెమ్ము లన్నియు మిగులఁ జూర్ణమ్ము గాఁగ
రావణుని కొల్వునందు శూర్పణఖ వోలె
దూత మొఱ లిడె నిటు చోళనేత మ్రోల.

'వాఁడు రవంత యేనియు భవ ద్వచనమ్మును లెక్కపెట్టు లే
దాడిన పల్కు లెల్ల మధురాక్షరముల్ విష గర్భితమ్ము లీ
రేడు జగాలఁ దానె యగు వెక్కటి పోటరి యంటు - వాఁడు నన్
బోఁడిమిఁ బట్టి యిటు బుచ్చె న దెంతటి గుండె ధైర్యమో!

రాజ ప్రేష్యుని న స్సి
యోజ బరాభూతుఁ జేసె నుక్కడర భవ
త్సౌజన్య మైన నాతఁడు
యోజింపఁగ లేదు దోర్బలోద్ధతుఁ డగుచున్.

భాగవతు లంట ! వారల పాద తీర్థ
మమృత రస మంట ! వీని
యర్థ మేదియో నా బుద్ధి కందలేదు
విత్త మంతయు దానికి బెట్టె నంట !

గడు వడుగ లోఁబడక మల
వడువనఁ దడఁబడక నిలచి వడిఁ గప్పము నీ
కడుగిడ నీ నని నుడివినఁ
గడిమిం బడగెంతెఁ గండకావర మెంతో ?

భువనాఖండల ! సంగర
భవ సంభవ ! నా కతండు పచరించెఁ బరా
భవ మన నే మని యనఁ దగు
భవ దాశయ మెట్లొ, యట్లు వర్తింపఁ దగున్.

అని వార్తాహరుఁ డూది పల్కిన నుడుల్ జ్యానాథు చిత్తమ్మునం దున ఝుంఝూనిల వీజనమ్ము లయి పెన్ ధూళిన్ విజృంభింపఁగా నొనరింపం గను గప్పి, భూపతి పథ మ్మూహింపఁగా లేక, మంత్రి నిబోధంబున దండనాథు బనిపెన్ వర్తింపఁగా నీలునిన్.

'ధరణీతలేంద్ర ! నీ యెడఁ గృతజ్ఞత పోసిన నీలు నీ పదాంబురుహములం బడన్ వచ్చి బుద్ధినిఁ జెప్పెద మాకుకీన సంగర నిపుణత్వ మేలికకుఁ గప్పడఁ జేసెద నంచు సత్వరమ్మరిగెఁ జమూధవుండు చతురంగ బలాన్వితుఁడై చలమ్మునన్.

నగరముఁ జుట్టి జోళ పృతనాపతి - యంత గృహీత వాలమై
భుగ భుగ లాడు పన్నగము పోలిక నీల చమూధవుండు - దా
నగణిత వాహినీ సముదయాన్వితుఁడై యెదు రెత్త, భీకర
మ్మగు సమరమ్ము సంఘటిత మయ్యె బలమ్ములు రెంటి కత్తటిన్.

ఆశుగ భల్ల చక్ర కవచాస్త్ర శతఘ్ని ధను స్త్రిశూలముల్
పాశ పరశ్వధ క్రకచ పట్టిస ముద్గర భిందిపాలముల్
ప్రాస గదా నిషంగ ముసలమ్ములుఁ దోమర మండలాగ్రముల్
వాసిగఁ బూని పోరి రిరు వర్గములన్ జయలక్ష్మిఁ గోరుచున్.

మత్తేభ తురగ రవములు
పత్తి నినాదములు రథిక వర్గార్భటముల్
మొత్తములై దిక్తలముల
నొత్తుగఁ బూరించె నాహనోత్సవమందున్.

ప్రధనక్షోణి రథాంగ[33] విస్ఫురణమై రాజన్యకాపూరిత
శ్లథ శంఖారవమై, పరస్పర జిగీషా శౌర్య ధై ర్యేందిరా
పృథు వక్షస్థలమై, నికృత్త హృద సృక్పీతాంబరమ్మై, పత
ద్రథమై,[34] యుగ్ర[35] పృషత్కమై హరి ప్రకారంబున్ విడంబించెఁ దాన్

33. ఇందు యుద్ధ భూమి - హరి ప్రకారము ననుకరించినట్లు చెప్పబడుచున్నది. రథాంగ = యుద్ధభూమి పక్షమున రథ చక్రము. హరి పక్షమున సుదర్శన చక్రము. శంఖారవ, ఇందిరాపృథు, పీతాంబరాది విశేషణముల యందు యుద్ధ భూమికి - హరి ప్రకారమునకు - శబ్ద మాత్ర సాదృశ్యమే.

34. పత ద్రథము = యుద్ధ భూమి పక్షమున, పడుచున్న రథములు గలది. హరి పక్షమున - పక్షి రథముగాఁ గలది.

35. ఉగ్ర పృషత్కము = యుద్ధ భూమి పక్షమున - భయంకరమైన బాణములు గలది. హరి పక్షమున - శివునకు బాణ మైనది. త్రిపురాసుర సంహార కాలమందు శివునకు బాణ మైనట్లు పురాణ గాథ.

ఆహవ నిహత భటోచిత
హాహాకారములు వారి యాత్మలు రవియం
దాహుతి సేసెడి వేళల
స్వాహాకారమ్ము లయ్యె సమర ముఖమునన్.

క్రమ్ముకొని యమ్ము లెగజిమ్ముకొని యొండొరులఁ
గ్రుమ్ముకొని యహమ్మతి సెలంగగన్
నమ్ముకొని యాత్మబల మమ్ముకొని దేహములు
సమ్మతిగ బోరిరి బలమ్ము లిరు వంకన్
అమ్ములకు నమ్ములు రథమ్ములు రథమ్ముల కి
భమ్ముల కిభమ్ములు నురమ్ముల కురమ్ముల్
కొమ్ములకు కొమ్ములు శిరమ్ములు శిరమ్ములకు
దిమ్ములుగఁ బోరిరి నయమ్ముఁ జల మొప్పన్.

ధరణిం బడి యీల్గిన మొండెపు మొ
త్తములం గని భూత పిశాచములన్
పరమోత్సవ సంభరితమ్ములునై
భ్రమియించె వియత్తల రంగమునన్.

అపుడు పరకాల సైన్యాధిపాంతకుండు
మొనసి కరవాల చాలనమ్మునఁ బగతుర
కుత్తుకల మొత్తముల నూఁచ కోఁత గోయ
బెండు వడి పారి రంత నా దండి మగలు.

పరకాల చమూబల నిర్జితమై పరు
పరు వెత్తిన స్వీయ చమూ చయమున్
బరికించుచుఁ జోల చమూపతి తాఁ
బురికొల్పె నిటుల్ పున రుద్యతికై.

'వెన్ను జూపగ రా దాజి వీరుఁ డెపుడు
జయము గాంచిన సన్మాన సభలు జరుగు
మేను వాసిన స్వర్గాన మేన కాదు
లఱుతఁ బుష్ప హారము వైచి యాదరింతు౹౹."

అ రీతిఁ జోళ పృతనాధిపుఁ డెచ్చరింపన్
భీరుల్ సుధీరు లయి పెల్లుగ నార్చి శూర
పారంభులై మగుడ నాహవ మయ్యె బాహా
సార ప్రభావ మిరు సైన్యములం దెలర్పన్.

ద్విగుణిత శౌర్య ముట్టిపడ ధిక్కరులో! హరులో! విసృష్ట ప
న్నగములో! యున్మదోక్షములో! నాగఁ, గచాకచిఁ బోరసాగి ర
క్తభ గళిత వర్షుకాభ్రముల భంగి దలిర్చుచుఁ జోల నీల సై
న్య గణపతుల్ బరస్పరము నార్చుచుఁ, బేర్చుచు, హుంకరించుచున్.

క్రమముగ నీల సైన్యపతి గారుడ విక్రమ మొప్పఁ జక్ర చం
క్రమణ మొనర్చి, శాత విశిఖమ్ముల రొమ్ములయింపఁ జోల సై
న్యము సెదరెన్ జమూపతియు వస్త్రములం బడవైచి, వేఁగ - భూ
రమణుని పాలికిం బఱచె. రక్త నిషిక్త మహీధ్రమో యనన్.

వచ్చిన దళవాయిం గని
మెచ్చి, విభూషణము లీక మేదినిపతి తా
నచ్చెరు వంది సమస్తము
గ్రుచ్చి యడుగ, నతఁడు గోడుగోడునఁ బలికెన్.

'ఏ మని వచియింతు నేలినవారికి
నా పడ్డ పాట్టీ దినమ్మునందు
పరకాల సేనాని పరతెంచె ము మ్మొదు
రొక్కనఁ బోర నాహవాకుంఠితుండు

పురరోధన మ్మేము బొనరింపఁ బ్రదుటిలోన
వచ్చి తా సైన్యమున్ విచ్చగొట్టి
శర వర్షమున మమ్ము తరతర లాడించె
బాధించెఁ గారించెఁ బారిషదుల

నంతకుండు కాఁడు — వాఁడు నరాంతకుండు
నంతమాత్రమె కాదు, దేవాంతకుండు
నేమి చాతుర్య, మేమి సంగ్రామ గరిమ ?'
మనిన విని, చోళ భూపతి యనియె నిట్లు.

'ఉత్తరాగ్రజునకు సోదరులైన మీ
బింకమ్ము మేష గంభీరమమ్ము
అరులకు వెన్నిచ్చి పఱచి వచ్చిన మీ మ
గంటిమి తద్గళాగ్ర స్తనమ్ము
పాఱి వచ్చుటె కాక, పగతురన్ మెచ్చు మీ
మానమ్ము క్షీణోపేత దావ గుణము
అని మొన నిల్గక యర్హుల మనిన మీ
కోపమ్ము పంగు ప్రకోపనమ్ము

ఒక్క సేనాని నెదరింప నుక్కడంగి
పాఱి వచ్చిరి మీ రేటి బంటు లహహ !
సేన దండెత్తిపోయి యా నీలు వాంచి
వచ్చువాఁడను మీ కేమి వలదు శ్రమము.'

అని నిశ్చప్రచవాక్యముల్ బలికి చోళాధ్యుం డుదాసీనుఁ డయ్యె, నిమేషమ్ములు కొన్ని నీరములు నయ్యెం ద త్సభా మధ్యమం దనివార్యమ్ముగ, నంత భూమిపతియున్ పాకూత దృక్సంప్రసారణముం జేయఁగ లేచి పల్కె రిపులన్ బ్రహ్మజ్ఞ చూడామణుల్.

'ధరణీ పురందరుండవు - నధర్ముఁడ వా పరకాలుఁ జూచి, యం
దర మనుకొన్న వారముగదా ! యతఁ డేదొ విశేష శేముషీ
పరుఁడని, వాని రాజ్యమున వ ర్తిలఁజేసితి వీవ, యాతఁడున్
బరమ సమర్థుఁడై త్వ దనువ ర్తనముం బచరించె భూవరా !

హరి కటాక్షము సంపూర్ణ మతని యందు
ఆది నవ స క్తి, పిదప - రాజ్యానుర క్తి
తుదకు హరిభ క్తి - గురుభ క్తి తుట్ట తుదకు
భాగవత శేష భోగ భావ ప్రస క్తి.

ద్రవ్య ద్వారము పుణ్యమం చెఱుఁగవే రాజేంద్ర ! నీలుండు దా
నవ్యాజమ్ముగఁ జేయు వైష్ణవ సపర్యం గల్గు పుణ్యమ్ము నం
దే వ్యాఘాతము లేక, సంగత ఫలుం డీ వౌటచే, వాఁడు సం
స్తవ్యుండో ? పరిభావ్యుఁడో ? సమభియాతవ్యుండొ ? యోచింపుమా?

అదియుంగాక యతండు గప్ప మిడగా నర్థించె గాలమ్ము, నా
యదనుం గానక ధూత ధూ తనయుఁడై యందెం బరీభావ, మా
పిదపన్ వాని బల మ్మెఱుంగకె పురం బీడించి న్యక్కార మం
దె దళాధ్యక్షుఁడుఁ ద చ్చమూధవునిచేఁ దీవ్రాతి తీవ్రమ్ముగాన్.

నీలు దళవాయియే యింత నిపుణుఁ డనగ
నీలు సామర్థ్యముం జెప్ప నేల ? యతని
శౌరి కోదండ దివ్యావతారుఁ డనఁగ
వసుధ బల్కుచు నుంద్రు దైవజ్ఞ వరులు.

పరకాల బిరుద మిడి స
త్కరించితివి; వాని నోలగమ్మున నాఁ డీ
తరుణమున నీవ వానికిఁ
బరుఁడవుగా నిలచి పోరవలదు మహీశా !

అదియునుఁ గాక, భాగవతు లందఱు వాని పయిన్ దినమ్ముఁ, న
భ్యుదయ పరంపరాస్తు, విజయోఽస్త్వితి వాక్య సువర్ణ పుష్ప సం
పద గురిపింత్రు - వారి కది బద్మమొ ? నీలమొ ? కామ ధేనువో ?
త్రిదివ మహీ రుహమ్మొ ? జగతీ ధవ ! యేమి వచింపగా నగున్ ?

అనుచు బ్రహ్మవిదులు స్వాశయమ్మునుఁ దెల్ప
మంత్రివరులు రాజ్య తంత్రమందు
స్వాతిశయము దెల్ప నవసర మ్మని యెంచి
ప్రభువరేణ్యు తోడఁ బలికి రిట్లు.

'కాదనబోము మేము పరకాలుని గొప్పదనమ్ము, బ్రహ్మ వి
ద్యాదము భంగపుచ్చు ప్రతివాదము సేయఁగఁబోము కాని, భ
క్త్యాది గుణ ప్రకర్షమున కాదృతి జూపు పథమ్ము వేఱు; మ
ర్యాదను మీఱువానికి నయజ్ఞుల దండ విధంబు వే ఱగున్.

అనలుఁడు యాజకుం డిడిన హవ్యముగాఁ గొనిపోయి, యజ్ఞ భో
జనుల కొసంగి, వారల ప్రసాదము హోతకుఁ గల్గఁజేయు, నా
యనలుఁడె యూర్ధ్వ సంజ్వలనుఁడై వలభిన్ దహింప నుద్యమిం
చిన, నెవఁడైన నప్రసృత చేతనుఁడై శిఖ లార్పకుండునే ?

రాజన ముండవచ్చు నది రాజ సమక్షమునందు గాదు - రే
రాజరులాదు రిక్కల కుఱంగట రాజిలుగాని, చండ నీ
రేజ సఖాగ్రమందు విహరించునె ? యుద్ధతి నా జనుర్ధరా
భోజులు మీ కడన్ నడుమఁ బుట్టిన జెట్టికి నిట్టి గట్టియా ?

రాజ విత్తాపహారము - రాజదూత
సంప్రహారము - రా ట్చమూ సమభియాన
మిన్ని జేసిన వాని దండింపకుండ
నెట్టి శాస్త్రము నంగీకరింపఁబోదు.

ఒక్క రొక్క మ్మిడుటకె యాయోధనమ్ము
జలుపు మని కాదు మాదు ప్రోత్సాహ మిపుడు
మూల సూత్రము లిట్లు నిర్మూలమైన
నాపగలవార లెవ్వ రీ యవినయమ్ము.

ఖలచర్యా వినిరోధ మేర్పడక లోక మ్మందు సర్వుల్ విశృం
ఖల వృత్తిం బచరింత్రు, ధర్మ గతికిం గాతర్యమున్ వాటిలున
కుల శైలమ్ములు కుంగు. గండశిల లెక్కున్ మీదికిం గాన, న
త్తులువన్ నీలుని నొంచు కార్యగతి నిర్దోషంబు ధాత్రీశ్వరా !'

అనుచుం ప్రెగ్గడ లాడినట్టి పలుకుల్ స్వాభీష్ట మేకమ్ముగా
మనుజాధీశ్వరుఁ డాహవమ్మునకు సమ్యగ్దీక్షితుండై, విరో
చన తారేట్కుజ కన్యకాధిప సురాచార్యాసురాచార్యులున్
శని రాహు ధ్వజు లొక్కటై శుభద వీక్షల్ నింప, శంపాలతా
గ్ర నిశాతోగ్ర కృపాణముం గని శతాంగం బెక్కె నుత్సాహియై.

పటహము మొరసెను శాత్రవ
పుట భేదన జేతు నాత్మ భూ పటహమ్మై[36]
పటలము గదలెను స్వ విశం
కట వీర్యచ్ఛాది యవనికా పటలమ్మై.[37]

పటల గమనోద్ధమా రజః పటల మెల్ల
బవర మందున వె న్నిచ్చి పాఱఁ జూచు
భటుల కే దిక్కు దోపని పగిది నప్పు
డష్ట దిగ్బంధన మొనర్చె ననఁగ నొప్పె.

---

8. పటహమ్మై = వస్త్రమును హరించునదై.

37. పటలమ్మై = వస్త్రమును లాగునదై.

పరగెఁ జతురంగమున[38] మూడుపాళ్ళు మేము
ప్రభువు సంపత్తిలో రెండుపాళ్ళు మేము
మేము దేనికి లోఁబడఁబో మటంచు
వరుస దురగముల్ పత్తులుఁ గరి రథములు.

కల్పానేహః ప్రకుప్య గ్గలళ కబళ[39] సంకాశుఁడై, నేత్రవాం[40] త్రా నల్ప్రియః పావకుండై, యచల సముదితాభ్యాశుఁడై,[41] నీల రక్తా[42] నల్ప కుద్ధాత్ముఁడై,సాయక గిరిధరుండై[43] ,యాహవ ధ్వంసకుండై[44] నిల్చెన్ జోళుండు సేనా నివహము గడిమిన్ నీలరాడ్ధాని పొంతన్.

38. 'చతురంగ' అను నాల్గక్షరములలో - మొదటి 'చ' వదలినచో, తక్కిన మూఁ డక్షరములు 'తురంగ' అయినది. 'సంపత్తి' అను మూఁడక్షరము లలో - మొదటి 'సం' వదలి.చో 'పత్తి' అయినది. పత్తి = కాలి బలము. కరి రథములు మాత్రము పై విధముగా ఏ పదమునందును ఇముడలేదు. అదియే ఉత్కర్షాపాదకము.

39. గరళ కంఠ = శివుఁడు. ఇందలి విశేషణము లన్నియు - శివునకు, చోళ నకు అన్వయించును

40 శివుని నేత్రమునుండి నిప్పు వెడలును. క్రోధముచే చోళునకు.

41. శివుని పక్షమున అచల సముదిత = పార్వతీదేవియొక్క అభ్యాశ = సామీప్యము. చోళుని పక్షమున అచల సముదిత = నిశ్చలముగా కలిగిన, అభ్యాస = ఆశ.

42. శివుని పక్షమున నీల = లోహితుఁడు. మఱియు - అనల్ప కుద్ధాత్ముఁడు= అనల్పముగా క్రోధము జెందినవాఁడు. చోళుని పక్షమున నీలరక్త = నీలుని యందు రక్తి గలవానియెడ అనల్ప క్రుద్ధాత్ముఁడు. అనల్పముగా క్రోధముఁ జెందినవాఁడు.

43. శివుని పక్షమున, సాయక గిరిధరుఁడు = సాయకమైన విష్ణువు గలవాఁడు. చోళుని పక్షమున, సాయకముల గుట్ట గలవాఁడు.

44. శివుని పక్షమున, అహవ ధ్వంసకుఁడు = యజ్ఞ ధ్వంసకుఁడు.

చోల పరకాలు లిర్వురు శుద్ధ శీలు
రిర్వురును సమ బలు లాహవోర్వియందుఁ
బక్షపాతము నేల జూపంగవలయు
ననఁగ నడిమింటి కెక్కె న య్యబ్జ సఖుఁడు.

స్కంధావారమునందుఁ జోలమహిభృ త్సైన్యమ్ములున్ నిల్చె, స
ద్బంధుల్ భాగవతాళి నీల మహిభృ త్సైధమ్మునన్ నిల్చి రా
సంధిన్ జోలుఁడు వీరపాణమచటన్ సంపూర్తి గావించె, శ్రీ
గంధోదంచిత తీర్థపాన మిచటం గావించె నీలుండుఁ దాన్.

భాగవతోత్తముల్ సరిగఁ బంక్తులు దీరిచి యుండి రా స్థలా
భోగము భోగి భోగ పరిభోగమొ ? శ్రీ కలశాబ్ధి కన్యకా
స్వాగతమో ? కలి ప్రమధనార్థ సమాగత నిత్యసూరి సం
యోగమొ ' త్యాగ యోగ నిగమోద్గమ శార్కర భూమి భాగమో?

పాక మ్మెల్లఁ బులాక మయ్యె నొకొ? సూపంబుల్ సలోపంబులో?
శాకమ్ముల్ లవణాతిరేకములొ ? భక్ష్యంబుల్ పరీక్ష్యంబులో ?
ఆకుం గూరలు నారలో ? మఱియు - క్షీరాన్నంబు నధ్వాన్నమో ?
లోకారాధ్యులు మీరు - దానున కిటుల్ తోఁతెంచుటే భాగ్యమో ?

వసుధ భవాగ్ని మగ్ను లగువారికి శాస్త్ర కరావలంబన
మ్మొనఁగి సముద్ధరించుటకు నుత్సుకతన్ మనుజావతారుఁడై
యసదృశశోభ వెల్గెడి మహామహులార ! సమర్చనోపధిన్
బొనఁగెడి యెగ్గులన్ సయిచి ప్రోచుఁడు మత్కృతముల్ దినమ్మునన్.'

అని శ్రీమ త్పరకాల ధీరుఁడు తదీయారాధనై కాగ్రి చే
తనుఁడై యుండగ వేత్రిహస్తుఁ డొకఁ డత్యంతాకులుండై, 'ప్రభూ !
మన పూ ర్ద్వారము ముట్టడింపఁబడె సమాగ్రి టోప్చేళుఁడే యెత్తి వ
చ్చెను భూరి ధ్వజినీ సమేతుఁ డయి నొచ్చెన్ వప్రి పర్యంతమున్.'

అనుచుఁ బ్రతిహారి దెచ్చిన, యా ప్రవృత్తి
పానకమ్మునఁ బుడకయుఁ, బ్రథమ కబళ
మందు మక్షికా సంపాత మట్లు దోఁప
నిట్లు దలపోసెఁ బరకాలుఁ డేకతమున.

'బహు విఘ్నంబులు శ్రేయముల్ గద ! మహా భక్తాళి కా వేళ దు
స్సహ వార్తాశనిపాత మేల ? భగవ త్సంకల్పితం బెట్టిదో ?
మహిపాలుం డిపు డెత్తి వచ్చుటకు నా మాంద్యమ్మె యౌఁ గారణ
మ్మిహలోకమ్మున సర్వమున్ ధన గతమ్మె కాని, నా త్స్యన్యథా.

భాగవతు భీత లెల్ల సంభ్రాంతు లైరి
యిట్టి కోలాహలమ్మె వా రెఱుఁగ రెపుడు
నర్థ భోజనమున వికలాత్ము లగుచు
నుత్తరాపోశనము బట్టియుందు రకట !

భయము మీ కేల యంటి, మీ బంటు నంటి
నయ్య ! మీరలు భుజియింపుఁ డంటిగాని
కుసుమములఁబోలు వారి మానసములందు
వజ్ర సంపాతమయ్యె నీ వార్త యౌర !

ఈ దుస్థితి కంతటికిన్
నా దౌర్భాగ్యమ్మె కారణ మ్మరయంగా
లేదో ? నిష్కృతి దీనికి
ఏ దారిఁ దరించువాఁడ నీ విప దబ్ధిన్.

అన్నిటికి మూల మౌను సింహాసనమ్ము
దాన వాటిల్లు రాజస దంభవృత్తి
దానఁ గర్తవ్య మౌఢ్య మ ద్దాన సుకృత
హాని రాజ్యాంతమున నరకాధిగమము.

కోరినంతనె రాజ్యాధికారమందు
నిల్పినట్టి యుదార మనీషుఁడైన
చోళ భూపాలు నెదిరింపఁ జూచుకన్న
వేఱు పిశ్వాన ఘాతుక వృత్తి లేదు.

ధరణీ పాలన మేడ ? వైష్ణవ పద ద్వంద్వార్చన మ్మేడ ? సం
గర రంగ మ్మది యేడ ? రంగపతి సంగ మ్మేడ ? రక్తాపగా
తరణ మ్మేడ ? తదీయ[45] దివ్య పద తీర్థ మ్మేడ ? సంగ్రామ భీ
కర హుంకారము లేడ ? మంత్ర యుగ శిక్షాగోపనం బేడనో ?

శౌరి పాదార్చ కార్చకుఁడ నైన
యే నెవండను ధరణి శాసించు కొఱకు ?
చోళరాజ ప్రసాదిత క్షోణి నిపుడు
వాని కర్పించి నిర్భరత్వమ్ము గందు.

ప్రాకట రాజ్య భార మొక ప్రక్కకు లాఁగఁగ, జిత్త శుద్ధికిం
బోకడ బెట్టి, భాగవత పూజ యొనర్చితి నింతదన్క నే
నీకుతలావనమ్ము నిపుడే చని చోళు పరమ్ము జేసి, ని
ర్వ్యాకుల రీతిఁ బుచ్చెదను భాగవతార్చనమందె ప్రొద్దులన్'

అనుచుఁ దలపోసి సంధి సూచనము సేయు
కేతనము జూపి చోళ నికేతనమ్ము
జేరి యంజలి గీలింపఁజేసి పల్కె
సార్వభౌమునకు విరాగి సత్తముండు.

'ఓ రాజన్య లలామ ! నీ కరుణచే నుర్వీపతిత్వంబు సే
కూరెం, దీరెను మోజు దానిపయి నాకుం గాన, నీ యీ ధరా
భార మ్మీవె గ్రహింపు మింకఁ, గృతమున్ భావింతు నేవేళ, నా
దారిన్ నేను జరింతు భాగవత సత్కైంకర్య చర్యామతిన్.

---

45. తదీయులు = భాగవతోత్తములు.

తప్పుల నేవో భాగవత దాసుఁ డొనర్చియె యుండు; వాని నీ
వెప్పుడొ యేమొగాఁ బరిగణింపఁగవేడెద సాధు శీలతన్
గప్పు మొసంగు టొక్క పని గద్దది - మామక జీవితమ్మునన్
దప్పక తీర్చికొందు వ్యవధానము మాత్రి మిడంగఁ గోరుదున్.'

అని వచియించి, హేమ మకుటాంగద ముఖ్యములైన రాజ లాం
ఛనములు వీడి, చోళుని వశ మ్మొనరించి, ప్రపన్న లక్షణ
మ్మునకు ఘటిల్ల జేసెఁ బరిపూర్ణత నంతటు రాజభృత్యు నొ
క్కని నియమించి కప్పమునకై చనెఁ జోళుఁడు రాజధానికిన్.

కార్ముక[46] కళాఢ్యుఁ డయుక - జ్యా[47] లితుఁ డయ్యు
శక్తుఁ డయ్యును - బౌరుష సహితుఁ డయ్యు
నమ్ర[48] శీలుండునై నీల నామకుండు
యుద్ధతి యడంగి సువిరక్తి నొందె నతఁడు.

రాజ్యము దెచ్చికొ మ్మని కరమ్మునఁ బెట్టిన భామినీమణుల్
పూజ్యత జూపఁబోవ రిల బూరుషులం దనుభూత రాజ్యమే
భోజ్యము గా దటం చురలుఁ బుచ్చిన నాథుని పైన భక్తి సా
మ్రాజ్యము నిల్పెఁ బ్రాజ్యముగ మానిని యుత్పలవల్లి మేల్ బళా !

కుముదవల్లి భూషణములతోఁ గొన్నాళ్ళు
నడచె వైష్ణవార్చనమ్ము, పిదప
నవియు శూన్య మయ్యె, నపుడె కప్పమునకుఁ
బట్టు పట్టె రాజభటుఁడు కడిమి.

---

46 కార్ముక = ధను ర్విద్యా కుశలుఁడు. మఱియు - శార్ఙాంశగలవాఁడు

47. జ్యా కలితుఁడు = భూమి గలవాడు. అనఁగా - రాజ్యము గలవాఁడు.
మఱియు, శార్ఙత్వేన వింటినారి గలవాఁడు.

48. వినయ స్వభావుఁడు. శార్ఙత్వేన - వంగిన స్వభావము గలవాఁడు మఱియు
ఇందు నమ్రుఁడు గనుక, ఉద్ధతి, లేక - నీలవర్ణుఁడు గనుక, ఎఱ్ఱదనము,
లేకయుండెను అని ధ్వని గలదు.

'పెక్కు దినమ్ము లయ్యె నిక్కడ నే నుండి
యింతవఱకుఁ గప్పు మీఁయ వైతి
నింకఁ దాళ ననుచు సంకెలల్ దవిలించి
నీలు నుంచెను చెరసాల యందు.

తొలుతన్ నీ కరమందుఁ బెట్టుకొని రంతుల్ నేర్పి, కాంతార జా
తుల మధ్యమ్మునఁ ద్రోసి, రాజపదంమచున్ నిల్పి, నీ పాద భ
క్తులతో సంగము గూర్చి, నేటికి నృప ద్రోహంబుఁ బైఁ బెట్టి, శృం
ఖలముల్ గూర్చిన నీ కటాక్ష మెదొ దుర్గ్రాహ్యంబు సర్వేశ్వరా !

చెఱ యనుకొంటి నిద్ది యిసిసీ ! భవదీయ కృపా కటాక్షమం
దిర మిది - యిన్ని నాళ్ళు నిను దెచ్చితినా ? హృదయ ప్రసక్తికిన్
గర మనుభూత మయ్యె నిటుఁ గర్మ ఫల మ్మిక శేష వృత్తిచే
వరలెద సర్వ శేషివి భవ న్మత మే విధమో ? శ్రియఃపతీ !

చెఱ బడినందునన్ వగపు జెందను; రాజ్యము పోయినందునన్
సరకు గొనన్; సతీ సుతుల సంగతికై తపియింప, ధాత్రిపై
వరలిన నిందకై వెరవ, భాగవతోత్తమ సంగ మాధురీ
విరహమె యాత్మ దేహముల వేల్చుచు నుండె వ్యథాగ్ని కీలలన్.'

అనుచు నిర్వేద సంతప్తుఁడై సతమ్ము
కరిగిరీశుని ప్రార్థించి కరఁగి మూఁడు
దినము లాహార పాన వర్జనము సేయ
వరదుఁ డగుపించెఁ గలలోన వనటు దీర్ప.

'రమ్ము పరకాల ! కాంచీపురమున కిపుడు
దాని కవ్వలఁ గ్రోశ మాత్రమ్మునందు
బూత వేగవతీ తీర భూమియందు
బొలుచు నొక మహా శాల్మలీ భూరుహమ్ము.

అచట నున్నట్టి వృక్షములందు నదియె
కడు విశాలమ్ము, న ద్దాని కడుగు భాగ
మం దుండు ద్రవ్విన నుపలబ్ధ మగును నీకు
విధి యొకటి ; దాన దీర్చుము నీ ఋణమ్ము.'

నత తతికిం బితామహ ధన మ్మగు హస్తి గిరీంద్రమౌళి సం
స్థిత వరదాఖ్య తేజ మటుల దెల్పి, కనుంగవతున్ మఱుంగుగాన్
గతి వరదుండె యంచుం బరకాలుఁడు మేల్కని, బంధనాలయో
ద్గతుఁ డయి రాజభృత్యులకుఁ దా నెఱిఁగించెను స్వప్న వృత్తమున్

'కంచి వరదుఁడు నాకుఁ గన్పించినాఁడు
ప్రేమతోడుత నిధినిఁ జూపించినాఁడు
రాజభృత్యులు ! నాతోడ రండు రండు
కప్ప మిచ్చెద నిం కేమి ? గైకొనుండు

అని పరకాల సూరివరుఁ డా నృప భృత్యులతోడఁ గంచికిన్
జని, వరదుండు గుర్తిడిన చాయనె వేగవతీ తటమ్మునం
దనితరసాధ్యమైన నిధి నంది, నృపాలుని కప్ప మిచ్చి, త
క్కిన ధన సంగ్రహమ్మున సుఖించెను భాగవతాతిథేయుఁడై.

వరదుఁడు నిధిఁ జూపిన యా
చరితము విని చోళరాజచంద్రుఁడు నంతః
కరణమ్మునఁ గడుఁ జింతిలి
పరకాలుని కడకు వచ్చి పచియించె నిటుల్.

'ఓ మహనీయ ! చారుచరితోజ్జ్వల ! సత్య మెఱుంగలేక, నిన్
బాములఁ బెట్టినట్టి కడుఁ బాపిని – నా యపరాధ పుంజముల్
వామ మడంగ గ్రమ్మఱ నిలాభరమున్ గ్రహియించి, వైష్ణవ
స్వాముల కర్చ సేయు, మిఁక సర్వము నీ హృదయానుసారమే.'

అని చోళుం డనుతాప తప్తుఁ డయి సంప్రార్థింపఁగా – 'రాజచం
దన! ప్రత్యర్పితమైన న్యాస భర ముత్సాహింతునే కైకొనన్?
పునరావర్తన మన్న దాని నెఱుగన్ బుణ్యంబొ పాపంబొ రం
గని యాజ్ఞా వివశుండనై చనఁగ నాకాంక్షింతు నాపోగతిన్.'

అని దృఢ నిశ్చయ మ్మడర నా పరకాలుఁడు చోళసార్వ భౌ
మునకు వచింప, నాతఁడును మోఘ గతిం జనలేక, వైష్ణవా
ర్చనమున కేత దర్థమును సద్వినియోగము జేయుఁ డంచుఁ గాం
చన మయ నిష్క సంచయ మొసంగి పురమ్మున కేఁగెఁ బ్రీతుఁడై.

వేగవతీ తటోదిత పవిత్ర ధనమ్మునఁ గొన్ని నాళ్ళు చో
ళాగమవేళ దత్త మగు నర్థముతో మఱి గొన్ని నాళ్ళనున్
భాగవతార్చనమ్ము నతి భాజనమై తనరారె, నెన్నినా
ళ్ళీ గతి? కొండలైనను దరింపవె? ఆ పరకాలు నీవికిన్.

ఇంటం గల్గిన చెంబు తప్పెలలు చెల్లించెన్, సమగ్రమ్ముగా
నింటింటన్ ఋణ భారముం బెఱిగె, నిం కేమార్గముం గానరా
దింటన్ సూర్య సుధాంశుతారకల కయ్యెన్ వాస మ ద్దానిచే
మింటిన్ బోలెను సర్వధా హరిపదామేయానుషంగమ్మునన్.

'మా నుడు లిప్పుడైన వినుమా పరకాలుఁడ! మా కృతమ్ముగా
హీనుఁడవైతి, విద్ది భరియింపగలే మిఁక వీడు మ' మ్మనన్
'గానుగ లోనిదే తమకు గంపెడు బెట్టితిఁగాని, మీకుగా
నే నొనరింప నెద్ది, తమ రేగిన నే బ్రతుకంగలాఁడనే?

ఐనన్ మీ యుదరంబు నింపుటకు నే యత్నింతునా? నా స్వరూ
పానుప్రాప్తము నాకుఁ దారకము – నా యాత్మస్థితిస్థాపనా
నూనప్రాభవ మంచు నే నెఱిగి యుద్యోగించితిన్, యుష్మ ద
ర్చా నై యత్యమునందు మీదు పద తీర్థమ్మేది జీవింతునా?

ఎప్పటి కప్పుడే వరదుఁ డెద్దియొ సూపుచునుండె దారి; మా
యప్ప వరాల కుప్ప - శరణార్థుల బంగరు తిప్ప - యాతఁడే
మప్పె భవ త్పదాభిరుచి; మానుట కెంతటివాఁడ? యంత్రముఁ
ద్రిప్పిన బండి వోలెఁ ద దధీనుఁడనై తిరుగాడుచుండెదన్.

మనలఁ బోషింపలేఁడు వీఁ డనుచు దేహ
బంధువులు వీడిపోవ రెవ్వారు నాత్మ
బంధువులు మీరు పోవుటే పాడి! మీదు
సేవనమె నమ్ము మామక జీవనమ్ము.

నిజ కుక్షింభరి భావ బద్ధు లయి పత్నీ భ్రాతృ పుత్రాదికుల్
యజమానాత్మ శరీర నాశమునకే యత్నింత్రుగా మీరలో
విజితాంతః పరిపంథు లాశ్రిత జనా విద్యామయ మ్మార్చ భే
షజమే మీ కృప యాత్మయుం దనువు తేజ మ్మందు మీ సేవచే.

అట్టి మీ పాద తీర్థము లానుచుండి
సర్వ తీర్థావగాహన సత్ఫలమ్ము
గందు నెవ్వేళ, నెట్టి విఘ్నములు సెప్ప
కిచట మీ దివ్య సాన్నిధ్య మేర్పరచుఁడు.

భాగవతాంఘ్రిరేణువులు ప్రబ్బని నా భవనమ్మునందుఁ దా
నేగును దొంటి వర్ణ, మటులే భవ దంఘ్రి పవిత్ర తీర్థమున్
ద్రాగని నా భవమ్మున[49] సదా ప్రథమాక్షర లోపమౌ, మహా
త్యాగులు మీ కృపన్ గనెద నక్షర పూర్ణ సుఖానుభోగమున్'

49. భవనమున దొంటి వర్ణ మేగిన, వన మగును.
భవమ్మున ప్రథమాక్షరలోప మయిన, వ మ్మగును.

అనుచున్ శ్రీ కలివైరి భాగవత పాదాబ్జమ్ములన్ గేశ బం
ధన శైవాలము బాహునాళములు నాస్థం జుట్టి బంధింపఁగాఁ
బ్రణిపాతార్థులు వారు నిల్చి రతనే ప్రాబోధికీ గీతికల్
నినదింపన్ రస పూర్ణమౌ సరసి శ్రేణీభూత హంసాకృతిన్

సర్వ వృత్తాంతమును యథా పూర్వముగనె
నడచిపోవుచునుండె భిన్నమ్ము లేదు
తెగడువారునుఁ గొందఱు పొగడువారు
వైరి పరకాలు నంత న య్యవసరమున.

వస్తువు లెల్ల నిండుకొనె భాగవతావళికి నా దినమ్మునన్
బస్తు ఘటిల్లు దుస్థితి యుపస్థిత మయ్యె, ననుక్షణమ్ములో
మస్తకమందునన్ మెఱసె మార్గము శ్రీ పరకాల సూరికిన్
హస్తిగిరీందుఁడే రథికుఁ డాత్మ రథమ్మున కంచు నెంచఁగన్.

సామముతోడగాని, సరస వ్యవహారముతోడగాని సు
త్రామునిఁడెయైన స్వాభిలషితమ్మును బొందఁడు గాన, నాదు బా
హామద మన్విపార్థముగ నచ్యుత భక్తి విహీన ధామముల్
నేమముతోడఁ గొల్ల గొని నే నిడుకొందుఁ బ్రపన్నకోటికిన్.

అని తలంచి :—

లెమ్మని యంతరాత్మ యదలింపగ, ధైర్యమునన్ శుభస్య శీ
ఘ్ర మ్మని, గండ కత్తెరలు, గత్తులు మున్నగు సాధనమ్ములన్
బమ్మిన వేడ్కఁ బూని, ధనవ ద్గృహ సీమలయందు రాత్రులన్
గ్రిమ్మరఁ బోయె నీలుఁ డదిగో యళినీలక చాప గుంతుఁడై..

ద్వారోపాంతములందు విస్ఫురితముల్ దర్శించి చక్రాబ్జముల్
వీరల్ భాగవత ప్రకాండు లని యా వేశ్మంబులన్ జౌర్యమున్
బ్రారంభింపక దండవ త్ప్రణతుఁడై, బద్ధాంజలిన్యాసుఁడై
దూర మ్మేగి, త దన్య గేహములపై దూఁకెన్ హనూమ త్ప్రభన్

గోడలు కన్నముల్ వొడిచి, గొళ్ళెములుం బెకలించి, తల్పులన్
బేడెము లూడఁగాఁ బెరకి, బీటలు వార్చి, గవాక్ష భాగముల్
త్రాడు దగిల్చి, మేడలకుఁ బ్రాకి, యయః పరిణద్ధ పేటికల్
వీడఁగజేసి, తా వలయు విత్తము ముచ్చిలుచుండె నిత్యమున్.

పల్లియ, లగ్రహారములు, పత్తనముల్ సరిపోక, వీరు లో
భిల్లులతోడఁ గూడి, మహిభృత్కుహరమ్ములఁ, గాననమ్ములన్
మెల్లగఁ బొంచియుండి పయనించు, ససజ్జన కోశజాతముల్
గొల్లగఁ గొట్టి, సజ్జనులకున్ నెటి నింపెను కుక్షికోశముల్.

ఆ రీతిం గలివైరి సంతత తదీయారాధన వ్యగ్రుఁడై
యారోహక్రమ మొప్ప, విఘ్న నిసర వ్యాళావళీ వక్త్రముల్
సేరం బోవక, రంగరాట్ప్రణయ నిశ్రేణీ సహాయమ్ముచే
నారూఢస్థితి నందెఁ దాఁ జరమ నిష్ఠాఖండ సౌధమ్మునన్.

కంచి వరదుఁడ తని కైంకర్య నిష్ఠకుఁ
గరము మెచ్చి, యాత్మ కరము నిచ్చి
వర మొసంగి, మంత్ర వరము బ్రసాదింప
నూహ జేసె నంత నొక్కనాఁడు.

మఱునాఁడే ద్వయమంత్ర దేశికులు జన్మంబై కటాక్షించు నా
తిరు నక్షత్రము, నాఁడు వైష్ణవులకున్ ద్విప్త్రిః ప్రవృద్ధముగా
జరుగంగావలె నర్చన మ్మని విశేష ద్రవ్య మార్జింపఁగా
బరకాలుండు జరించెఁ దస్కర కళా పారీణుఁ డుగ్రాటవుల్.

పరగున్ వేదములే ప్రపన్న జన హృద్భావాను సారంబులై
యరయ న్నే నికర నెంతవాఁడ నని శీతాంశుండు నస్తాద్రికిన్
బఱచెన్ సద్గుణపాలు నీలు నిరులన్ వర్జింపఁగారా దటుం
చురు దీప్తిన్ వెలుగొందెఁ దారకలు నా వ్యోమాగ్ర భాగమ్మునన్.

నడికి రే యయ్యో నా విపినమ్మునందు
గానరాఁ డొక్క మానవుఁ డైన గాని
యంతకంతకు నుత్కంఠ యధిక మగుచు
నుండె నా పరకాలుని గుండెలోన.

క్షణము లై పోయె బహు నిమేషముల రీతి
నిమిషములు నేగె బహు ముహూర్తముల పోల్కి
గడియలునుఁ బోయె జాములై, కడకు రాత్రి
యంత త్రుటిలోన నేగెడు నట్లు దోఁచె.

హా! యను దైవ మాయ ఇదియా? యను నా వరదుండు నా కిడం
డా? యను, వాని నమ్మితిఁగదా! యను, నన్ బరికింప నెంచినా
డా? యను, సర్వ శూన్య మిఁక హా! యను, నీ పరకాల జీవితా
ధ్యాయమునన్ సుధాక్షణము లాయనుఁబో యను, దుర్దిన మ్మనున్.

'ఏ మయిపోయె. భాగవతు లెల్లరు నా కిడు స్వస్తి వాక్చయం
బేమయిపోయె నిత్య మొనరించెడి త త్పద తీర్థ సేవనం
బేమయిపోయె, నేను భుజియించెడి వైష్ణవ శేషపున్ ఫలం
బీ మహి మ త్పురా దురిత మేదియొ యన్నిఁటి మించె నిత్తరిన్.

అనుచున్ సంసృతి ఘోర కాననమునం దల్లాడు జీవాత్మ చా
డ్పున నప్రాప్త మనోరథుం డగుచుఁ జూడ్కుల్ నింగి సారించుచున్
జెను వంతం బడి యూన మల్లడి గొనన్ వృక్షాగ్రమం దెక్కి చూ
చిన, దౌ దవ్వుల గోచరించె నొక యర్చిః పుంజ మ ప్పట్టునన్.

దీప మొక్కటియే పెక్కు దీపములకుఁ
గారణ మ్మగు రీతి నా కానవచ్చు
కాంతి పరకాల ముఖ్యుల యంతరంగ
ముల వెలిగించె నాశా ప్రమోదములను.

తొలుత నెక్కటియై వెల్గు దోఁచె నొకటి
పిదప వే ఱయ్యె శకటాది వివిధ వాహ
నములు క్రమముగ వేఱైరి నరులు నంత
గలి హరుండనె భృత్య వర్గమ్ముఁ జూచి.

'వచ్చినవారి నెల్ల నిలువంగ నిరోధ మొనర్చుఁ, డాత్మచో[50]
టచ్చరులైనవారి శకటమ్ముల కడ్డు పడుండు, చే విడం
బుచ్చిన నిట్టి మేల్ తరుణమున్ గనఁబో మిఁక జీవితమ్మునన్.
మచ్చగ నిల్చు నీ దినము మామక భాగవతార్చనార్థకున్'.

అనుచుఁ బరకాలయోగి యాత్మానుచరుల
నెచ్చరింపఁగ నాతని కెరఁగి వారు
చెట్ల మాటున డాఁగిరి - చీమ చిటుకు
మనిన విన్పించు రీతి న య్యవసరమున.

క్రమముగ నా జన సమ్మ
ర్దము చేరువ యయ్యెఁ; ముందు - దర్భాంకురముల్
సమిధలు బట్టిన యొక వృ
ద్ధ మహీసురు నిలిపి యంత తర్జించె నిటుల్.

'నిలుమయ్య బాపనయ్యా!
నిలునిలు మో యయ్య! సెపితి నీకే నయ్యా!
ఇలు వైన సొమ్ము లుంటే
ఒలి సిక్కడ బెట్టువయ్య! ఓహో ఇనవా?

50. ఆత్మచోరులు = ఆత్మయందు స్వాతంత్ర్య బుద్ధి గలవారు, అనఁగా - అప్రపన్నులు

ఇంతపోతివో సూడు ని న్నీడఁ బెట్టి
ఏమి సేత్తానొ తెల్దు నాకే బిగింపు
సెయ్యఁబోకు – మర్యాదగా సెప్పుతుండ
అడ బెట్టుము నగలు నాణ్యాలు గట్రు.'

అన విని వృద్ధ ద్విజుఁడున్
దన చెంతం గలినట్టి దర్భలు, సమిధల్
గొను మని వాని కొసంగినఁ
గినిసి చనియె నతఁడు దండుగే యిది యనుచున్.

తక్కు పరకాల కింకరు లక్కు మీఱి
వచ్చు జనులను మిగుల బీభత్సపరచి
ధన కనకముల నన్నిటి దస్కరించి
పెట్టెలం బెట్టి యుంచి రప్పట్టునందు.

పరకాలుం డపు డడ్డగించె నొక శుంభ ద్రత్న పల్యంకికా
వరమున్, దప్త హిరణ్య రుక్ప్రచురమున్ బ్రాలంబి ము క్తా తిర
స్కరిణీ సుందర ముల్ల స ద్రత్నణవ సాకారంబుఁ దుష్య ద్వధూ
వర సంస్థాన విభాకరమ్ము ఖగరా ట్పక్షద్వయీ సారమున్.

ఉన్కి[51] నా యది! పర[52] వ్యోమంబె యను రీతి
ముంగలి దండంబు నింగి సూప
దానికి వశ మౌచుఁ దనరుట న్యా వృత్తి
యనఁగ వెన్కటి దండ మణఁగియుండ

---

51. ఇందు, పల్లకీ ఓంకారముగా వర్ణింపఁబడినది. సాధారణార్థము విశదమే. ఓంకారమునందు – అకార, ఉకార, మకారము లున్నవి అకారము విష్ణు వాచకము. మకారము జీవ వాచకము. మధ్య నున్న ఉకారము – ఆత్మ పరమాత్మల సంబంధమును ఘటింపఁజేయును. పరమాత్మకు పరతంత్రుఁడై యుండుట – జీవుని స్వరూపము. ముంగలి దండము అకారము; బంగరు చక్కి ఉకారము ; వెనుక దండము మకారముగా నూహ్యములు.

52. పల్లకి పక్షమున్న వెనుక దండ మొకన్న ఎ త్తగు నాకాశము. అకార పక్షమున పరమ పదము.

నీ రెండిటికి సంధి యొసగింప నా పని
యనఁగ బంగరు చక్కి యమరియుండ
నిదియె మా పని యంచు విదిత మ్మొనర్పఁగాఁ
బురుషులు నల్వురు మోయుచుండ
శ్రుతి చతుష్టయ మ స్తకారూఢ మగుచుఁ
దొలి నకారమ్ము - మధ్యమందున నుకార,
మంతమందునను మకార మలరు ప్రణవ
మట్లు దోఁచెడి పల్లకి నతఁడు గాంచె.

ఆగుండం చొక బొబ్బ పెట్టె పరకాలార్యుండు - త ద్గర్జ, మార్
మ్రోగెన్ దిక్కుల - దింపుడం చనియె - వారున్ దింపి రా పల్లకిన్
వేగమ్మె తెర యెత్తిగించి యతఁ డువ్వీక్షూరె సౌవర్ణ భూ
షాగౌరంజిత నూత్న దంపతుల నాశల్ దీర వీక్షించుచున్.

'పాపము క్రొ త్త జంట - మధుపర్కము లేనియు వీడలేదు, నే
దో పరివ ర్తన మ్మొదవుచుండెను - వీరల జూడ, నెట్టి సం
తాపము నాదు చి త్తమున దార్కొనకుండఁ త ! వైష్ణవోత్కర
శ్రీపద సేవనమ్మున స్మరింపను వే రొక పుణ్య పాపముల్.'

అని పరకాలయోగివరు డన్కొని, పెండ్లికుమారు మేనిపైఁ
గనకమయోపవీతములుఁ గాంచనహారము, నంగుళీయముల్
ఘన కనకాది భూషణములన్ హరియించి, వడిన్ - వధూ ప్రసా
ధనముల నెల్లఁ గొల్ల గొని ధన్యుఁడ నంచుఁ దలంచె నెమ్మదిన్.

హరియించిన ద్రవ్యములన్
సరిగాఁ బెట్టెల నమర్చి, నద్ది, పరిజనుల్
హరి హరి హరి యని యెత్తఁగ
నర యంగుళ మేని లేవ దయ్యె న దేమో !

పరకాలుం డందఱకుం
గరవాలముఁ జూపి బిట్టు గర్జారవముల్
నెఱపినను బరిజనులు దమ
కరపుటములు గీలుకొల్పి కర మని రిటులన్.

'సామి యినరయ్య మా లోప మేమి లేదు
సాయసక్తులా నెత్తేము సామి మీరు
సూపితిరిగంద ఎవఁ డేమి సేసినాఁడొ ?
మాయ మర్మాలు తెలియవు మాకు పబువ !'

అన విని పరకాలుఁడు గ్రో
ధనుఁడై నలు దెసలఁ గనులు దార్కొల్పంగా
గన వచ్చిన వృద్ధ ద్విజుఁ
డనుమానాస్పదముగాఁగ ననె నీ రీతిన్.

'వృద్ధ పితామహుండ వని వెంగలినై గమనింపనైతి, దు
ర్బుద్ధిని - మంత్రవాదములఁ బుచ్చితివో ? కనికట్టు జేసితో ?
రుద్ధములయ్యెఁ బేటికలు, రొప్పుచునుండిరి భృత్యు ; వేను సం
సిద్ధుఁడ దేసికైన, విడఁజేయుము తావక మంత్ర తంత్రముల్.

పల్లు పెరకింతు మంత్రముల్ పారకుండ
నొడలు బొడిపింతు దుర్బుద్ధు లొదవకుండ'
ననెడి పరకాలు కరవాలమునకు బెదరి
వృద్ధ విప్రుఁడు వత్కె నీ రీతి నపుడు.

'బ్రతుకునకై[53] సమిత్కుశము బట్టినవాఁడను - జర్జర త్పురో
హితుఁడను - మంత్ర తంత్రముల నేమి యెఱుంగనివాఁడ, నల్లదో
యతఁ డిల మంత్రి తంత్రిముల నారియుఁ దేరినవాఁడు - లీలకై
వెత లిడువాఁడు - భోగమునఁ బెండ్లికుమారుఁడు,జూడు మాతనిన్.

సిరి[54] గలవాఁడు - వాని దరిఁ జేరిన నీ కుపకార మౌను, న
న్నరమరబెట్టబోకు, పలుకాడెడివాఁడను, పేరు శూన్య మ
బ్బురముగఁ బిట్టపై నెగిరిపోవునతం డిక జాగు సేసినన్
జరణము లాడనీయకు, మసాధ్యుఁ డతం డెటువంటివారికిన్'

అను నంత :-

కర్మల కెల్ల సాక్షి యయి క్రాలెడువాఁడు త్రియీా సముల్లస
ద్ధర్మ శరీరుఁ డుద్ధృత కృత ప్రకృత ప్రతిపత్స్యమాన దు
ష్కర్ముఁ డశేష రుక్ప్రకర కర్దమ శోషణుఁ డబ్జతోషణుం
డర్మిలిఁ దోఁచుచుండెను వియత్తల భూషణుఁ డప్పు డప్పుడే.

సమిధలు బట్టిన విప్రో
త్తము పల్కులు కలి హరుని క్రుధా జ్వలనమునన్
సమిధలు గాఁగ, నతండున్
దమిఁ బెండ్లి కుమారుఁ జేరి, దర్ప మెల్పరన్.

'మంత్రము బెట్టినాఁడ వఁట - మందసముల్ బిగియించి తంట - నీ
తంత్రము నా కడం దగదు - తాతలఁ జూచితి - పిన్న నోంచు నా
మంత్రము నా కడం గలదు - మాట లికేటికి ? ద్రవ్య పేటికల్
తంత్రుల రీతిఁ దేల్చు మని దప్పిన, నా కరవాల మిద్దిగో !

53, 54. రెండు పద్యములందును - పెండ్లి కుమారుఁడు 'పరమాత్మ' యని
గర్భితము.

పరకాలుం డటు నిప్పులం గురియుచుం బల్యాంకికాభ్యాశమం
దురు దర్పోద్ధతి నిల్వఁ, బెండ్లికొడు కోహో! యంత శూరుండవా?
ధర నచ్ఛేద్యుఁడ, నీ కృపాణమునకుం దధ్యంబ - నీ క్లేశమే
భరమౌ నా కీఁకఁ జెంత రమ్మా, సులభోపాయమ్ము నేఁ దెల్పెదన్.

పేటికలె కాదు - స్వర్గాంత వాటికలును
వాటికలె కాదు - బ్రహ్మాండ భాండములును
నేక మైనను వాని లఘూకరించు
పెద్ద మంత్రము నీకుఁ జెప్పెదను వినుము.'

అనుచు నా పెండ్లి కొమరుఁడు :-
అకలంకాదర మొప్పతిల్లఁ బరకాలార్యాగణిన్ హస్త మ
స్తక సంయోగ మొనర్చి, లాఁగుకొని, త త్కర్ణంబునం దాగమా
న్త కథాసార సమేత ముత్తమ పుమర్థ ప్రాపకం బాపద
స్తక మంత్ర మ్ముపదేశము న్నొనకె శ్రీ నారాయణాష్టాక్షరిన్.

అష్టాపదముం గోరిన
అష్టాక్షరి లబ్ధ మయ్యె నవలీల మెయిన్
ఇష్టార్థము నిండె నను
దృష్టమ్మొ యైన నా యదృష్ట మ్మెమో ?

తిరుమంత్రాక్షరమాల యెప్పుడు శ్రవోదేశమ్ము భూషించెనో
కరవాల మ్మది జారిపోయె నపుడే, కాంతార భాగమ్మునం
దరుణోషప్రభ మారినట్లు పరకాలాంత స్థితుల్ మారెఁ, గ్రో
ధ రసమ్మయ్యె నఖండ బోధ రసమై, దర్పంబు దాస్యంబునై.

తరుణుఁడు గానరాఁడు - సవిధమ్మునఁ బల్లకి లేదు - తన్వియున్
మఱుఁగు వడెం,బురోహితుఁడు మచ్చునకుం గనరాఁడు - తక్కు వా
రరిగిరి దృష్టి మార్గమున కందక యంతయు స్వప్న గాథయై
కరఁగె క్షణంబులోనఁ బరకాలుఁడు దిగ్భ్రమ జెందె నంతటన్.

దిక్కుల నన్నిటుం గలయఁ ద్రిప్పుచుఁ గన్గవ నొక్క మాఱుగా
నెక్కున వేడ్క వ్యోమ సరణిం బరికింపఁగ దర్భపాణియై
యక్కమలాసనుండు - నిటలాక్షుఁడు షణ్ముఖుఁ, డమ్మహేంద్రుడుం
దక్కు నిలింపు లెల్లరును దర్శన మిచ్చిరి మాలికాకృతిన్.

వ్యాలంబమాన నవ మణి
మాలా మధ్యేంద్ర నీల మణి ఘృణి పటలీ
లీలా మలిమ్లుచాభా
శాలిన్ వనమాలి నా వివరముం గాంచెన్.

పల్యంకీభవ దభ్రభగాధిపతిపైఁ బ్రత్యగ్ర వైవాహితా
చ్ఛీల్యాలంకరణ ప్రభావసరముల్ జెన్నారఁగా, నిందిరా
కల్యాణీమణితోడఁ గూడి, దర చక్రస్ఫూర్తి సంప్రాప్త సా
కల్యుండై భుజగేంద్రశాయి యిడె సాక్షాత్కార మా సూరికిన్.

దివ్య దర్శన మద్దాన దివ్య దృష్టి
దివ్య భావ పరంపరల్ దివ్య తేజ
మవ్యయానంద సిద్ధ రసానుభూతి
యవ్యవహితంబులై కల్గె నతని కపుడు.

అదర్శమ్మున మోముజూచుకొనినన్ట్లాయెన్, గతార్థమ్ము - ని
ర్వేదామోదము, లశ్రుధార, పుల కోద్రేకమ్ము, గాద్గద్యమున్
బ్రాదుర్భూతము లయ్యె మానసమునన్ భావ ప్రవాహంబు మ
ర్యాదాతీతముగాగ వెల్వడెను వా గ్రీత్నోపహారమ్ముగా.

పాయక[55] దుఃఖ కారణ భవమ్మునఁ దూలి కృశించినాఁడ, లేఁ
బ్రాయపుఁ గన్నెలన్ వలచి పర్వులు వెట్టితి నిన్ని నాళ్ళు, సు
శ్రీయుత సంవిదారకము జీవన దాయక మద్వితీయ నా
రాయణ దివ్య నామ మహహా ! కనుగొంటి నిఁకన్ సుఖాత్ముఁడన్.

అకటకటా ! గతించె గత మంతయుఁ జేడెల గబ్బి గుబ్బలే
సకలము నంచు నమ్మితిని - సద్గతి వాసితి - నేఁడు పక్షముల్
తక తక లార్చు యంచల కొలమ్ములు గల్గిన నీటి బుగ్గలన్
బ్రికటు మనోజ్ఞమైన నగరమ్మున నుంచుఁ దిరుక్కుడందలోన్.

ఖామల రూపమే యమృత పానముగాఁ దలపోసి, యైహిక
క్షేమము లాసజేసి, యఘ జీవితముం బచరించు శుష్క మి
థ్యామయ కాల మంతరిత మయ్యెను - భక్త మనో నిషణ్ణుఁడౌ
కాముని తండ్రి నామమునుఁ గంటి,సుఖమ్మును గొంటి మంటిహా !

విజయము నశ్వరార్థములు బిత్తరి చూపులుఁ గౌగిలింతలున్
నిజ మని కోరు చంచలుఁడ, నే నసమర్థుఁడ, నాకనమ్ము న
క్కజముగ నంటి పోత్రి యయి కాశ్యపి నెత్తిన చక్రి గారుడ
ధ్వజుని కృపా విశేషమున ధన్యుఁడ నైతిని, నామ మందితిన్.

నా కుపకర్త, నాకుఁ బిత, నా పతి, బంధువు, నాకు నాయువై
పీఁక చవిర్ప రక్కసుల పీచ మణంచిన నా ప్రభుండు స
శ్రీకుఁడు వాసమౌ సుమ పరిమళ కానన వప్ర శోభితం
బౌ కమనీయ తంజపుర మాశ్రయ మంది స్మరింతు నామమున్.

55. ఈ పద్యము మొదలుకొని, 'అల జదలంటు తోటలు' అను పద్యము వఱకు. తిరుమంగయాళ్వారుల పెరియ తిరుమొళికి అనువాదము.

ఓ జనులార ! మీ రెఱుఁగకుంటిరి గేస్తుల లక్షణంబు లే
యే జను లెట్టివారలో గ్రహింపరు పండితులైన దాతకున్
మోజులు వల్కుచుందురు వినుండు తరించుఁడు పుణ్యతీర్థ నీ
రాజితమౌ శుభ స్థలికి రం డిక రండు తిరుక్కుడందకున్

వేదను జ్ఞానమందు - నిరుపేదను శాస్త్ర విబోధమందు - శ
బ్దాది సుఖానుభోగ విషయాధ్యుఁడఁ, బాప రతుండునైన నే
నీ దినమందు నన్నిటి ద్యజింతిఁ, ద్విజసమార్గ మార్గణా
వేదన జెందితిం, గడు వివేకము గంటిని నామ సంపదన్

కులము నొసంగు - సంపదలఁ గూర్చును - దాసుల దుఃఖ సంతతుల్
తలఁగఁగఁ దోచుఁ, గేవల పద మ్మిడు, దాస్య మొసంగుఁ, దేజమున్
బలము నొసంగు నట్టి తిరునామము గంటినిఁ గన్న తల్లియున్
జలుపగలేని శ్రేయ మది చల్లఁగఁ గూర్చు నికేమి హాయిరే !

అల జద లంటు తోట లనయ మ్మళి సంకులమైన నీటి కా
ల్వలు బ్రవహించు మంగపురవాసి కలి ద్విషుఁ డాన తిచ్చు కో
మల పద గుంభిత మ్మయిన మాలిక యిద్ది, పఠించుఁ డెల్ల వే
ళల హరి భక్తులార ! సఫల మ్మగు జన్మము, నారుఁ దాపముల్.

అ విధమున :-

తారాధీశ కరాభిమృష్ట శశికాంత మ్ములు, వైకుంఠ వీ
క్షా రి ఛోళిఁ గరంగు నా కలిహు నాన్య ద్వారమం దుండి జా
ల్వారెన్ భావ పరంపరల్ ద్రవిడమాలా చిత్రి రత్నమ్ములై
శ్రీ రంగాధిపుఁ డిచ్ఛగించు విలస ద్భృంగార హారమ్ములై.

తిరు మంత్రము - ద్వయ మంత్రముఁ
జరమ శ్లోకమ్ము, ద త్ప్రచారము లవనిన్
హరి నిష్ఠ భాగవత త
త్పరతయు భూషణము లయ్యెఁ బరకాలునకున్.

హరికృప నంది యాతఁడు సహాయులతో మఱలంగ, విత్త సం
భరితములైన పేటికలు వస్త్రమునం గను పట్టు, నిందిరా
వరుని కటాక్షముం బరమ భాగవతాళి ప్రసాదమున్ హృదం
తరమున నెంచుకొం చగణితమ్ముగ నాఁ డొనరించె విందులన్.

భగవ ద్దివ్య రసానుభూతి రస లబ్ధ స్వాంతుఁడై, చిత్రబో
ధ గతిన్ బల్కిన పల్కు లెల్లఁ గవితా దర్శమ్ములై, చిత్రతా
ది గుణోపేతములై, ముముక్షువులకున్ దివ్య ప్రబంధమ్ములై
జగతిన్ వాసికి నెక్కె మిక్కుటముగా షడ్గ్రంథ రాజమ్ములై.

ఆ యాఱు ప్రబంధములున్
స్వాయ చ్ఛఠగోపమౌళి పరిదృఢ చిత్రా
మ్నాయమ్మున కాఱంగము
లాయెం బరకాల భావుకాస్యోదితముల్.

చిత్ర మాధుర్య విస్తార శీఘ్ర గతులఁ
గవిత నవలీలఁ జెప్పిన కారణమున
జగతి బరకాలునకుఁ జతుష్క విశాఖా మ
ణి, ప్రసిద్ధ బిరుదము నిర్ణీత మయ్యె.

కలలోన నలనాఁడు కన్పట్టి పెన్నిధిఁ
జూపించు వరదుని సోయగమ్ము
తిగిచి యాదర మొప్పఁ దిరుమంత్ర మిడిన యా
పెండ్లి కుమారుని విభ్రమమ్ము
దేవతావళితోడ దివినుండి ప్రత్యక్ష
మైన పరాత్పరు హరువు మురువు
భాగవతోత్తముల్ ప్రతి దిన మర్చించు
నర్చావతారుని యంద మెల్ల

హృదయ కుడ్యమ్మునందుఁ జిత్రించుకొనుచు
నాన దీరక స్వామి వేంచేసి యున్న
దివ్య దేశము లన్నియుఁ దిరుగఁ దలఁచి
బయలు దేరెను పరకాల పరమ యోగి.

అట్లు బయలుదేరి :—

కలియుగ దైవత మ్మనఁగఁ గాంచన గోపుర శృంగ సంవృతో
జ్వల విలయమ్మునం దమిత వైభవుఁడై వెలుగొందు నేడు కొం
డల దొర సేవనమ్మున జడమ్ములుగా నఖిలేంద్రియమ్ముల న్
గలి రిపు జిహ్వ మాత్ర మిటు గానము జేసె రసైక నిష్ఠమై.

'భువి[56] పయిఁ బెక్కు దేహములఁ బుట్టితిఁ గిట్టితిఁ, సొమ్మసిల్లితిన్,
జివికితి, శ్రేయ మొక్కటియుఁ జేయక యుంటి, నధర్మశీలినై
నవిసితి విప్పు దున్నత ఘనంబులు పర్వెడి వేంకటాద్రిపై
నవిరతి వెల్గు దేవ! నిను నాశ్రయ మందితి నేలుకొమ్మికన్'.

అనుచు వేంకటగిరినాథు నార్తిఁ బాడి
కంచి వరదునిఁ గాంచి కీర్తించి యొక్క
చారు వనమందుఁ బరకాల సూరి యుండ
క్షుధిత భూదేవుఁ డొక్కఁ డచ్చోటికి వచ్చి.

ఆకొంటి నంచుఁ బల్కఁగఁ
బ్రాకటముగఁ బంచ భక్ష్య పరమాన్నములన్
శ్రీ కలి వైరి యిడంగాఁ
దేఁకువ భుజియించి యతఁ డదృశ్యుం డయ్యెన్.

---

56. ఇది అనువాదము.

ఆ విప్రుని స్థానమునన్
శ్రీ విలసితుఁ డష్ట భుజ నృసింహుం డావి
ర్భావము గని పరకాలుని
చే వినుతుల నంది తృప్తిచేఁ గ్రమ్మరియెన్.

అంతఁ గలివైరి మార్గ మధ్యమున నున్న
క్షేత్రములఁ జూచి తిరువలిక్కేణి పార్థ
సారథిస్వామి దివ్య దర్శనము సేయ
భక్తి రస మిట్టు లక్షర భావ మందె.

'అల[57] వేదమ్ముల నిల్చి, త త్ఫలమునే యందించుచున్, మౌనివ
ర్యులకున్ స్వాద్య ఫలమ్మవై దురిత దూరుండైన నందుండుఁ, దా
గలభ మ్మట్టులు సాఁక, సంశిత నుతున్ కై సేయు నాద్యుండవీ
వ, లస త్పార్థ రథ ప్రచోదన కలాభ్యాసైక పారాయణా!'

పార్థసారథి నా రీతిఁ బాడి పాడి
యవశుఁడై యాలయమ్మున నాడి యాడి
తృప్తి దీరంగ నచటనే తేఁడి తేఁడి
వదలి పయనించె నెట్టులో వాడి వాడి.

వెనుకటి దివ్య దేశముల వీడితినే యను చింత యొక్కెడన్
మునుకొనుఁగాని, ముందుఁ గనఁబోయెడి మూర్తుల వైభవమ్ములన్
గనుఁగవఁ దోఁప నాతని మనమ్మునఁ బున్నమనాఁటి రేయికిన్
దినమునకైన సంధి వలెఁ దృష్టము దష్టము నయ్యె నయ్యెడన్.

రంగని కేతన మట్టు త్వ
రంగని పరకాలమౌళి రాజన్యుఁడు శ్రీ
రంగ నికాయ్యము గనె బహి
రంగ నికాయములు నంతరంగముఁ గరఁగన్.

---

57. ఇది అనువాదము.

రాజ దలిర్చ రంగ నగరమ్మును, గాంచెఁ గవేరజోదర
క్షోణి మణీ ఘృణీ పటల సుందర మందిరమున్, విభీషణ
ప్రాణ పదమ్ము, రాఘవ కరార్చిత మక్షయ పుణ్య సంచయ
ద్రోణము, భావనా విషయ దూరము, భూమి వికుంఠ ధామమున్.

అంతఁ బ్రాకార సప్తక మధిగమించి
భోగి పర్యంకమందు వైభోగ రంగ
నాథు దర్శించి, శ్రీ రఘునాథు తోడ
నైక్య భావము సేసి యిట్లనుచు బాడె.

'ఇతఁ[59] డజ్ఞుండు విహీను డీతఁ డరియం చే రీతి వైషమ్యముల్
మతి దార్కొల్పక నావికుం డగు గుహున్ మన్నించి సౌమిత్రితో
సతితో దీటుగఁ జూచినాఁడ వటుగా సౌద్గుణ్య రత్నాకరా !
శత పత్ర ప్రభ లొప్పు నీ పదములన్ సంధింతు నా శీర్షమున్'.

అనుచున్ శ్రీ కలివైరి తత్పదములం దాత్మ ద్విరేఫమ్ము స
య్యన నర్పింపఁగ, భృంగ మద్ది పునరాయాతమ్ము గా కుంటచే
దనుమాత్రమ్ము మరల్చె నెట్టులో నిజ స్థానమ్మునన్ వైష్ణవా
ర్చన కృత్యమ్ము లొనర్ప యాత్రకుఁ గృతార్థత్వమ్ము సేకూరఁగన్.

న్యాన పరులకు శ్రీ రంగ యాత్రకన్న
మిన్న లే కుంట నధిగతామేయ తుష్టి
మఱలెఁ బరకాలుఁడును దిరుక్కొరయలూరు
నకుఁ బతిజనులు బిరుదముల్ బ్రకట పరుప.

జయ జయ పరకాల ! జయ జయ సుజ్ఞాన
మయ ! చతుష్క విశిఖామణి ! జయ జయ
జయ జయ పరవాదిచయ మత్త మాతంగ
పంచాస్య ! జయ జయ పంచనామ !

---

౫౯. ఇది అనువాదము.

జయ జయ చరమ నిష్ఠా సుధా మాధురీ
సారజ్ఞ ! జయ జయ సూరివర్య !
జయ జయ కలిమలోచ్చాటన ప్రాబల్య !
జయ జయ శ్రీరంగ జయపతాక !

అనెడి జయ జయ ధ్వనులు మిన్నంటఁ బరచు
పరిజనులఁ గూడి పరకాలుఁ డరుగుచుండ
నొక్క గ్రామము నన్ గొంద ఱుద్ధతి మెయి
మార్గ మరికట్టి పల్కి రీ మాడ్కి నపుడు.

'ఎవరో ? మీరలు దెల్పుఁ డే జనపదం బెచ్చోటికిం బోదువో ?
భవ దాఖ్యాతములైన యా బిరుద సంభారంబు లెవ్వానివో ?
కవి లోకైక పురంధరుం డగుచు వెల్గన్ మా గురుం డీ చతు
ష్కవిచూడామణి యెవ్వఁ డీ యనిన యాచారంబు సాలింపుఁడీ !

ఇచట సాఁగవు మీ జయోదీరితములు
కార్తికేయాంశ సంభూతుఁ గవి వరేణ్యు
మూర్ధ నిక్షిప్త నిజ పదాంభోజు మీరు
వినరె ? సంబంధి గురుని నీ జనపదమున.

తెలిసియొ తెలియకొ మీరలు
పలికితి రీ పురమునందుఁ బర బిరుదమ్ముల్
తలవంపు గనక, కోలా
హల ముడిగి చనుఁడు ముద్రితాననులగుచున్'

అని సంబంధి కవీంద్రు ఛాత్రు లస దూహాధీనులై రోధనం
బొనరింపన్, గలివైరి మీ గురుని నే నోడింతుఁ దర్కంబునం
దనవా రిర్వురి మధ్యమం దపుడె వాగాయోధనం బయ్యె, నూ
తన హేతూక్తులె హేతువై శ్రుతు లురస్త్రాణమ్ములై దీటుగన్.

పరిష త్పండిత మండలి
పరకాలు న కిచ్చె విజయ బహుమానమ్మున్
సరసుఁడు సంబంధియు సం
బరమునఁ బరకాలు నిట్లు బ్రస్తుతి జేసెన్.

'ఏను[69] కుమారుఁడన్ గద త్వదీయ ముఖోద్గత వా క్ఛరాళికిన్
స్థానము నీకె చెల్లుఁ గవితా విభవమ్మున వా గ్బలమ్మునన్
దేనెలు నీదు కబ్బములు - దృప్తుల కేల్లను వాఁడి ముల్కులున్
దానవ వైరికిం గరము దగ్గరవాఁడవు, ప్రోడవం చనన్.

'బహుముఖ[70] మైన ప్రజ్ఞ గలవాఁడవు - స్వాదు కవిత్వ వైఖరీ
గుహుఁడవు - నామ మాత్రమునఁ గొంచెపువాఁడవు - గుజ్జు రూపమో
సహజము - నీకు వాదమునఁ జక్కగ మూఁడవ కన్ను విప్పు దీ
వహ మను నద్దియే వలవ దార్యులు మెచ్చ' రటంచుఁ బల్కుచున్.

పరకాలుఁడు సంబంధికి
గురు పద్ధతి జూపి వీడుకొల్పి, స్వదేశా
భిరతిం జనె బరిజనుల న్
బరమోత్సాహమున జయ రవమ్ములు పలుకన్.

పరకాలుం డటు గొంతఁ బుచ్చి, భగవ త్పర్యాప్తనే - దేవతాం
తర, మంత్రాంతర, సాధనాంతరములన్ వర్జించి యశ్రాంతమున్
దిరుమంత్ర ద్వయమంత్ర దీపములు హృద్దేశమ్మునన్ వెల్గఁగాఁ
బరమైకాన్త పద స్థితిం గనియె శుంభ ద్రంగ ధామమ్మునన్.

ద్రావిడామ్నాయము బాడి రంగ విభు నిద్రం బుచ్చుఁ, దోమాలియల్
సవరించున్, గృహ శోధన మ్మొనరుచున్, స్నానమ్ము లాడించు, వ
స్త్ర వితానంబులు బిండి యార్చు, నహారా త్తుల్పమ్మునం దూచుచున్
వివశాత్ముం డగు విస్మితాననుఁ డగున్, విభ్రాంతుఁడౌఁ దాంతుఁడౌ.

౬౯ - ౭౦. పద్యములలో, సంబంధి కవి - కుమారాంశము, పరకాలుని శాంర్ఙాంశమును గర్భితములు.

శ్రీరంగాలయ వైష్ణవాభ్యుదయమున్ రెట్టింపఁగాఁ జేసె, బ్రా
కారమ్ముల్ వెలయించె నూత్నములు గాఁగన్, గోపుర శ్రీ పుర
స్కారమ్ముల్ గలిగించెఁ, బుష్ప వనముల్ గారాముగాఁ బెంచెఁ, గా
వేరీ తీరమునందు నందన వనావిర్భావమో ! యం చనన్.

ఉద్వేల ప్రతిపత్తి శ్రీ కలిహుచే నుద్దీపితం బైన సం
ప ద్వైభోగము జూచి రంగ నగరిన్ భావించిరో కృమ్మడిన
'త ద్విష్ణోః పరమం పదం' అనుచు సిద్ధ వ్రాతముల్ దేవతల్
విద్వాంసుల్ సనకాది మౌని వరులున్ విద్యాధరుల్ కిన్నరుల్.

త దూ్రప మ్మగు రంగధామమునఁ గొంతం గూడి కైంకర్య సత్
క్షౌదాస్వాదన మాశ్రితాళి కిడుచున్ గావేరి తీరమ్మునన్
భద్రమ్మౌ నొక యాశ్రమాంతరమునన్ భద్రాసనాసీనుఁడై
చిదో్రచి ర్మిహిరుండు యోగ మయ శోచిష్కేశ సంవిష్టుఁడై.

హరి కర్ణాంత[61] వికృష్యమాణ గుణుఁడై యాకంపి[62] తానేక కం
ధరుఁడై, యాశుగ[63] మోచనాభిముఖుఁడై, నానా[64] సురప్రక్రియా
దరుఁడై, జ్యోతిష[65] మార్గ గామి యగుచున్ దౌవారికుల్, వైష్ణవుల్
కర మీయం బరకాలుఁ డందికొనె స్వాకారమౌ[66] శార్ఙ్గత్వమున్

---

61. పరకాలుని పక్షమున, హరి కర్ణము వఱకు ఆకర్షింపఁబడినది సద్గుణము. శార్ఙ్గ పక్షమున, వింటి నారి

62. పరకాల పక్షమున, వీరి వియోగమును సహింపలేని యాప్తుల కంఠములు కంపించినవవి. శార్ఙ్గ పక్షమున, త ద్విముక్త మయిన బాణములచేత అనేక దుష్టుల కంఠము లాకంపించినవి.

63. పరకాల పక్షమున, యోగ మార్గము ద్వారా ప్రాణ వాయువును వదలుట. శార్ఙ్గ పక్షమున బాణములు వదలుట.

64. పరకాల పక్షమున, ముక్త పురుషులు గనుక, వైకుంఠ మార్గ మధ్యమున నానా దేవతలు జూపు పూజా విధానములయం దాదరము. శార్ఙ్గ పక్షమున, నానా రాక్షస ప్రక్రియలకు భయంకరత్వము.

65. పరకాల పక్షమున, అర్చి ర్మార్గ గమనము. శార్ఙ్గ పక్షమున, ఆకాశ మందు.

66. తిరుమంగయాళ్వారులు స్వస్వరూప మందిరి' అనఁగా - శార్ఙ్గత్వ మందిరి.

*  *  *

స్వస్తి శ్రీపతయేఽథ దివ్య మహిషీ వర్గాయ సన్మంగళం
స్వస్తి శ్రీమ దనంత ముఖ్య దివిష త్సంఘాయ శశ్వ జ్జయః
శ్రీమద్భ్యః పరకాల కారితనయ శ్రీభాష్యకృద్భ్య స్సదా
కోశేభ్య శ్శుభ - మస్తు నిత్య విజయో స్త్వాచార్య సంపత్తయే.

*  *  *

స్థిర నల్లాన్ గురుచక్రవర్తి కులభూ తిర్వేంకటార్యాత్మజుం
డ, రసోదంచిత గాన - వాదన చణుండన్, గృష్ణమాచార్యుఁడన్
సరవిన్ మ త్పితృసేవనాధిగత భాషా యుగ్మ సాహిత్యుఁడన్
బరకాలో త్తమ గాథ బల్కి దురిత వ్యాపారముల్ నెట్టితిన్.



# శ్రీ రామ కృష్ణావతారములు
# ఆళ్వారుల భక్తి విశేషములు

విద్యా భూషణ - కవితా విశారద

శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు



## ఆళ్వారుల రామ భక్తి

ఆళ్వారులు విష్ణు భక్తాగ్రగణ్యులుగా - కవి శేఖరులుగా సుప్రసిద్ధులు. ఆ మహనీయులు తమ దివ్య ప్రబంధములలో - విష్ణు భగవానుని యవతారములను, వివిధ లీలలను సాంగోపాంగముగ వర్ణించుచు, బహు భంగులుగా ప్రస్తుతించి యున్నారు. భగవానుఁడు బద్ధ చేతనుల నుద్ధరించుటకు ప్రతి యుగము నందును అవతరించుచుండు నని ఆ దివ్య సూరుల భవ్య భావనము

భూ మండలమున అధర్మము వ్యాపించినపుడు, అజ్ఞానాంధకారము ధరాతలమున పరివ్యాప్త మైనపుడు, దయా సముద్రుఁ డగు భగవానుఁడు - తన దయా గుణమును ప్రకటించుటకు అవతారములను ధరించుచుండును. ఈ యంశమును నమ్మాళ్వారులు ధ్రువీకరించుచు, చేతనులు తన యంశభూతులే యయ్యును, ఆ చేతన కోటికి తన దర్శన భాగ్యమును ప్రసాదించుటకు, భగవంతుఁడు అవతారములఁ దాల్చుచుండు నని వక్కాణించిరి. కావున, విష్ణు భగవానునకును, ఆ భగవానుని యవతారములకును భేదము లే దని ఆళ్వారులు భావించినట్లే స్పష్ట మగును. కాని, రామ కృష్ణావతారములు రెండు మాత్రమే వారిని విశేషముగ ఆకర్షించినట్లు, వారి దివ్య ప్రబంధములు వేనోళ్ళ చాటుచున్నవి.

ఆళ్వారుల దివ్య ప్రబంధముః లో - కేవలము రామకృష్ణావతారములె గాక, తక్కిన యవతారములు సైతము అటు నటు వర్ణింపఁబడినవి. రామావతారము నందలి కొన్ని ముఖ్య ఘట్టములను మాత్రమే వారు తమ దివ్య ప్రబంధములలో వర్ణించిరి తమిళ వాఙ్మయ ప్రపంచమున వారిది మహా కావ్య యుగము కాదు గనుక, రామ కథను అధారముగ గైకొని, ఆళ్వారులు ఒక్క ప్రబంధము నైనను రచించి యుండలేదు వారిది కేవలము భక్తితోఁ గూడిన భావావేశము గల యుగ మగుటచే, వారు భక్తి ప్రధానము లగు మధుర గీతములను మాత్రమే రచించిరి. అట్టి గీతములనే ఆ మహా భక్తులు తనివి తీర గానము చేసి, ఆత్మానందము నందుచుండెడివారు. అయినను, భక్తి రస భరితము లగు వారి పాశురములలో - రామావతార విశేషములు సైతము వర్ణింపబడినవి.

తమిళమున కృష్ణ చరితమునకే గాక, రామ చరిత రచనకును ఆళ్వారులే అద్యులు కావున, ఆ చరిత ద్వయ నిర్మాణ విషయమున వా రొక విశిష్ట స్థానమును పొ దఁ గల్గిరి. ఆళ్వారుల కంటెను పూర్వము తమిళమున నిట్టి కావ్యములు కానరావు. ఆళ్వారుల వాఙ్మయమున రామ చరిత మంతయు అటు నటు గన్పట్టుచునే ఉన్నది. ఆళ్వారులకు పూర్వము తమిళ సాహిత్య గ్రంథములలో - రామ చరితము నందలి కొన్ని ఘట్టములు కానవచ్చినను, ఆ సాహిత్య స్రష్టలు భక్తి ప్రబోధకము లగు ఘట్టములను మాత్రము వర్ణింపరైరి. ఇందువలన, తమిళమున రామ చరితమును వర్ణించిన వారిలో - ఆళ్వారులే అద్యు లని తెలియ వచ్చును.

కంబ మహా కవి - ఆళ్వారుల దివ్య ప్రబంధములచే ప్రభావితుఁడైన కారణము వలననే, తమిళమున మొట్ట మొదట రామాయణ మహా కావ్యమును రచించి, 'కవి చక్ర వర్తి' యను బిరుదును పొందఁ

గల్గెను దివ్య ప్రబంధములలో రామ చరితమునకు సంబంధించి ఆళ్వారులు వర్ణించిన కొన్ని ఘట్టములందుఁ గల భావ పరంపరలను కంబ మహా కవి - తన రామాయణమున విశేషముగా అనుకరించెను. అదియునుఁ గాక,ఆ కంబ మహా కవి - నమ్మాళ్వారులను స్తుతించుచు - 'శఠకోపరన్దాది' యను పేర నొక స్తోత్ర గ్రంథమును రచించిన విషయము జగద్విదితము. కావున, రామాయణ కావ్య కర్త ల్లెల్లయును ఆళ్వారుల దివ్య ప్రబంధములచే ప్రభావితులైనట్లు భావింపవచ్చును.

పన్నిద్దరాళ్వారులలో - కులశేఖర, తిరుమంగై, పెరియ, కుల శేఖరాళ్వారు లను నల్వు రాళ్వారులు రామ చరితను నందలి వివిధ ఘట్టములను విశేషముగ వర్ణించిరి కాని, వీరిలో నే యొకరును రామ కథను క్రమ బద్ధముగ రచించియుండలేదు.

## కులశేఖరాళ్వారుల రామ భక్తి :-

పైఁ బేర్కొనఁబడిన నల్వు రాళ్వారులలో - కులశేఖరాళ్వారుల రామ భక్తి అపార మైనది. ఈ యంశమును బలపఱచెడు కథ లనేకములు లోకమున ప్రచలిత మగుచున్నవి. ఒకనాఁడు పౌరాణికుఁడు రాజ సౌధమున రామాయణ ప్రవచనముఁ జేయుచు, రావణాసురుఁడు సీత నపహరించిన వృత్తాంతమును వివరించి చెప్పుచుండ, కులశేఖ రాళ్వారులు విని, వెంటనే క్రోధోద్రిక్తులై, రావణ సంహారముఁ గావించి, సీతా మహా దేవినిఁ గొనితెచ్చుటకు చతురంగ బలముతో బయలుదేర నుద్యుక్తులు కాఁగా, దానిని గమనించిన పౌరాణికుఁడు - 'శ్రీరామచంద్రమూర్తి లంకలో రావణుని సంహరించి, సీతా దేవిని గైకొని వచ్చె' నని చెప్పఁగా విని, కులశేఖరాళ్వారు అప్పుడా యుద్ధ ప్రయాణ సన్నాహమును విరమించె నఁట ! ఈ రీతిగా కులశేఖ రాళ్వారులకు శ్రీరామచంద్రునియందుఁ గల ప్రగాఢము లగు భక్తి

ప్రపత్తులు వెల్లడి యగుచున్నవి. ఇట్టి ఘట్టములే అట నట మఱి కొన్ని కానవచ్చును.

కులశేఖరాళ్వారులు రచించిన 'పెరుమాళ్ తిరుమొళి' దివ్య ప్రబంధమునందుఁ గల కడపటి మూఁడు దశకములును - రామ చరిత మునకు సంబంధించినవియై యున్నవి. మొదటి దశకమున, బాలుఁ డగు రాముని ఓదార్చుటకు తల్లి యగు కౌసల్య - ఊయెలలో పరుండ బెట్టి, జోల పాట పాడి, ఆ బాలుని నిద్ర పుచ్చుచున్నట్లు వర్ణింపఁబడినది. రెండవ దశకమున, రాముని వన వాస గమన కారణముగాఁ గల్గిన దశరథుని విలాపము వర్ణింపఁబడినది. ఈ దశక ములు హృదయమును ద్రవింపఁ జేయునవిగా నుండును. ఇట్టి కరుణ రస వర్ణనము మఱెందును కానరాదు. ఇందలి దశరథ విలాప వర్ణనము అద్వితీయ మైనది. మూఁడవ దశకమున రామ కథ సంగ్ర హముగా వర్ణింపఁబడినది. కులశేఖరాళ్వారుల రామ కథా సంబంధ మగు మొదటి దశకము - 'తాలాట్టు' ప్రక్రియలో నున్నది. జోల పాడి, బాలుని నిద్ర పుచ్చుటకై, తమ భావములను వ్యక్తముఁ గావించు ఒకా నొక కావ్య నిర్మాణ ప్రక్రియ యిది. దీనిని 'తాలాట్టు' అని యందురు. ఇందు - 'తాలేలో' అను శబ్దము పాశురమున నొక సారి గాని, అనేక పర్యాయములు గాని ప్రయోగింపఁబడుచుండును. 'తాలాట్టు' అనఁగా - 'జోల పాట' యని యర్థము. శ్రుతి సుఖావహ మగు రాగముతో సమకూర్పఁబడిన యిట్టి తాలాట్టు గీతములను తల్లి శ్రావ్యముగ ఆలాపింప, ఆ యాలాపనకు తనయుఁడు తన్మయత్వము జెంది, సుఖముగా - హాయిగా నిద్రించుట పరిపాటి. ఇందువలన, బాలుఁ డగు రాముని ఉద్దేశించి, ఇట్టి 'తాలాట్టు' ప్రక్రియలో కొన్ని గీతములను కులశేఖరాళ్వారులు రచించిరి. మచ్చుకు-రెండు గీతములు:-

నీలాంబరి రాగము - త్రిపుట తాళము

"మన్ను పుగళ్ కోశలైతన్ మణి యిరువాయ్ త్తవనే
తెన్నిలజ్గై కోన్మడిగళ్ శిన్దువిత్తాయ్ శెమ్బొన్ శేర్
కన్నినన్ మామదిళ్ పుడై శూళ్ కణపురెత్తెన్ కరుమణియే
ఎన్నుడైయ విన్నముదే ఇరాగవనే తాలేలో[1]."

* * *

"కొజ్గమరికరుళలాల్ కౌశలై తన్ కుల మదలాయ్
తిజ్గై పెరుమ్ పుగళ్ చ్చనకన్ తిరుమరుగా దాశరదీ
కజ్గైయిలుమ్ తీర్తమలి కణపురెత్తెన్ కరుమణియే
ఎజ్గళ్ కుల త్తిన్నముదే ఇరాగవనే తాలేలో[2]."

తల్లి యగు కౌసల్యా గర్భమునుండి వెలువడిన రత్నామా! నా దివ్యామృతమా! రాఘవా! నిద్రించుము .... మా కులమునకు దివ్య పీయుషము వంటివాఁడా! రాఘవా! నిద్రించుము."

ఇట్టి 'తాలాట్టు' గీతములలో - రాముని స్తుతించుటతోఁ బాటు, రామ చరితమునందలి కొన్ని ఘట్టములు కూడ వర్ణింపఁబడినవి. అట్టి ఘట్టములలో - శ్రీరామ జననము, తాటక వధ, సీతా కల్యాణము, పిన తల్లి యగు కైకేయి ఆదేశానుసారము రాముఁడు అరణ్యమున కేగుట, అట్టి వన వాస సమయమున సీతా లక్ష్మణులు రాముని అనువర్తించుట, భరతునిపై రాజ్య పరిపాలన భారము నిడుట మున్నగునవియేగాక, రాముఁడు లంకలో ప్రవేశించుట, రావణ వధ మొదలగు ఘట్టములు సైతము వర్ణింపఁబడినవి. ఈ దశకమున - కులశేఖరాళ్వారులు - తమ్ముఁ, తల్లి యగు కౌసల్యగాఁ దలంచుకొని, రాముని తన

1. పెరుమాళ్ తిరుమొళి : 8 - 1
2. పెరుమాళ్ తిరుమొళి : 8 - 3

తనయునిగా నెంచుకొని, తమ వాత్సల్య భక్తిని అపారముగ ప్రవహింపఁజేసిరి

పై జెప్పఁబడిన కులశేఖరాళ్వారుల దశరథ విలాప మను దశకము - భక్తి కావ్య ప్రపంచమున అద్వితీయ మైనది. ప్రియ సుతుఁడగు రాముని వన వాసమును గుఱించి దశరథుని మనో వీథిలో చెలరేగిన వివిధ భావ తరంగములను కులశేఖరాళ్వారులు ఈ దశకమున నుపన్యాసింపఁ జేయుటే గాక, ఆ దశరథ పాత్ర చిత్రణమున సహజమగు ప్రవృత్తిని ప్రవర్తింపఁ జేసిరి ఇట్టి దానిని మనము -'నాటకీయ స్వగత భాషణ' మని నిర్వచింతుము. ఇందలి మాట లెల్లను, మన యెదుటనే ప్రత్యక్షముగ మాటాడిన ట్లుండును. కులశేఖరాళ్వారుల మృదు హృదయము రాముని వన వాస గమనమును సహింపఁజాలక దుఃఖాక్రాంత మైనట్లు, ఇందలి కొన్ని పాశురముల మూలమున వ్యక్త మగుచున్నది కరుణ రసము పరాకాష్ఠ నందుకొన్న ఇట్టి పాశురములలోని భావ పరంపరల నిట కొన్నింటిని పరిశీలింతము :-

'(రామా !) నీవు సింహాసనముపై విరాజిల్లుచుండగా - నేను ఆనందము నందుటకు బదులు, కైకేయి మాటను విని, భయంకర మైన కాననమునకు నిన్నుఁ బంపెడు మహాపాతకుఁడ నైతిని. కుమార రత్నమా ! నా యభాగ్యము నే మని చెప్పఁగలను ?' [3]

'అనుజుఁ డైన లక్ష్మణుని, సుకుమార గాత్రి యగు సీతను వెంట నిడుకొని, భయంకర మైన అరణ్యమునకు పయన మైతివి. ఇఁక నే నేమి చేయఁగలను ? .... భయంకరారణ్యమున ఆకలి బాధను,

---

3. పెరుమాళ్ తిరు మొళి : 9 - 1

భరింపరాని ఇతర బాధలను నీ వనుభవించుటకు కారణభూతుఁడ నైన నేను మహా పాతకుఁడను[4]. '

'మృదు తల్పమునందు పవళించిన నీ విపుడు, కానన తరుచ్ఛాయలలో - కరకు రాళ్ళపై పరుండ వలసి వచ్చినది అయ్యో![5]",

'నేఁడు నీవు కాననముల కేఁగవలసివచ్చినది. దుర్భర మగు అరణ్య వాసమును సైతము ప్రియముగాఁ దలచి, శత్రువుల హస్తములందుఁ గల బల్లెము వలె, వాడి యైన కరకు రాళ్ళపై, నీ మృదు పాదములు గ్రుచ్చుకొనుచున్నవి. అందుచే, పాదములనుండి రక్తము స్రవించుచున్నది. అయినను, నీవు నడచుచునే ఉన్నావు. నేను మహా పాతకుఁడను. రామా! మహా పాతకి యగు కైకేయి మాట విని, హతాశుఁడ నైన నే నెంతయో అభాగ్యుఁడను. నే నిపు డేమి చేయఁ గలను?[6] "

"నీకు పరిణయ మైన పిమ్మట - మీ దంపతుల సుఖమునుఁ జూచి సంతోషింపవలసిన నేను, భయంకరారణ్యమునకు నీవు వెడలుటకు కారణభూతుఁడ నైతిని. ఇందువలన నా హృదయము రెండు వ్రక్క లైనది[7]."

" మాతృ భావముతో నిన్ను పిలుచు భాగ్యమును కౌసల్యకు నేను కలుగఁ జేయ నైతిని. సుందర మగు నీ వదనారవిందమునుఁ జూచి, పులకింత యగు భాగ్యమును నీ తల్లి యగు కౌసల్యకు నేను

4) పెరుమాళ్ తిరు మొళి : 9 - 2
5) పెరుమాళ్ తిరు మొళి : 9 - 3
6) పెరుమాళ్ తిరు మొళి : 9 - 5
7) పెరుమాళ్ తిరు మొళి : 9 - 7

కల్గింపఁజాల నైతిని. నీవు అరణ్యవాసమునకు వెడలినను, నే నింకను జీవించి యుంటుటు - ఎంతటి లజ్జాకర మైన విషయము [8] ! "

కైకేయి చేసిన దురాలోచనను, దుశ్చర్యను తలచుకొని, దశరథుం డి ట్లనుచున్నాఁడు :-

'కైకేయీ ! నా కుమారుని అరణ్యమునకుఁ బంపి, న న్నీ రీతిగా హింసించి, నీ వేమి సుఖ మనుభవించితివి? [9] '

ఈ దశకమందలి చివరి రెండు పంక్తులును మన హృదయమును మిక్కిలి ద్రవింపఁజేయగలవు గమనింపుడు :-

"కానగమే మిగ విరుమ్బి నీ తురన్ద
వళ నగరై త్తు అన్దు నానుమ్
వానగమే మిగ విరుమ్బి పోహిగిన్డేన్
మను కులత్తార్ తఙ్గళ్ కోవే[10] ."

'(రామా ! ) సర్వ సంపదలతో తుల తూగు అయోధ్యా నగరమును వీడి నీ వెట్లు కాననమున కేఁగి నట్లే - నేనును ఈ నగరమును వీడి, పరలోకమున కేగుచున్నాను.'

ఈ దశరథ విలాపమున కులశేఖరాళ్వారులు కరుణ రసమును అపారముగ ప్రవహింపఁ జేసిరి.

'పెరుమాళ్ తిరుమొళి' దివ్య ప్రబంధము నందలి చివరి దశకమునందుఁ గల 'సంక్షిప్త రామాయణము'న - కులశేఖరాళ్వారు లటు

8) పెరుమాళ్ తిరు మొళి : 9 - 7
9) పెరుమాళ్ తిరు మొళి : 9 - 8
10) పెరుమాళ్ తిరు మొళి : 9 - 10

నటు భగవంతుని స్తుతించుచు, తన పాపములను కృపతో పరిహరించి, భగవద్భక్తుల పంక్తిలో తమను చేర్చుకొనవలసిన దని, దయా సముద్రుఁడగు ఆ భగవంతుని సవినయముగా ప్రార్థించిరి. ఇందు వలన, కులశేఖరాళ్వారుల దాస్య భక్తి - పరాకాష్ఠ నందుకొన్నట్లు స్పష్ట మగును.

## తిరుమంగై యాళ్వారుల రామ భక్తి :-

తిరుమంగై యాళ్వారుల రచనలలో - దాదాపు రెండు వందల పాశురములు రామ చరితమునకు సంబంధించినవి కానవచ్చును కాని, అవి రామ చరితమును క్రమ బద్ధముగ వర్ణించునవి మాత్రము కావు. రామాయణము నందలి కొన్ని ఘట్టములు మాత్రమే అటు నటు వర్ణింపఁ బడినవి వీరి రచనలలో నొకటి యగు 'పెరియ తిరుమొళి' దివ్య ప్రబంధము నందలి ఒక దశకమున,[11] రామ రావణ యుద్ధములో పరాజితు లగు రాక్షసులు రాముని స్తుతించినట్లు వర్ణింపఁబడినది. తమిళ కావ్య ప్రక్రియలో - పరాజితు లగు వారి వాక్కునుండి, విజేతల పరాక్రమమును ప్రశంసా పూర్వకముగ విన్పించుట పరిపాటిగా నున్నది. పరాజితునిచే విజయుని విశిష్టతను వర్ణింపఁ జేయుటవలననే విజయుని పరాక్రమము విశేషముగ ప్రస్ఫుటము కాఁగల దని దీని తాత్పర్యము. తిరుమంగై యాళ్వారులు రాముని కల్యాణ గుణములను ప్రస్తుతించుటకు ఇట్టి ప్రక్రియనే అనుసరించిరి పైఁ జెప్పఁబడిన దశకమున, పరాజితు లగు రాక్షసులు - రాముని కల్యాణ గుణములను ప్రస్తుతించుచు, తమ్ము రక్షింపవలసిన దని రాముని ప్రార్థించిరి. వారి మాటలలో - నడుమ, రామ చరితమునకు సంబంధించిన కొన్ని ఘట్టములు సైతము వర్ణింపఁబడినవి.

---

11) పెరియ తిరు మొళి 10 - 2

పెరియాళ్వారుల రామ భక్తి :-

లీలా మానుష విగ్రహుఁ డగు కృష్ణుని వివిధ బాల లీలలలో పెరియాళ్వారులు తమ మనస్సును లగ్నము గావించినను, రామావతారముపై ఉపేక్ష చూపలేదు. వీరి రచన యగు పెరియాళ్వార్ తిరుమొళిలో - రెండు దశకములలో - రామ చరితము నందలి ఘట్టములు కొన్ని వర్ణింపఁబడినవి. ఒక దశకమున,[12] ఇరువురు సఖియల సంభాషణ రూపమున, రామావతార - కృష్ణావతార విశేషములను వివరించి చెప్పెదు సఖియ - పరశురామ గర్వ భంగము, తాటక వధ, రాముని వన వాస గమన వృత్తాంతము, శూర్పణఖ వధ, సేతు నిర్మాణము, లంకా ప్రవేశము మున్నగు ఘట్టములు వర్ణించి చెప్పినట్లు ఆంజనేయుఁడు చేసిన ప్రసంగ మభివర్ణింపఁబడినది [13] సీతాదేవిని వెదకుటకు వెడలిన హనుమంతుఁడు - లంకలోఁ గల అశోక వనమున వ్యథతో కుంగి కృశించుచున్న సీతను దర్శించినంతనే, ఆయనకు ఒక వంక భరింపరాని దుఃఖోద్వేగము, మఱి యొక వంక - తన ప్రయత్నము సఫల మైనందుకు సంతోషము ఏక కాలమునఁ గల్గె నఁట ! హనుమంతుఁడు తనను గురించి పరిచయము చేసికొనుట కుద్యుక్తుఁ డగుచు- తాను రాముని బంటు నని నిరూపించుటకు అనవాలుగా, రామునిచే నొసంగఁబడిన అంగుళీయమును సీతాదేవి కొసంగు ఘట్టము పై దశకమునందే వర్ణింపఁబడినది అదియునుఁ గాక, సీతా రాముల కల్యాణ గుణములు హనుమంతునిచే ప్రస్తుతింపఁబడినవి. పెరియాళ్వారుల పాశురములలో అనేకములు వాత్సల్య రస ప్లావితములుగా నున్నవి. ఆత్మ సమర్పణ భావ పూరితము లగు కొన్ని పాశురములందు పెరియాళ్వారుల దాస్య భక్తి విశేషముగఁ గానవచ్చును.

---

12. పెరియాళ్వార్ తిరు మొళి : 3-9-1 నుండి 10 వరకు

13. „ 3-10-1 నుండి 10 వరకు

రామాయణ కావ్య నిర్మాణము :-

పైఁ బేర్కొనఁబడిన యంశములనుఁ బట్టి, ఆళ్వారులలో కొందఱు రాముని యందు భక్తి భావముఁ గలవారునుఁ గల రని స్పష్ట మగుచున్నది గదా! ఆళ్వారులు తమ యుగమునఁ గల స్థితి గతుల ననుసరించి, కృష్ణుని భువన సుందరమూర్తిగా వర్ణించుచు, మధుర గీతము లనేకములు రచించిరి వారిది భక్తి ప్రచారోద్యమ యుగమై యుండుటయే ఇందులకు కారణము కావున, ఆ యుగమున రామాయణ కావ్య రచనకుఁ దగినఁ యవకాశము వారికి కలుగ లేదు. అయినను, వారు - రామ కథా సంబంధము లగు కొన్ని ఘట్టములను తమ ప్రబంధము లందు వర్ణించియే యున్నారు. అట్టి వర్ణనల వలన, అనంతర కాలీనులగు రామ భక్తులు మిక్కిలి ప్రభావితులైన కారణముచే, వారు మహా కావ్యములను రచింపఁగల్గిరి. అయినను, నాలాయిర దివ్య ప్రబంధమున అటు నటు వర్ణింపఁబడిన రామ కథా ఘట్టములను ఒక్కచో క్రమ బద్ధముగ వీర్చి కూర్చిన యెడల, రామ చరిత మంతయు మనకు లభింపఁగలదు. ఆ రామాయణ స్వరూప మిది :-

## ఆళ్వారుల రామాయణము

### బాల కాండ

| ఆళ్వారుల పేరు | రచన పేరు | పాశుర సంఖ్య |
|---|---|---|
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 3-10-1 |
| నమ్మాళ్వారులు | తిరు వాయిమొళి | 2-8-4 |
| ,, | ,, | 10-9-11 |
| ,, | ,, | 4-5-1 |
| ,, | ,, | 1-1-1 |

| | | |
|---|---|---|
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరుమొళి | 11-3-3 |
| నమ్మాళ్వారులు | తిరువాయి మొళి | 5-1-9 |
| ,, | ,, | 10-7-5 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 7-8-6 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 10-1-8 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 5-7-7 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 1-10 |
| ,, | ,, | 10-1 |
| ,, | ,, | 9-3 |
| ,, | ,, | 10-11 |
| ,, | ,, | 10-2 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 3-10-1 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-2 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 4-1-8 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 6-2-10 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-3 |
| ,, | ,, | 9-9 |
| ,, | ,, | 10-8 |
| ,, | ,, | 9-1 |

## అయోధ్యా కాండ

| | | |
|---|---|---|
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 2-1-8 |
| ,, | ,, | 3-10-3 |
| ,, | ,, | 3-9-4 |
| ,, | ,, | 4-8-4 |
| ,, | ,, | 3-10-3 |

| | | |
|---|---|---|
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-2 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 4-8-4 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-2 |
| ,, | ,, | 9-7 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 11-8-1 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-2 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 8-3-3 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 1-5-1 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-4 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 3-2-2 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-6 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-6 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-11 |
| ,, | ,, | 9-10 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 10-6-3 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-5 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 3-5-3 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 9-7 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-5 |
| ,, | ,, | 4-9-1 |
| ,, | ,, | 2-1-8 |
| ,, | ,, | 4-9-1 |

## అరణ్య కాండ

| | | |
|---|---|---|
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 10-2-3 |
| ,, | ,, | 8-5-4 |

| | | |
|---|---|---|
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-2 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-3 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరుమొళి | 3-4-6 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-5 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మడల్ | 145 |
| ,, | శిరియ తిరు మడల్ | 39 |
| ,, | ,, | 40 |
| తిరుమళిశై యాల్వారులు | తిరు చ్ఛన్ద విరుత్తమ్ | 53 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మడల్ | 112 |
| ,, | ,, | 13 |
| ,, | పెరియ తిరు మొళి | 5-7-7 |
| ,, | ,, | 6-3-5 |
| ,, | ,, | 10-2-4 |
| ,, | ,, | 10-2-3 |
| ,, | ,, | 10-2-5 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-4 |
| నమ్మాళ్వారులు | తిరు క్కురు న్దాణ్డకమ్ | 19 |
| తిరుమంగై యాళ్వారులు | పెరుమాళ్ మొళి | 11-4-7 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-6 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 7-2-1 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-6-4 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 2-10-5 |

కిష్కింధా కాండ

| | | |
|---|---|---|
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరుమొళి | 10-6 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 1-5-6 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 4-6-3 |

| | | |
|---|---|---|
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-8 |
| ,, | తిరు ప్పల్లాండు | 9 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-11 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 1-5-8 |
| ,, | ,, | 9-7-6 |

## సుందర కాండ

| | | |
|---|---|---|
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-11 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 10-2-6 |
| ,, | ,, | 10-2-5 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-10 |
| ,, | ,, | 3-10-1 |
| ,, | ,, | 3-10-2 |
| ,, | ,, | 3-10-3 |
| ,, | ,, | 3-10-4 |
| ,, | ,, | 3-10-5 |
| ,, | ,, | 3-10-6 |
| ,, | ,, | 3-10-7 |
| ,, | ,, | 3-10-8 |
| ,, | ,, | 3-10-9 |
| ,, | ,, | 3-10-10 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-11 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 8-5-7 |
| ,, | ,, | 10-2-6 |
| ,, | తిరు నెడు న్దాణ్డకమ్ | 29 |
| ,, | తిరు క్కుఱు న్దాణ్డకమ్ | 15 |

## యుద్ధ కాండ

| | | |
|---|---|---|
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 6-10-6 |
| ,, | ,, | 8-6-4 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 4-1-3 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 6-8-5 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 7-6-9 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | 10-7 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 8-6-4 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరు మొళి | -88 |
| తిరుమంగై యాళ్వారులు | శిరియ తిరు మడల్ | |
| ,, | పెరియ తిరు మడల్ | 11-4-7 |
| ,, | ,, | 10-2-5 |
| ,, | ,, | 10-3-2 |
| ,, | ,, | 4-8-5 |
| ,, | ,, | 10-3-1 |
| ,, | ,, | 3-9-5 |
| ఆండాళ్ | తిరుప్పావై | 4 |
| తిరుమళిశై యాళ్వారులు | తిరు చ్చన్ద విరుత్తమ్ | 56 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 2-10-8 |
| తిరుమళిశై యాళ్వారులు | నాన్ముగన్ తిరు వన్దాది | 42 |
| పొయిగై యాళ్వారులు | ముదల్ తిరు వన్దాది | 52 |
| తిరుమళిశై యాళ్వారులు | తిరు చ్చన్ద విరుత్తమ్ | 87 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 10-9-3 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 1-4-7 |

| | | |
|---|---|---|
| ,, | ,, | 1-2-4 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 6-9-3 |
| తిరుమంగై యాళ్వారులు | పెరియ తిరు మొళి | 6- -5 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-8 |
| ,, | ,, | ?-10-4 |
| కులశేఖరాళ్వారులు | పెరుమాళ్ తిరుమొళి | 10-1 |
| ,, | ,, | 6-9 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 8-4-7 |
| ,, | తిరు వాశిరియమ్ | 1 |
| ,, | తిరు విరుత్తమ్ | 21 |
| తిరుమంగై యాళ్వారులు | తిరు చ్చన్ద విరుత్తము | 57 |
| పెరియాళ్వారులు | పెరియాళ్వార్ తిరు మొళి | 3-10-9 |
| ఆండాళ్ | తిరుప్పావై | 23 |
| నమ్మాళ్వారులు | తిరు వాయి మొళి | 4-5-1 |

ఈ విధముగా ఆళ్వారులు - రామ కథా సుధా మాధుర్యమును మనకు చవిఁ జూపి యున్నారు. వారి యనంతరము, దివ్య ప్రబంధ వ్యాఖ్యాతృ చక్రవర్తిగా పేరు గాంచిన 'పెరియ వాచ్చాన్ పిళ్ళై' అను మహనీయులచే సంకలిత మగు ఈ రామాయణము - పాశుర ప్పడి రామాయణ' మను పేర విఖ్యాతిఁ గాంచి యున్నది.

## ఆళ్వారుల కృష్ణ భక్తి

కృష్ణుని వివిధ లీలలను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో సహజ సుందరముగా వర్ణించి యున్నారు. అట్టి వర్ణనలను పరిశీలించి

నచో - వారి మన స్సంతయు కృష్ణ లీలల యందే నిమగ్న మైనట్లు తెలియఁగలదు. అందువలననే వారు - లీలా మానుష విగ్రహుఁ డైన కృష్ణుని వివిధ లీలలను కన్నులకుఁ గట్టినట్లు వర్ణింపఁ గల్గిరి వారి భావ విహంగము కృష్ణ లీలా తరంగములలో విహరించుటవలననే వారు కృష్ణ చరితమును నవ రస భరితముగా రచింపఁ గల్గిరి.

ఆళ్వారుల దివ్య ప్రబంధములలో కృష లీలలు క్రమ బద్ధముగ కానరావు. కాని, ఆ దివ్య ప్రబంధములలో వర్ణింపబడిన కృష్ణ లీలలను ఒకచోఁ జేర్చి క్రమ బద్ధముగ కూర్పు గావించిన యెడల, ఆ లీల లన్నియు మనకు స్పష్టముగాఁ గన్పట్టు గలవు. కనుక, త దను సారముగ ఆ దివ్య ప్రబంధము లందలి కృష్ణ లీలలను తిలకించి, ఆత్మా నందము నందుదుము గావుత !

కృష్ణ లీలల సూత్ర పాతము - అవతార రహస్యము

విష్ణువు ఆది శేషునిపై పవళించి యున్నాఁడు.[14] ఆ భగవా నుని పాణి పల్లవములలో శంఖ చక్రములు శోభిల్లుచున్నవి [15] శ్రీ దేవియు, భూ దేవియు ఆ స్వామి సన్నిధిలో విరాజిల్లుచున్నారు [16] విషువు యోగ నిద్రలో నున్నాఁడు.[17] తుంబుర నారదాదులు వాద్య ములు వాయించుచున్నారు.[18] ఆ స్వామికి దేవతలు తులసి మాలలు సమర్పించి, ఆ దేవ దేవుని స్తుతించుచున్నారు [19] భక్తులు, మహాజ్ఞానులు,

---

14. 'మణ్ణియ నాక త్తణై మేలోర్ మామలై పోల్' - పెరియ తిరు మడల్ 2

15. 'ఉడరాళి శఙ్గిరుపాల పొలిన్దు తోన్ఱ' - పెరియ తిరు మొళి : 2-10-8

1. 'తిరు మడన్దై మణ్ మడన్దై యిరుపాలుమ్ తిగళ' - „ 8-10-1 8

17. ఉన్నియ యోకత్తుఅక్కమ్ తలై కొణ్డ' - పెరియ తిరు మడల్ .

18. 'తుమ్బురువుం నారదనుం ఇత్తైఞ్జయే త్త' - పెరుమాళ్ తిరు మొళి : 1-6

19. 'కొన్దలర్న్ద నఱున్దుళాయ్ శాన్దమ్ తూపమ్' - పెరియ తిరు మొళి : 2-10-2

యతులు, వేదాధ్యయన తత్పరు లగు మహర్షులు, సిద్ధులు మున్నగు వారు - ఆ జగన్నాథునకు సాంజలి బంధముగ నమస్కరించు చున్నారు[20] దేవత లపుడు శ్రీ మహా విష్ణువును ప్రార్థింప, ఆ దేవాది దేవుఁడు భూ మండలమున కృష్ణుఁడుగా నవతరించెను. ఇట్లవత, రించుటకు అనేక కారణములను తమ దివ్య ప్రబంధములలో ఆళ్వా రులు పేర్కొనియున్నారు.

కృష్ణ జననము :-

దేవతల మనో వేదనను తొలగించుటకును,[21] భూ మండల మును - ఆ భూ మండలము నందలి మానవులను ఉద్ధరించుటకు,[22] భూ భారము తగ్గించుటకు,[23] భూదేవి యొక్క మనోవ్యథను నివా రించుటకు,[24] బ్రహ్మాది దేవతల ప్రార్థనము మన్నించుటకు,[25] బంధు వులను బాధించు కంసుని వధించుటకు,[26] దేవకీదేవి గావించిన వ్రతమునకు తగిన ఫలితము నొసంగుటకు,[27] వసుదేవుని కాలి సంకె లలను వదలించుటకు,[28] పూర్వము గల్గిన పుత్రుల నార్వురును బంద

---

20. 'వత్త రుగళుమ్ పగవర్ గళుమ్ - పెరియాళ్వార్ తిరు మొళి : 4-9-6
21. 'విణ్ణో ళమరర్ కళ్ వేదనై తీర' ,, 1.2-16
22. 'మణ్ణుయ్య మణ్ణులగిల్ మనిశరుయ్య' - పెరుమాళ్ తిరుమొళి : 1-16
23. 'మాతేలు పెరుమ్ బారమ్ తీర' - పెరియ తిరుమొళి : 2-10-9
24. 'తువరిక్క విడాయ్ విల మజ్గై తుయర్ తీర్న్దుయ్య' ,, : 8-8-6
25. 'వేణ్డిత్తే వరిరిక్కవన్దు పిఱన్దతుమ్' - తిరు వాయి మొళి : 6-4-6
26. 'శాదు శనత్తై నవియుమ్ కఞ్జనై చ్చాదిప్పతఱ్కు' ,, : 3-5-1
27. 'ఎన్ననోమ్బు నోత్తాళ్ కొలో - పెరియాళ్వార్ తిరుమొళి : 7-5-0
28. 'తన్దై కాలిల్ పెరువిలఙ్గు తాళ విళ' - పెరియ తిరు మొళి : 7-5-1

రాళ్ళపైఁ గొట్టి కంసుఁడు చంపఁగా - ఆ పుత్రులనుఁగూర్చి దుఃఖించు దేవకీదేవి గర్భమును సఫలము గావించుటకును[29]

"ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవ నికేతనః
నాగ పర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురా పురీమ్."

అనునట్లు, క్షీర సాగర శయనుఁ డగు ఆ మహా విష్ణువు - శేష పర్యంకమును వీడి, పురాతన మగు ఉత్తర మధురలో[30] - వసుదేవుని సహధర్మచారిణి యగు దేవకీదేవి యొక్క పవిత్ర గర్భమునుండి,[31] హస్తా నక్షత్రమునకు పదియవ నక్షత్రమున, కృష్ణుఁడుగా అవతరించెను.[32]

(ఇచట మన కొక ధర్మ సందేహము కలుగవచ్చును. ఏ మన 'హస్తా నక్షత్రమునకు పదియవ నక్షత్రము శ్రవణము గదా! రోహిణీ నక్షత్రమం దవతరించిన కృష్ణుని, శ్రవణా నక్షత్రమున నవతరించె నని చెప్ప నగునా ?' యని . ఈ సంశయమునకు సమాధాన మిది :- 'శ్రోణా నక్షత్రం విష్ణు ర్దేవతా' అను ప్రమాణానుసారము - శ్రవణా నక్షత్రమునకు విష్ణు అధిదేవత కనుక, అట్టి 'విష్ణువే' కృష్ణుఁడుగా నవతరించె ననియు, నక్షత్రము లన్నియు విష్ణు

---

29 'మక్కళ్ అఱువరై క్కల్లిడై మోతవిట్టవన్ తన్' - పెరియాళ్వార్ తిరు మొళి : 5-?-1

30 'మల్లై మూతూర్ వడ మదురై ప్పిఱన్దవన్' - తిరు వాయి మొళి : 9-1-6

31 'తాయై క్కుడల్ విళక్కమ్ శెయిద' - తిరుప్పావై : 5

32 'వసుదేవర్ తమ్మురై శిత్తమ్ పిరియాద' 'దేవకి తన్ వయిత్తిల్' } - పెరియాళ్వార్ తిరు మొళి : 1-?

యొక్క అంశలే గావున, నక్షత్రము లన్నియు శ్రవణా నక్షత్రాంశలే యనియు ఆళ్వారుల యభిప్రాయ మైనట్లును హస్తా నక్షత్రము వెనుక పదియవ నక్షత్రము రోహిణి యని సమన్వయింపవచ్చు ననియు దివ్య ప్రబంధ వ్యాఖ్యాన కారులు తెలిపి యున్నారు )

కృష్ణుఁ డవతరించినపుడు, తీవ్ర మైన కిరణ కాంతులు గల సూర్యు లనేకులు ఏకమై ప్రకాశించిన ట్లుండెను.[33] తమ తనయుని వధించుటకు పన్నిన కంసుని మాయోపాయములనుండి వసుదేవుఁడు రక్షించి, అంధకారము దట్టముగా వ్యాపించి యున్న అర్ధ రాత్రము నందు నంద గోపుని మందిరమునకు కృష్ణుని తీసికొని వచ్చెను.[34] అపుడా కృష్ణుఁడు యశోదా తనయుఁడుగా[35] - బలరామానుజుఁడుగా-[36] వల్లవ నాయక మణిగా[37] గోపకుల దీపకుఁడు విలసిల్లెను.[38]

కృష్ణ జన్మోత్సవము :-

కృష్ణుఁడు జన్మించుటచే, గోకులమున హర్షోల్లాసములు చెలరేగెను' గోప బంధువులు శిశువునుఁజూచుటకు పరుగిడుచున్నారు. తత్తరపాటు వలన బురదలో కాళ్ళు తడబడుచు కొందఱు పడిపోవుచున్నారు.

---

33. 'కతిరాయిర మిరవి కుల న్దెఴుత్తాలొత్త వీఱ్ ముడియన్' - పెరియాళ్వార్ తిరుమొఴి 4-1-1

34. 'కఞ్జన్ వలై వైత్త వన్దు కా రిరుళ్ ఎల్లిల్ పిఴైత్తు' - నాచ్చియార్ తిరుమొఴి : 3-9

35. 'అశోదై తుక్క పోత్తన్ద పేదై కుక్కవి' - పెరియాళ్వార్ తిరు మొఴి: 1-2-1

36. 'పల దేవఱ్కోర్ కీఴ్ క్కన్ఱాయ్' - నాచ్చియార్ తిరుమొఴి : 3-9

37. 'ఆయర్కళ్ నాయకనే' - పెరియాళ్వార్ తిరుమొఴి : 1-5-11

38. 'ఆయర్ పాడి క్కణి విళక్కే' ,, 2-2-6

ప్రేమాతిశయముచే కొందఱు కలకలము చేయుచున్నారు. పుట్టిన బిడ్డ ఎట్లుండె నని ఒకరి నొకరు ప్రశ్నించుకొనుచున్నారు. 'త మద్భుతం బాలక మంబుజేక్షణమ్' అనునట్లు, మహోత్సాహముతో - ఏదియో యొక యద్భుతమును చూచుటకో యన, నందగోపుని గృహమునకు ప్రజలు తండోపతండములుగా వచ్చుచున్నారు. మఱికొందఱు-తమ ఆనందమును మాటలతోఁ గాక, ఉచ్చైస్స్వరముతో పాటలఁ బాడుచు, చాటుచున్నారు. మఱి కొందఱు నృత్యముఁ చేయుచు, తమ సంతోషమును వెల్లడించుచున్నారు.[39] కృష్ణుఁ డవతరించుట వలన గల్గిన సంతోషాతిరేకముచే గోపిక లనేకులు - పాలు, పెరుగు, నేయి అంతయుఁ దీసికొని వచ్చి, సాటి వారలకు పంచి యిచ్చుటే గాక, 'ఖాళీ' అయిన కుండలపై నృత్యముఁ గావించుచు ఎగురు చున్నారు. గోకుల మందుఁ గల గోపకు లెల్లఱును ఆనందాబ్ధిలో మునిఁగి తేలుచు, తమను తాము మరచియున్నారు.[40] జాతికిఁ దగినట్లు, కావడి యుట్టిని చేతఁ బట్టుకొని, కొడవలి మున్నగు ఆయుధములనుఁ దీసికొని, కట్టలతో - తాటి యాకు చాపలతో కొందఱు గోపకులు బయలుదేరి, గుంపులు గుంపులుగా గుమి గూడి, పక పక నవ్వుచు, ఘృత నృత్యము చేయు

---

39 'ఓడువార్ విడువార్ ఉళేన్దలిప్పార్
నాడువార్ నమ్బిరాన్ ఎఙ్గుత్తానెన్బార్
పాడువార్ కళమ్ పల్ పఱై కొట్టనిన్ఱు
ఆడువార్ కళమ్ ఆయిప్పాడియే"
- పెరియాళ్వార్ తిరుమొళి : 1.1.2

40 "ఉఱియై ముత్తత్తు ఉరుట్టి నిన్ఱాడువార్
నఱు నెయ్ పాల్ తయిర్ నన్ఱాక తూవువార్
శెఱిమెన్ కూన్దల్ అవిత్తు ఎత్తి ఎఙ్గుమ్
అఱివళిన్దనర్ ఆయ్ప్పాడి యాయరే"
- పెరియాళ్వార్ తిరు మొళి : 1.1.4

చున్నారు.[41] (ఘృత నృత్య మనఁగా - శరీర మంతయు నేయి పులుము కొని, ఒకరి నొకరు ఆలింగనము గావించుకొని, ఆనందముతో నాడు తాండవము.) అవతరించిన వెంటనే తలి దండ్రుల కోరికను సఫలము గావించినందున, కృష్ణుఁడు సద్గుణ సంపన్నుఁ డని కొనియాడఁబడెను. విష్ణువు తన వైభవమును మఱుగు పఱచుకొని, గోకులమున కృష్ణుఁ డుగా నవతరింప, ఆ కృష్ణునిఁ జూచుట కుత్సాహముతో లోపల కనేకు లేగుచున్నారు.

ఇతఁడు సాటి లేని మేటి పురుషుఁ డగుటచే, సర్వ ప్రపంచ మును పరిపాలింప సమర్థుఁడు కాఁగలఁ డని సాముద్రిక శాస్త్ర వేత్త లనుకొనుచున్నారు.[42] కృష్ణునకు స్నానముఁ చేయించు తల్లి యగు యశోద - శిశువు హస్తములను, పాదములను భాండములో నుండు నీటిచే శుభ్ర పఱచి, పసుపు పొడిచే శిశువు నాలుకను శుద్ధి గావించుట కుద్యుక్తురా లయినపుడు-శిశువు నోటి యందు సప్త సముద్రములను

---

41 "కొణ్డతాళతి కొలక్కొ-డుమళు
తణ్డినర్ పఱియోలైచ్చయనత్తర్
విణ్ణముల్లై యరుమ్బన్న పల్లినర్
అణ్ణార్ మిణ్డిప్పుకున్దు నెయ్యాడినాల్."

- పెరియాళ్వార్ తిరు మొళి ; 1-1-5

42 "వేణిచ్చిరుడై ప్పాళ్ళై పిఱన్దినిల్
కాణత్తామ్ పుకువార్ పుక్కు-వోదువార్
అణిప్పార్ ఇవన్ నేరిల్లై కాణ్ తిరు
వోణత్తాన్ ఉలకాళు మెన్బార్కళే".

- పెరియాళ్వార్ తిరు మొళి ; 1-1-3

యశోద సమాలోకించెను.[43]

నామ కరణము :-

అనంతరము పది దినములకు నామ సంస్కార సమయము రాఁగా, గోకుల వాసు లెల్లరును తమ తమ గృహములను తోరణములతో నలంకరించిరి [44] కృష్ణుఁ డవతరించిన పండ్రెడవ దినమున,[45] వేద పండితులు -[46] 'మధుర మగు అమృతము వలె భోగ్యమైనవాఁడా ! మేఘశ్యామా ![47] కృష్ణా !' మొదలగు నామములతోఁ బిలుచుచు, శిశువునకు నామ కరణ సంస్కారముఁ గావించిరి.

కృష్ణ లీలలు :-

౧. పూతనాసుర సంహారము[48]

---

43 "కైయుమ్ కాలుమ్ నిమిర్ త్తక్కడారనీర్
పెయ్యువాట్టి పశుమ్ శీఱమఞ్జళాల్
ఐయనావశిత్తా ళుక్కు అఙ్గానిద
వైయమేళుమ్ కణ్డాళ్ పిళ్ళై వాయుళే."
- పెరియాళ్వార్ తిరు మొళి : 1_1_6

44 తిరునెడు న్దాణ్డకమ్ : 8

45 "కిడక్కిల్ తొట్టిల్ కిళియవుదైత్తిడుమ్
ఎడుత్తుకొళ్ళిల్ మరుఙ్గై యిరుత్తిడుమ్."
- పెరియాళ్వార్ తిరు మొ : 1_1_9

46 'వేదమ్ వల్లార్ కళైక్కొణ్డు విణ్ణోర్' - తిరు వాయి మొళి : 4_6_8

47 'కన్నలేయముదే కార్ముకిలే యెన్ కణ్ణా !' ,, 2_:_7

48 పెరియ తిరు మొళి : 3_10_7, 3_9_7, 10_4_7, ఇరణ్డామ్ తిరువన్దాది : 8

౨. శకటాసుర వధ[49]

౩. మోకాళ్ళ బలముతో - చేతుల బలముతో దోగాడుట [50]

౪. కాలి వ్రేళ్ళను నోటిలోనికిఁ జొన్పికొని, ముద్దిడుకొనుట [51]

౫. బంగరు గజ్జెలు ఘల్లు ఘల్లు మని ధ్వనించునట్లు మట్టిలో దోగాడుట.[52]

౬. ఎఱ్ఱని కాంతితోఁ గూడిన ఆకసమునందు బాలచంద్రుఁడు వృక్షాగ్రమున ప్రకాశించునట్లు, ఎఱ్ఱని అధరము ప్రక్కన తెల్లని దంతాంకురములు ప్రకాశింప చిరునవ్వు నవ్వుట.[53]

౭. మోకాళ్ళ సహాయముతో తప్ప టడుగులు వేయుట.[54]

౮ ముందు వెనుకల కూగుచు (నాట్యము చేయుచు) వచ్చి తల్లికి ము ద్దిడుట.[55]

౯. నూనె కుండలను నేలపై దొరలించుట.[56]

౧౦ ఆవు దూడల తోకలనుఁ బట్టుకొని నలు వైపులఁ ద్రిప్పుట [57]

---

49 తిరు వాయి మొழி : 2-1-8

50 పెరియాళ్వార్ తిరు మొழி : 1-4-1

51 ,, 1-2-1

52 ,, 1-5-9

53 ,, 1-7-2

54 ,, 1-7-4

55 ,, 1-5-2

56 ,, 2-4-6

57 ,, 2-4-8

౧౧. ఆవు దూడల చెవులలో చీమలు వేసి, వానిని భయపెట్టుట.[58]

౧౨. పాలు పితుకని సమయమునం గూడ, దూడలను వదలి వేయుట.[59]

౧౩. కుండలలో నుండు పెరుగును కడుపు నిండుగ జుఱ్ఱి వేయుట [60]

౧౪ తెలిసియు తెలియని (వచ్చియు రాని) మాటలు పలుకుట[61]

౧౫ చంద్రుని పట్టి తెమ్మని తల్లిని కోరుట.[62]

౧౬ మృత్తికను భక్షించుట.[63]

౧౭. తల్లి యగు యశోదకు తన నోటిలో బ్రహ్మాండములు జూపుట.[64]

౧౮. యశోదకు బూచినిం జూపుట [65]

౧౯ స్తన్య పానమునకు హఠము వేసి, ప్రేమతో తల్లినిం బిలుచుట.[66]

౨౦ స్నానమునకు రమ్మని యశోద కృష్ణుని పిలుచుట.[67]

---

58. పెరియాళ్వార్ తిరుమొழி : 3-4-2
59. ,, 2-4-7
60. ,, 2-7-1
61. ,, 1-6-4
62. ,, 1-4-3
63. ,, 2-3-8
64. ,, 1-2-18, 1-1-6
65. ,, 2-1-2
66. ,, 2-2-3
67. ,, 2-4-2

౨౧. కర్ణ వేధ సంస్కారము.[68]

౨౨. దృష్టి దోష పరిహారార్థమై, కృష్ణుని చేతులకు కంకణము గట్టుట.[69]

౨౩. బోరగిలఁ బడిఁయున్న ఱోటిపై నెక్కి నిలబడి, వెన్న దొంగి లించుట [70]

౨౪. ఉలూఖల బంధనము [71]

౨౫. యమళార్జున భంజనము [72]

౨౬. గోప బాలికల బంగారు కవ కరకణములను తస్కరించి, వానితో నేరేడు పండ్లు కొనుట [73]

౨౭. కృష్ణుని యాగడములను సహింపఁ జాలక, గోపికలు యశోదతో మొర పెట్టు కొనుట [74]

౨౮. కృష్ణుఁడు బలరాముని తోడను, ఇతర బాలకుల తోడనుఁ గలిసి, ఆవు దూడలను మేపుకొని వచ్చుటకు బయలుదేరుట [75]

---

68. పెరియాళ్వార్ తిరు మొళి : 2-2-8
69. ,, 2-3-5
70. ,, 1-10-7
71. ,, 1-2-10
72. ,, 3-3-3
73. ,, 2-9-9
74. ,, 2-10-1
75. ,, 1-2-20, 1-8-5, 3-1-1

౨౯. కుండలలో నుండు వెన్నను దొంగిలించి తిని, 'ఖాళీ' యైన ఆ కుండలను నేలపై పగులఁగొట్టి, వాని ధ్వనిని విని, పక పక నవ్వుట.[76]

౩౦. ఆవు దూడలను మేపుకొని వచ్చుటకు మొదటి సారిగా వనమున కేఁగుట; తల్లి విలపించుట.[77]

౩౧. వేణు గానము[78]

౩౨. వివిధములగు శృంగార వస్తువులను అలంకరించుకొని, విపినమున విహరించుట[79]

౩౩ వత్సాసుర వధ[80]

౩౪. బకాసుర వధ.[81]

౩౫. ధేనుకాసుర వధ[82]

౩౬. కాళియుని పడగపై నాట్యము చేయుట.[83]

౩౭. కాళియ మర్దనము[84]

౩౮. ప్రలంబాసుర వధ[85]

---

76. పెరియాళ్వార్ తిరు మొళి : 2-9-1
77. ,, 3-2-1, 3-3-2
78. ,, 3-6-1, నుండి 10 వఱకు
79. నాచ్చియార్ తిరు మొళి : 14-1-2
80. పెరియాళ్వార్ తిరుమొళి : 1-5-4
81. ,, 2-5-4
82. తిరుచ్చన్ద విరుత్తమ్ : 80
83. నాచ్చియార్ తిరు మొళి: 12-7 ; పెరియాళ్వార్ తిరు మొళి: 2-10-8
84. పెరియాళ్వార్ తిరు మొళి : 3-9-7 , 3-9-9
85. ,, 4-9-3

౩౯ దావానల పానము.[86]

౪౦ వన భోజనము[87]

౪౧ సీమాలికుఁ డను మిత్రునకు మోక్ష మొసంగుట[88]

(కృష్ణునకు మాలికుఁ డను మిత్రుఁ డొకఁడు కలఁడు అతఁడు కృష్ణుని యందు మిక్కిలి స్నేహ భావము గల వాఁడై, అనేక విధము లగు అస్త్ర విద్యలలో నైపుణ్యమును సంపాదించి, కాల క్రమమున గర్వాంధుడై, భక్తుల నెల్ల అను అవమానపఱచుచుండెను. కృష్ణుఁ డాతని దుశ్చేష్టను దూరము గావింప నెంచి, ఆతని కనేక విధములుగా హితమును బోధించెను. కాని, అది యంతయు వ్యర్థము కాఁగా - ఇఁక వానిని వధించుటయే కర్తవ్య మని కృష్ణుఁడు నిశ్చయించుకొని, అట్టి సమయమునకై వేచియుండెను. ఒకనాఁడు కృష్ణుఁడు మాలికుని కడకు వచ్చి, 'మిత్రమా ! మాలికా ! ఈ విద్యలో నెంతటి కష్ట మున్నదో చూడుము' అని పలికి, తన సుదర్శనాయుధమును గగనమున నెగురునట్లు ప్రేరేపించి, వేగముగ క్రిందకి దిగి వచ్చుచున్న ఆ యాయుధమును తన చేతి వ్రేల నవలీలగా ధరించెను అద్దానిని చూచుచున్న మాలికుఁడు - 'నా కిందు శ్రమ యే మున్నది '' అని, గర్వముతో ఆ చక్రాయుధమును ఆకసమున కెగురునట్లు ప్రేరేపింపవలసిన దని కృష్ణుని కోరగా, కృష్ణుఁ డట్లే చేసెను అపుడు క్రిందకు దిగి వచ్చు చక్రాయుధమును మాలికుఁడు తన వ్రేలఁ దాల్ప నెంచి, ఫలితముఁ గానక, ఆ చక్రముచే తల దుంపబడి మరణించెను ఆ మాలికుఁడు కృష్ణునకు మిత్రుఁడు కావున, తుదకు మోక్షమును పొందెను )

---

86. పెరియ తిరు మొళి : 11-6-7, తిరువాయి మొళి : 5-6-5

87. నాచ్చియార్ తిరుమొళి : 12-6

88. పెరియాళ్వార్ తిరు మొళి : 2-7-8

౪౨ ఏడు వృషభములను వశముఁ గావించుకొని, కృష్ణుఁడు నప్పిన్నను కన్యా శుల్కముగ పొందుట.[89]

౪౩. వేణు గాన మాధుర్యము.[90]

౪౪ గోపికా వస్త్రాపహరణము.[91]

౪౫ గోపికలతోఁ గలిసి, కృష్ణుఁడు నృత్యము చేయుట[92] (రాస లీల)

౪౬ ఇంద్రుని యజ్ఞ భంగము.[93]

౪౭ గోవర్ధనోద్ధరణము.[94]

౪౮ కేశి వధ[95]

౪౯. మధురాగమనము.[96]

౫౦ కుబ్జపై అనుగ్రహముఁ జూపుట[97]

౫౧. కువలయాపీడ వధ[98]

---

89. పెరియాళ్వార్ తిరు మొళి : 2-7-6

90. ,, 3-6-8

91. నాచ్చియార్ తిరుమొళి : 3-1, పెరియ తిరుమొళి : 10-7-1

92. తిరు వాయి మొళి : 3-6-3

93. పెరియ తిరు మొళి : 2-3-4, 4-?-3

94. పెరియాళ్వార్ తిరుమొళి : 3-5-6, తిరునెడు న్దాణ్డకమ్ : 13

95. పెరియ తిరు మొళి : 3-2-8

96. ,, 6-7-5

97. పెరియాళ్వార్ తిరు మొళి : 1-8-4

98. ,, 4-7-7 తిరు మాలై : 15
పెరియ తిరు మొళి : 2-2 8

౨౨. మల్ల యుద్ధము.[99]

౨౩. కంస వధ.[100]

౨౪. గురు వగు సాందీపుని, అతని తనయులను తిరిగి తీసికొని వచ్చుట [101]

(విద్యాభ్యాసము పూర్తి యైన పిమ్మట, గురు దక్షిణను సమర్పించు సమయమున, ఆ గురు పుత్రులలో నొకఁడు సముద్రమున ప్రభాస క్షేత్రములో మునిఁగి మరణింపఁగా - వానినిఁ దీసికొని వచ్చుటకు కృష్ణుఁడు - సముద్ర జలమున నివసించి యుండు శంఖ చక్ర రూప ధారి యగు నొక యసురుని గుర్తించి, వానిని చంపి వైచెను. అటు పిమ్మట, 'సంయమని' యను పురమున కేఁగి, యమధర్మరాజును మెప్పించి, గురు పుత్రునిఁ గైకొని వచ్చి, వానిని గురు వగు సాందీపుని పుత్రులతోఁ బంపి వైచెను.)

౨౫. రుక్మిణీ హరణము.[102]

౨౬. నరకాసుర వధ.[103]

౨౭. ద్వారకా నగర నిర్మాణము.[104]

౨౮. పారిజాతాపహరణము.[105]

---

99. పెరియాళ్వార్ తిరు మొళి : 2-2-6, 2-2-8 పెరియ తిరువన్దాది : 41
100. తిరు ప్పావై : 25, పెరియ తిరు మొళి : 3-10-9
101. పెరియాళ్వార్ తిరు మొళి : 4-8-1
102. ,, 3-9-3, తిరువాయి మొళి : 7-10-6
103. ,, 4-8-3
104. ,, 4-9-4
105. ,, 3-9-1, 2-1-9

౫౯. బాణాసుర వధ.[106]

౬౦. పౌండ్రక వధ [107]

౬౧. శిశుపాల వధ.[108]

౬౨ దంత వక్త్ర వధ.[109]

౬౩. ద్రౌపది కృష్ణుని శరణించుట.[110]

౬౪. శ్రీకృష్ణ రాయబారము [111]

౬౫. పార్ధసారధిగా కృష్ణుఁడు పయనమై వెడలుట.[112]

౬౬. కృష్ణుని పాదములయం దర్పింపఁబడిన పుష్పములను శివుఁడు తన శిరస్సుపై ధరించుట [113]

(మహా భారత యుద్ధ సమయమున అర్జునునకు శివుని పాశుపతాస్త్ర మావశ్యక మయ్యెను అందువలన, ఆ యర్జునుఁడు శివుని పూజింప నారంభించెను. కృష్ణుఁ డపుడు అర్జునునకు తన పాదములనుఁ జూపి, ఆ పాదములందు పుష్పములను సమర్పింపవలసిన దని చెప్పెను. అర్జునుఁ డట్లే చేసెను. ఆ నాఁటి రాత్రి - శివుని శిరస్సుపై ఆ పుష్పములను అర్జునుఁడు చూచెను శివుఁ డేతెంచి, పాశుపతాస్త్ర మొసంగెను.)

౭౯. గీతోపదేశము.[114]

---

106. పెరియాళ్వార్ తిరు మొళి : 4-3-1, తిరు వాయి మొళి : 3-10-4
107. పెరియ తిరు మొళి : 2-4-7, తిరుచ్ఛన్ద విరుత్తమ్ : 107
108. తిరు వాయి మొళి : 7-6-3, 7-5-10
109. మూన్ఱామ్ తిరువన్దాది : 21
110. పెరియ తిరు మొళి : 2-3-6
111. ,, 9-1-8
112. ,, 2-3-1
113. తిరువాయిమొళి : ?-8-6
114. ,, 4-8-6, 3-5-7

ఇట్లింకను ఆళ్వారుల దివ్య ప్రబంధములలో - కృష్ణ లీలలనేకములు వర్ణింపబడినవి. ఈ లీలలను పరిశీలించినచో - దివ్య ప్రబంధములలో - భాగవతము నందలి కృష్ణ లీలలు చాలవఱకు వర్ణింపఁబడినట్లును, భాగవతమునందు లేని కొన్ని లీలలు కూడ ఈ దివ్య ప్రబంధములలో వర్ణింపబడినట్లును తెలియఁ గలదు.

దివ్య ప్రబంధములలో వర్ణింపబడిన కృష్ణ లీలలను బాగుగా పరిశీలించినచో, మధురా లీలలనుఁ గా , ద్వారకా లీలలనుఁ గాని ఆళ్వారులు విశేషముగ వర్ణించియుండలేదని విశదము కాఁగలదు. అయినను, ఆళ్వారులు వర్ణించిన కృష్ణుని బాల లీల లన్నియు - భక్తుల హృదయములలో భగవద్భక్తిని ఉద్దీపింపఁజేయఁగల వనుట నిశ్చయము

మధ్య యుగమునకుఁ జెందిన కృష్ణ భక్త కవులు - ఆళ్వారులచే వర్ణింపఁబడిన బాల లీలలచే అత్యంతము ప్రభావితులై, తమ తమ కావ్యములలో - అళ్వారులకు సంబంధించిన ఈ ప్రక్రియ ననుసరించుచు, బాల లీలలను వర్ణించి ప్రశస్తి గాంచియున్నారు

భగవల్లీలలలో ఆళ్వారులు తన్మయత్వము

ఆళ్వారులు భగవల్లీలలను కథల రూపమున వర్ణింపక, మన కన్నుల యెదుట ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు వర్ణించుటలో - ఒక విచిత్ర ప్రక్రియ ననుసరించి యున్నారు. ఇందువలన, బాల కృష్ణునితో తమకుఁ గల ప్రత్యక్ష సంబంధమును ప్రస్ఫుటింపఁ జేసినట్లు స్పష్టమగును. ఉదాహరణకు - పెరియాళ్వారుల బాల లీలా వర్ణనములనే మన మాలోకింపవచ్చును.

పెరియాళ్వారులు తమ్ము యశోదగాఁ దలఁచుకొని, బాల కృష్ణుని తమ తనయునిగా భావించి, ఆ బాల కృష్ణుని సౌందర్యమును తనివి తీర ఇట్లభివర్ణించుచున్నారు :-

'సముద్రములో నుద్భవించిన అమృత మనఁ దగు మహా లక్ష్మి వంటి వసుదేవ పత్ని యగు దేవకి, పుష్పముచే నలంకరింపఁబడిన కేశములు గల నాకు, ఈ శిశువును (కృష్ణుని) పంపెను. ఇపు డీ బిడ్డఁడు - తన కరారవిందముచే పదారవిందము నెత్తి, ముఖారవింద మునఁ బెట్టుకొని, ఆ రసము ననుభవించుచున్నాఁడు. చెలులారా! చూడుఁడు. పగడమునుఁ బోలిన యధరముఁ గలవారా! పరిశీ లించుఁడు.'[115]

'దేవతల బాధలను నివారించుటకు భూ మండలమున వసుదేవ సుతుఁడుగా నవతరించి, బలవంతు లగు రాక్షసులను సంహరించి వర్ధిల్లు మధుసూదనుని నేత్ర సౌందర్యమునుఁ గాంచుఁడు బంగారు కంకణములను నిండుగా ధరించిన చేతులు గల చెలులారా! తిల కించుఁడు.'[116]

ఈ రీతిగా - పాశురములలో - మరి యొకరిని పిలిచి, తమ తనయుని (కృష్ణుని) సౌందర్యమును చూప నెంచును. అదియునఁ గాక, కృష్ణుని నిద్ర పుచ్చుటకు ఊయెలలో పరుండబెట్టి యశోద జోలపాటు పాడు సందర్భమున, పెరియాళ్వారులు స్వయముగా కృష్ణ

115. "శీదక్కళల శృముదన్న దేవకి
కోదై కుక్కళలాళ్ అశోదైపో్పత్తన్న
పేదైకుక్కళవి పిడుత్తుచ్చులైత్తుణ్ణమ్
పాద క్కమలజ్గళ్ కాణీరే పవళవాయ్ వన్దు కాణీరే."
- పెరియాళ్వార్ తిరుమొళి : 1-2-1

116. "విణ్ణోళమరర్ కళ్ వేదనై తీర మున్
మణ్ణోళ్ వశుతేవర్ తమ్మగనాయ్ వన్దు
తిణ్ణాళరర్రై త్తేయవళర్ కిన్దాన్
కణ్ణిరుదన్దవా కాణీరే శవవళైయార్ వన్దు కాణీరే."
- పెరియాళ్వార్ తిరు మొళి : 1-2-16

లీలలను స్మరించి, అతని స్తుతించుచు, వానిని నిద్ర బుచ్చుటకు జోలపాట పాడును. చంద్రుని పిలుచు సందర్భమున, తాము యశోదగా పెరియాళ్వారు లి ట్లనుచున్నారు :-

"ఓ చంద్రుఁడా! చక్రపాణి యగు ఈ కృష్ణుఁడు - నా నడుముపైఁ గూర్చుండి, తన దివ్య చక్షువులను విస్ఫారిత మొనర్చి, నిన్నే మాటి మాటికి చూపించుచున్నాఁడు. నీవు ఉచితజ్ఞుఁడ వగుదు వేని, సంతానము లేని నిర్భాగ్యుఁడవు కా వేని, కపటు స్వభావమును వీడి వెంటనే రమ్ము."[117]

పెరియాళ్వారులు తమ దివ్య ప్రబంధమున పలు తావులందు కృష్ణ లీలలను కథా రూపమున వర్ణింపకుండుటలో - తామును వాని లీలలో భాగమును పంచుకొనియుండుటయే కారణము. ముఖ్యముగా- కృష్ణునకు స్తన్య పానము చేయించుట, కృష్ణుఁడు కాననములో గోవులను మేపుటకుఁ బోవుట మొదలగు సమయములందు పెరియాళ్వారులు తాము యశోదగాఁ దలంచుకొని, ఆ కృష్ణునిపై మమకారమును, ఆత్మీయతను విశేషముగా వెల్లడించి యున్నారు. ఈ కారణము వలన, దివ్య ప్రబంధములలో పలు తావు లందు - వివిధ సంఘటనలు, వివిధ సన్నివేశములు ప్రత్యక్షముగ జరుగుచున్నట్లు, సజీవము లగు వర్ణనలు కాన వచ్చును. ఇట్టి వర్ణనలలో పెరియాళ్వారుల తన్మయత్వము సైతము బాగుగాఁ గన్పట్టును. పెరియాళ్వారులు సృష్టించిన ఈ ప్రక్రియ

---

117. "శక్కరిక్కైయన్ తడఙ్గణ్ణాల్ మలరవిళిత్తు
ఒక్కలై మేలిరున్దు ఉన్నైయే శుట్టిక్కాట్టుమ్గాణ్
తక్కతఱియేల్ శన్దిరా శలమ్ శెయ్యాదే
మక్కళ్ పెఱాద మలడనల్లై యేల్ వాకణ్డాయ్."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-4-4

ననుసరించుచు, తరువాతి కవులు - పురాణ కథలను, శైలిని వదలి, తమ భావనా బలముతో - కృష్ణ లీలలను మనోహరముగా వర్ణించి యున్నారు.

## కృష్ణుని భువన మోహన సౌందర్యము

కృష్ణ లీలలను వర్ణించిన భక్త కవు లెల్లరును, ఆతని భువన మోహన సౌందర్యమునకు ముగ్ధులై యున్నారు. వారి కావ్యములలో - కృష్ణుని రూప సౌందర్యమును వర్ణించు పట్టు లనేకములు గన్పట్టును. అట్టి పట్టులలో - వారికిం గల సహజ మగు చిత్త వృత్తి స్పష్టముగా మనకు గానవచ్చును.

ఆళ్వారు లందఱును కృష్ణుని భువన మోహన సౌందర్యమునకు ముగ్ధులైన వారే. వారిలో కొందఱు - కృష్ణ చరితమును, లీలలను రసవత్తరముగా వర్ణించుచు, ఆ కృష్ణుని యందు వానికిం గల అచంచల మగు ప్రేమ భావమును వ్యక్తీకరించి యున్నారు. వారు కృష్ణుని రూప సౌందర్యమును వర్ణించుచు, ఒకపుడు తాముసు ముగ్ధు లగుచుండెడివారు. మరి యొకపుడు, ఏ గోపిక చేతనో ఆ కృష్ణుని రూప లావణ్యములను వర్ణింపం జేసి, తద్ద్వారా - తాము ఆత్మానందము నందుచుండెడివారు. ఆళ్వారులు ముఖ్యముగా - బాల రూప సౌందర్యమును, కిశోర రూప సౌందర్యమును వర్ణించుటలో ఎక్కువ మక్కువం జూపి నట్లు, వారి దివ్య ప్రబంధముల మూలమున స్పష్ట మగును.

### కృష్ణుని బాల రూప సౌందర్యము :-

కృష్ణుని బాల రూప సౌందర్యమునకు విశేషముగ ముగ్ధులైన ఆళ్వారులలో - పెరియాళ్వారులు అగ్రగణ్యులు. ఇరువది పాశురములలో వీరు - బాల కృష్ణుని రూప సౌందర్యమును నఖ శిఖ పర్యం

తము వర్ణించియున్నారు. ఒక్కొక్క పాశురములో ఒక్కొక్క అవయవ శోభ - మిక్కిలి రమణీయముగ నిట్లు వర్ణింపబడినది:-

"కృష్ణుని పాదములు - వికసించిన కమలముల వలె సుందరమైనవి."[118]

'ఆ పాదములలో - మేలిమి బంగారమందు పొదగఁబడిన ముత్యముల వలెను, రత్నముల వలెను, వజ్రముల వలెను వ్రేళ్ళు శోభిల్లుచున్నవి.'[119]

'పగడ వర్ణము గల దివ్యాధరముల మధ్య భాగమున ప్రకాశించు చంద్రరేఖ వలె, దంతములు విలసిల్లుచున్నవి.'[120]

'కమల దళముల నడుమ మధువును గోలు భ్రమరముల వలె, కృష్ణుని నుదుటిపై అంద మైన ముంగురులు వ్రేలాడుచున్నవి.'[121]

---

118. "పాద క్కమలఙ్గళ్ కాణీరే, పవళవాయీర్ కాణరే."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-2-1

119. "ముత్తుమ్ మణియుమ్ వయిరముమ్ నన్పొన్నుమ్
తత్తి ప్పదిత్తు త్తలైప్పెయ్దాఱ్పోల్ ఎఙ్గుమ్
పత్తు విరలుమ్ మణివణ్ణన్ పాదఙ్గళ్
ఒత్తిట్టిరున్దవా కాణీరే ఒణ్ణుదలీర్ వన్దు కాణీరే."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-2-2

120. "కోలవటమ్ పవళచెన్దువర్ వాయినిడై
కోమళవళ్ళిముళైపోల్ శిల పల్లిలక."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-6-9

121. "శెఙ్గమల ప్పూవిల్ తేనుణ్ణుమ్ వణ్డేపోల్
పఙ్గికళ్ వన్దు ఉన్ పవళవాయ్ మొయిప్ప."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-8-2

బాల కృష్ణుని ముఖారవిందమును చంద్ర బింబముతో పోల్చుచు, పెరియాళ్వారు లిట్లనుచున్నారు :-

'ఓ చంద్రుడా ! 'నే నొకడనే అందమైనవాడ' నని నీవు విఱ్ఱవీగుచున్నావు. నీ వెంతటి కాంతి గలవాడ వైనను, నా కుమారుని (కృష్ణుని) ముఖ సౌందర్యముతో నీవు సాటి రాజాలవు.' [122]

'వికసించిన కమలముల నుండి అమృత బిందువులను స్రవింపజేయుచున్నాడు నా కుమారుడగు కృష్ణుడు' [123]

కృష్ణుని చేష్టలలో - పెరియాళ్వారులకు సౌందర్యానుభూతి కల్గినది శిశువునకు స్తన్య పానము చేయించుట, చంద్రుని పిలుచుట, కర తాళ ధ్వనిఁ గావించి (చప్పట్లు కొట్టి) చిఱు నవ్వు నవ్వించుట, శిరస్సును పైకెత్తి అటు నిటు కదలించుట, (పరిచయము కలుగునట్లు చేయుట), మృదు వగు చిన్న పాదములతో తప్ప టడుగులు వేయుట మొదలగు క్రియలలో పెరియాళ్వారులు సూక్ష్మముగ సౌందర్యము ననుభవించి, ఆ సౌందర్యమును అవకాశము కొలఁది తమ దివ్య ప్రబంధమున అభివ్యక్తము గావించిరి.

---

122. "శుత్తమొళి వట్టమ్ శూళ్న్దు పరన్దిర న్దెఙ్గుమ్
ఎత్తనై శెయ్యిలుమ్ ఎన్మకన్ముకమ్ నేరొవ్వాయ్
విత్తకన్ వేఙ్గడవాణన్ ఉన్నై విళిక్కిన్ఱ
కైత్తలమ్ నోవామే అమ్బులీకడితోడివా."
- పెరియాళ్వార్ తిరు మొళి : 1-4-3

123. "వడర్ పఙ్గయమలర్ వాయ్ నెకిళ ప్పనిపడుశిఱు తుళిపోల్
ఇరఙ్గోణ్డు శెవ్వాయుటి యూఱి - యిత్తిత్తుపీళవిన్దు
కఱ్ఙ్కక్క ఱుత్తిల్ మణిక్కుఱరర్ పోల్ ఉడై మణికణ కణెన
తడన్దాళిణైకొణ్డు శార్ఙ్గపాణి తళర్ నడై నడవానో."
- పెరియాళ్వార్ తిరు మొళి : 1-7-7

వేష భూషణములు :-

బాల కృష్ణుని వేష భూషణములను పెరియాళ్వారులు బహు మనోహరముగా వర్ణించి యున్నారు. ఎన్నియో భూషణములను గల్పించి, వాని నన్నింటితో కృష్ణు నలంకరించిరి. ఎన్నియో పుష్పముల పేర్లను పేర్కొనుచు, వాని నన్నింటితో కృష్ణుఁ డలంకరింపఁ బడినట్లు వర్ణించిరి.

నీల మేఘ శ్యాముఁ డగు కృష్ణునకు, మెరపు తీగ వలె కాంతి వంతమైన పీతాంబరమును కట్టబెట్టిరి.[124] ఎఱ్ఱని కమలము వంటి పాదములలో అందెలు, వికసించిన పద్మ పత్రముల వలె శోభిల్లు కాలి వేళ్ళలో ఉంగరములు, నడుమునకు ఘల్లు ఘల్లని మోయు గజ్జెలతోఁ గూడిన బంగారు మొల త్రాడు, చేతి వ్రేళ్ళలో - వజ్రములతో, ముత్యములతో పొదగఁబడిన బంగారు ఉంగరములు, చెవులలో మకర కుండలములు, తలపై నొక భూషణ విశేష మగు 'చుట్టి' మున్నగు వివిధ భూషణములతో కృష్ణుఁ డలంకరింపఁబడెను.[125]

---

124. "మిన్నుక్కొడియుమొరు వెణ్ తిఙ్గళుమ్ శూళ్ పరివేడముమాయ్
పిన్నల్ తులఙ్గుమరశిలైయుమ్ పీతకచ్చిత్రాడై యొడుమ్
మిన్నల్ పొలిన్ద ఓర్ కార్ముకిల్ పోల కళుత్తినిల్ కాఱై యొడుమ్
తన్నిల్ పొలిన్ద ఇరుడీ కేశన్ తళర్ నడై నడవానో."

- పెరియాళ్వార్ తిరుమొళి : 1-7-8

125. "శెఙ్గమలక్కళలిల్ శిత్తితళ్ పోల్ విరలిల్ శేర్ తికళాళ్ కళుమ్
కిణ్కిణి యుమ్ అరైయిల్
తఙ్గియపొన్ వడముమ్ తాళనన్మాదుళైయిన్ పూవొడు పొన్మణియుమ్
మోదిరముమ్ కిఱియుమ్
మఙ్గలనైమ్బడైయుమ్ తోళ్వళై యుమ్ కుళైయుమ్ మకరముమ్ వాళికళుమ్
శుట్టియు మొత్తిలక
ఎఙ్గళ్ కుడిక్కరశే యాడుక శెఙ్గీరై ఏఙలకుమడైయా యాడుక
వాడుకవే."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-5-10

కృష్ణుఁడు నడచునపుడు గజ్జెలు ఘల్లు ఘల్లు మని ధ్వనించు చున్నవి.[126] అమృతముతో నిండిన నోటితో కృష్ణుఁడు చిఱునవ్వు నవ్వు నపుడు కల్గెడు ధ్వని, చెఱకు రసము నిండుగాఁ గల భాండమునకు రంధ్రము వేసినచో - అందలి రసము వెలుపలకు స్రవించునపుడు కల్గెడు ధ్వని వలె నున్నది.[127]

కృష్ణుని కిశోర రూప సౌందర్యము :-

గోకులమున గోపికలను ముగ్ధులఁ గావించు కృష్ణుని మోహన రూపమును ఆళ్వారులు పలు తావులలో వర్ణించి యున్నారు. కృష్ణుని కిశోర రూప సౌందర్యమును గోపికలచే పెరియాళ్వారులు విశేషముగ ఆస్వాదింపఁజేసిరి. ఆవులను మేపుకొని, బలరామునితో - ఇతర సహచరులతో తిరిగి వచ్చు కృష్ణుని అలౌకిక సౌందర్యమునుఁ గాంచి, గోపికలు తన్మయత్వము నందిరి.

నంద కుమారుఁ డగు కృష్ణుఁడు - కల్ప లత యందలి మృదు వగు పుష్పము వంటి వస్త్రమును ధరించి, నడుమున అందమైన పట్టు వస్త్రమును బిగువుగాఁ గట్టి, కంఠమున - సుందరములు, సుగంధ యుక్తములు నగు సుమ దామములను ధరించి, నెత్తిపై నెమలి పింఛము నలంకరించుకొని, సంధ్యా సమయమున ఇతర బాలకులతోఁ గూడి,

---

126. "తొడర్ శజ్గిలిక్కై శలార్ పిలారెన్న
తూఙ్గు పొన్మణి యొలిర్ప." - పెరియాళ్వార్ తిరు మొళి : 1-7-1

127. "కన్నల్ కుడమ్ తిఱన్దాలొత్తూఱి
కణకణ శిరిత్తు ఉవన్దు" - పెరియాళ్వార్ తిరు మొళి : 1-7-4

వనము నుండి తిరిగి వచ్చుచున్నాఁడు.[128] ఫాలభాగమున సిందూర తిలకము శోభిల్లుచున్నది. ఇతర సహచరులతోఁ గూడి కృష్ణుఁడు వచ్చునపుడు - మేఘములు గర్జించునట్లు ధ్వనించుచున్నది. పగడముల వలె నుండు అధరములను, ఆ యధరములపై చిందు లాడు మధుర మైన మంద హాసమునుఁ జూచియు, వేణు గానముతోఁ బాటు, తన సహచరులతోఁ గూడి నృత్యముఁ జేయుచు వచ్చుచుఁడు భువన మోహనునిఁ జూచియు తన్మయత్వము నందినది తల్లి.

మురళిని మ్రోయించునపుడు కృష్ణుని అపార సౌందర్యమును ఆళ్వారులు మిగుల మనోహరముగా వర్ణించియున్నారు.[130] అలౌకికము-అపరిమితము నగు కృష్ణుని భువన మోహన సౌందర్యమును వర్ణించు పట్టులలో - భక్త కవులు తమ చైతన్యమును వీడిరి. తిరుప్పాణాళ్వారులు తమ ఏకైక రచన యగు 'అమలనాది పిరాన్' అను దివ్య ప్రబంధమున

---

128. "వల్లి మణ్ణతళన్నవాడై కొణ్డు వళై యఱ త్తిరువరై విరుత్తుడుత్తు
పల్లిసుణ్ పత్తాకవుడై వాళ్ శాత్తిప్పణై క్క-చ్చుద్దిప్పలతళై నడువే
ముల్లై నన్నఱుమలర్ వేఙ్గై మలరణిన్దు పల్లాయర్ కుళానడువే
ఎల్లియమ్పోతాక ప్పళ్ళైవరుమ్ ఎదిర్ నిన్ఱఙ్గినవళై యిళలేన్మినే."
- పెరియాళ్వార్ తిరు మొళి : 3-4-2

129. "శిన్దుర మిలఙ్గ త్తన్తిరు నెత్తిమేల్
తిరుత్తియ కోఱమ్బుమ్ తిరుక్కుళలుమ్."
- పెరియాళ్వార్ తిరు మొళి : 3-4-6

130. "శాలప్పల్ నిరై ప్పిన్నే తళై క్కావిన్ కీళ్ తన్ తిరుమేని నిన్ఱొళి తికళ
నీలనన్నఱుమ్ కుఙ్జనే త్తిరత్తాలణిన్దు పల్లాయిర్ కుళానడువే."
- పెరియాళ్వార్ తిరు మొళి : 3-4-7

భగవంతుని దివ్య సౌందర్యమును నఖ శిఖ పర్యంతము వర్ణించుచు ప్రస్తుతించిరి. తర్వాతి కవులు, కృష్ణుని రూప సౌందర్యమునకు సంబంధించిన ఈ చిత్రణములచే మిక్కలి ప్రభావితులైరి. మధ్య యుగమునకుఁ జెందిన కృష్ణ భక్త కవులును - తమ కావ్యములలో - కృష్ణుని అలౌకిక రూప సౌందర్యమును బహు రమణీయముగ వర్ణించిరి.

## కృష్ణుని పరమాత్మ తత్త్వము

లీలా మానుష విగ్రహుఁడగు కృష్ణుని భువన మోహన సౌందర్యమును పరిపూర్ణముగ వర్ణించుచున్నను, బాలకృష్ణుని లీలా సాగర తరంగములలో ఓలలాడుచున్నను, కృష్ణుఁడు పరబ్రహ్మ స్వరూపుఁడగు మహావిష్ణువు యొక్క అవతారమనియే ఆళ్వారు లంతటను సంభావించిరి. వారు తమ దివ్య ప్రబంధములలో అట నట కృష్ణుని పరమాత్మ తత్త్వమును వర్ణించియే యున్నారు చేతనుల నుద్ధరించుటకును, భూ మండలమున అధర్మము వ్యాపించినపుడును కృపా సముద్రుఁడగు భగవానుఁడు తన దయా గుణమును వ్యక్తీక రించుటకు భూ మండలమున నవతరించుచుండు ననియే వారు తలంచిరి. తమ దివ్య ప్రబంధములలో అట నట విష్ణువు యొక్క ఇతర అవతారములకు సంబంధించిన లీలలనుఁ గూడ ఆళ్వారులు కీర్తించిరి. ఆళ్వారుల కాలములో - ఆ యా యవతారములకు సంబం ధించిన కథలు విశేషముగ ప్రచలిత మగుచునే ఉన్నవి. అదియునుఁ గాక, విష్ణు భగవానుఁడు భక్త వత్సలుఁడుగా - కరుణా సముద్రుఁ డుగా - సత్య సంకల్పుఁడుగా ప్రజలు సంభావించెడివారు. అందు వలన ఆ కాలములో - జన సామాన్యమున భక్తి ప్రచారము సులభ సాధ్య మయ్యెను.

ఆళ్వారుల దివ్య ప్రబంధములలో - విష్ణువు యొక్క యవ తారములు, ఆ యవతారములకు సంబంధించిన లీలలు పరిపూర్ణముగ

వర్ణింపఁబడినవి. వివిధము లగు అట్టి యవతారములను వర్ణించు పట్టులలో ఆళ్వారులు - ఏ విధమైన భేద భావమును చూపియుండ లేదు. ఈ యవతారముల నన్నింటిని పరబ్రహ్మ యగు విష్ణువు యొక్క వివిధ రూపము లనియే వారు భావించిరి కాని, మిగిలిన యవతారములందుకంటెను కృష్ణావతారమునందే వారి మనస్సు విశేషముగ విహరించెను.

కృష్ణుని లీలలను - చేష్టలను వర్ణించు సమయములందును, కృష్ణుని అలౌకిక శక్తిని వ్యక్తీకరించు సందర్భము లందును అతి మానుష మగు (Super human అతని అద్భుత కృత్యములను మనకు ఆళ్వారులు దర్శింపఁజేసిరి. కృష్ణుఁడు పరబ్రహ్మ యగు విష్ణువు యొక్క అవతార మనియు, అతఁ డింతకు మున్ను అనేకము లగు అవతారము లనెడు శృంఖలకు కృష్ణావతారము కొలికి (Link) వంటి దనియు ఆళ్వారులు వర్ణించిరి ఇట్లు వర్ణించుటలో - కృష్ణుని పరమాత్మ తత్త్వ మును స్థాపించుటయే ఆళ్వారుల ముఖ్యోద్దేశ్యమై యున్నట్లు స్పష్ట మగును ఒకే సందర్భమున వారు - కృష్ణావతారముతోఁ బాటు ఇతర అవతారములను గూడ వర్ణించుటలో - కృష్ణుఁడు సామాన్యుఁడు కాఁ డనియు, పరబ్రహ్మ స్వరూపుఁ డనియు సంభావించి, పూతన సంహారము, శకటాసుర భంజనము, కాళియ మర్దనము, గోవర్ధనోద్ధ రణము మొదలగు అతి మానుష కృత్యములను ప్రస్తుతింపఁ దలచుటయే కారణము ఇదియే అందలి యాంతర్యము ఇతర సందర్భములందు సైతము - కృష్ణుని వివిధ లీలలను, బాల్య చేష్టలను వర్ణించునపుడును ఆళ్వారులు - ఆ కృష్ణుని అతి మానుష కృత్యములను అభివర్ణించిరి. ఉదాహరణము :- 'నీలాకాశమునఁ గల చంద్రుఁడా! బాలుఁడు గదా యని ఈతని తిరస్కరింపకుము. పూర్వము మఱ్ఱి యాకుపై పవళించిన దితఁడే యని తెలిసి కొనుము. వీని యెడల నీవు ఉదాసీనుఁడవై

యుంటి వేని, దానిని సహింపఁజాలక, ఎగిరి గఁతు లిడి, వెంటనే నిన్ను పట్టుకొనఁగలడు. కనుక, ఈ పురుషోత్తముని అనాదరింపక వెంటనే రమ్ము" [131]

'ఓ చంద్రుడా! కృష్ణుఁ డనుపేరు గల ఈ నా సింహ శాబక మును బాలుఁ డని యనాదరింపకుము. ఈతని వృత్తాంతమును తెలిసి కొనఁ దలచితి వేని, బలి చక్రవర్తి వద్దకు బోయి, వాని నడిగి తెలిసి కొనుము.... వీనికి దాసుఁడ వగుము. ....సర్వేశ్వరుఁ డగు కృష్ణుఁడు నిన్ను పిలుచుచున్నాఁడు. వేగముగ రమ్ము' [132]

ఈ పలుకుల మూలమున ఆళ్వారులు కృష్ణుని పరమాత్మ తత్త్వ మును నిర్దేశింప నెంచినట్లు వ్యక్త మగును.

కృష్ణునిపై గోపికల ప్రేమ ప్రభావము :-

భగవద్భక్తి మార్గములు - ఆళ్వారుల దివ్య ప్రబంధములలో వివరింపఁబడినంత విస్తారముగ మఱే గ్రంథ మందును కానరావు.

---

131. "పాలకనెన్డు పరివవమ్ శెయ్యేల్ పణ్డొరునాళ్
ఆలినిలై వళర్న్ద శిఱుక్కనవనివన్
మేవెళప్పాయ్న్దు పిడుత్తుక్కొళ్ళుమ్ వెగుళుమేల్
మాలై మదియాదే మానదీః మకిళి న్దోడివా."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-4-7

132. "శిఱియ నెన్డు ఎన్నిళఙ్గళత్తై ఇకళేల్ కణ్డాయ్
శిఱు మెయిన్ వార్త్తైయై మావలియిడై చెన్డుకేళ్
శిఱుమైప్పిళై కొళ్ళల్ నీయుమున్ శేవైకుఱిత్తియేకాణ్
నిఱై మదినెడుమాల్ విరైన్దున్నై కూవుకిన్ఱాన్."

- పెరియాళ్వార్ తిరు మొళి : 1-4-8

వివిధము లగు అట్టి మార్గములలో కృష్ణ గోపికల ప్రేమ భావము కృష్ణ భక్తి వాఙ్మయ భాండాగారమునకును మకుటాయమాన మైనది. ఇయ్యది భక్తి వాఙ్మయము నందు ఈ కృష్ణ గోపికల భక్తి భావము నకు ప్రముఖ స్థానము లభించినది. అందువలననే ఆ వాఙ్మయమునకు అంతటి ప్రాచుర్యము లభింపగల్గెను.

భక్తి స్వరూప నిరూపణముఁ గావించు గ్రంథములలో - నారద భక్తి సూత్రములు, శాండిల్య భక్తి సూత్రములు అనునవి రెండును అగ్ర గణ్యము లైనవి అందు నారద భక్తి సూత్రములు - 'యథా వ్రజ గోపికానామ్' అనియు, శాండిల్య భక్తి సూత్రములు - 'అత ఏవ త దభావా ద్వల్లవీనామ్' అనియు, గోపికలకు కృష్ణుని యందుఁ గల ప్రేమ భావమే భక్తి యని, భక్తి స్వరూపమును నిర్వచించెను. ఈ నిర్వచనానుసారము, ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో - కృష్ణునిపై గోపికలకు ప్రగాఢముగాఁ గల చిత్త వృత్తిని, ప్రేమ భావమును నాల్గు విధములుగా నిట్లు విభజించి యున్నారు :-

౧. దాస్య భావము ౩. వాత్సల్య భావము

౨. సఖ్య భావము ౪. మధుర భావము

ఈ నాల్గింటిలో - దాస్య సఖ్య భావముల కంటెను, వాత్సల్య మధుర భావము లందే ఆళ్వారులు ఎక్కువ మక్కువఁ జూపినట్లు వారి దివ్య ప్రబంధముల మూలమున వ్యక్త మగును.

వాత్సల్య భావము :-

కృష్ణ భక్త కవులు వాత్సల్య భావమును ఒక ప్రధాన తత్త్వ ముగా పరిగ్రహించినట్లు, వారి కావ్యములలో కానవచ్చును. ఆళ్వా రులు గావించిన బాల భావ రూప చిత్రణమున, వాత్సల్య భావమునకు

సాటి లేని మేటి సౌందర్య రూపము లభించినది. పెరియాళ్వారుల యశోద, కృష్ణునిపైఁ జూపిన వాత్సల్య భావము అపూర్వ మైనది. ఈ వాత్సల్య భావము - నిష్కామముతోఁ గూడినది. ఇయ్యది - ఇతర భావముల కంటెను ఉత్తమ మైనదిగా పరిగణింపఁబడుచున్నది.

తమ సంతతిపై తలి దండ్రులకు వాత్సల్య భావ ముండుట సహజము. అది నిర్దుష్టముగను, నిష్కపటముగను, నిస్స్వార్థముగను ఉండును. అందునను - మాతృప్రేమ అనుపమాన మైనది. శైశవావస్థయందుఁ గల కుమారుని మధుర భాషణములను, అస్పష్ట వచనములను వినుట యందును, అతని యాటలను, వివిధ చేష్టలను విలోకించుటయందు సైతము మాతృ హృదయము పొందినంత ఆనందమును, తన్మయత్వమును, తృప్తిని పితృ హృదయము పొందఁజాలదు.

మాతృ రూపమునకు యశోదను ఒక ప్రతీకగా మనము తలంపవచ్చును. ఈ యశోదయొక్క మహా భాగ్యమును భక్తాగ్రేసరు లగు ఆళ్వారులు బహు భంగులుగా ప్రశంసించుచు, దేవతలు, ఋషులు, మునులు మున్నగువా రయినను - యోగముచే గాని, భక్తిచే గాని అంతటి మహా భాగ్యమును పొందఁజాల రని వక్కాణించిరి.

కృష్ణుని శైశవ దశయందును, బాల్య దశయందును, కిశోర దశయందును మాతృ హృదయము విశేషముగ వికసించినట్లు పెరియాళ్వారుల దివ్య ప్రబంధమున వర్ణింపబడినది. బాలోచితము లగు అస్పష్ట వచనములు సహజ సుందరముగా వర్ణింపబడినవి. బాలకృష్ణుని మాతృ రూపము మొదలు, కిశోర కృష్ణుని మాతృ రూపము వఱకు - వివిధ రూపములు నిరుపమానముగ వర్ణింపఁబడినవి. ఈ వాత్సల్య భావము, సంయోగ - వియోగములుగా రెండు విధములు. అట్టి సంయోగ వియోగములతోఁ గూడిన వాత్సల్య భావమును పెరియాళ్వారులు

తమ దివ్య ప్రబంధమున అద్భుతముగా అభివర్ణించిరి. పెరియాళ్వారులచే నూతనముగా సృష్టింపఁబడిన ఈ వాత్సల్య భావము - అనంతర కవులను మిక్కిలి ప్రభావితులఁ గావించి, వాత్సల్య భక్తికి సైతము ప్రాధాన్యమును చేకూర్చినది.

మధుర భావము :-

భక్తునకును, భగవంతునకును నడుమ, స్త్రీ పురుష సంబంధమును ప్రతిపాదించు పాశురములు - ఆళ్వారుల దివ్య ప్రబంధములలో అధికముగ గానవచ్చును. లోకమున ప్రచలిత మగు ప్రేమ భావములన్నింటిని ఆళ్వారులు పరమాత్మ వైపుకు మఱల్చిరి. ఇట్లు మఱల్చిన వారిలో - నమ్మాళ్వారులు, తిరుమంగై యాళ్వారులు ముఖ్యులు.

కృష్ణభక్తి విషయమున మనము పరిగణించు శృంగార రసమే భక్తి విషయమున మధుర భావ మని తెలియ నగును. కృష్ణ భక్తికి సంబంధించిన అట్టి మధుర భావమునకు గోపికలు ప్రసిద్ధులుగాఁ గానవత్తురు. ఆ గోపికలు - కామ రూపముగాఁ గల ప్రేమ పీతియు నిష్కామమే యనునంతగా కృష్ణునిలో లీన మైరి కాన, సంయోగ-వియోగము లనఁబడు రెండు అవస్థల యందును గోపికల చిత్తవృత్తులు పరాకాష్ఠ నందుకొన్నట్లు మనము గ్రహింప నగును.

భక్తునకును, భగవంతునకునుఁ గల నవ విధ సంబంధములలో - నాయకీ నాయక సంబంధము అద్వితీయ మైనది. ఈ సంబంధములను నిరూపించి స్థాపించిన మహనీయులు ఆళ్వారులే. ఇది మిక్కిలి మహత్తర మైనది. ఈ మధుర భావమును కావ్యపరముగా మలచుటకు లౌకిక మగు శృంగార కావ్యములలోఁ గల ప్రక్రియ లన్నింటిని ఆళ్వారులు ఆలంబనముగాఁ గొని, భక్తునకును, భగవంతునకును నడుమ - అలౌకిక మగు ప్రేమ భావమునుఁ గల్పించిరి. ఇయ్యది - అనంతర

కృష్ణ భక్తులకును, భక్త కవులకును మార్గ దర్శకమై, మహానందమును ప్రసాదించినది.

సహజ సిద్ధ మగు ఆండాళ్ మధుర భావము -:

భగవంతునియందు తమకుఁ గల మధుర భావమును వ్యక్తము గావించుటకు ఆళ్వారులు - తాము స్త్రీత్వము నారోపించుకొనుటకు అవశ్యకత యయ్యెను. కాని, ఆండాళ్ సహజముగ స్త్రీ యగుటచే, ఆమెకు అట్టి యవసరము కలుగలేదు. ఇందువలన, పురుషుఁ డగు భగవంతుని ప్రేమించుట ఆమెకు సులభ సాధ్య మయ్యెను.

బాల్యదశ యందే ఆమె మనస్సు మురళీ మాధవునిపై లగ్న మయ్యెను. కాలక్రమమున ఆమె ప్రేమ భావము వృద్ధిఁ జెందఁగాఁ కృష్ణుని సంయోగమునకై పరితపించు గోపిక వలె ఆమె పరిస్థితి పరిణమించెను. తన సంకల్ప సిద్ధికై తా నొక గోపికగాఁ దలంచుకొని, మార్గళి మాసమున, సఖీ జనముతోఁ గూడి, నియమ నిష్ఠలతో వ్రత మాచరించెను. త త్ఫలితముగా - ఆమె మనోరథ మీడేరి, శ్రీరంగ రాజేశ్వరియై విరాజిల్లెను

ఆండాళ్ రచించిన 'తిరుప్పావై' 'నాచ్చియార్ తిరుమొళి' అను దివ్య ప్రబంధములు రెండును - మధుర భక్తికి మకుటాయమానములు. ఇవి - భారతీయ భక్తి సాహితీ మహోద్యానమున విరిసిన సుగంధ సుమ రాజములు. ఇవి - అనంతర భక్త కవులను విశేషముగ ముగ్ధులఁ గావించి వైచినవి.

ఆండాళ్ దివ్య ప్రబంధములలో - గోపికల ప్రేమ భావమును ప్రస్ఫుటింపఁజేయుపాశురము లనేకములున్నవి.అనేక రూపములుగాఁగల

అట్టి గోపికల ప్రేమ భావ పరంపరలు - ఈ క్రింద పేర్కొనఁబడు నాల్గు ఘట్టములలో మనకు స్పష్టముగాఁ గన్పట్టును.

౧. వేణు మాధుర్యము
౨. రాస లీల
౩. రాధా (నప్పిన్న) కృష్ణుల ప్రేమ కలాపములు
౪. భ్రమర గీతములు

## వేణు మాధుర్యము - తత్ప్రభావము

గోపికలకు కృష్ణునిపైఁ గల్గిన ప్రేమ భావమునకు - కృష్ణుని మురళీ నాద ప్రభావముఁ గూడ నొక ముఖ్య కారణము. అది - సకల చరాచర జగత్తును ఆకర్షించు శక్తి గలది. అట్టి వేణు గాన మాధుర్యము ఆళ్వారుల దివ్య ప్రబంధములలో మనోజ్ఞముగ వర్ణింపఁ బడినది. అనంతర భక్త కవులు - దీనిచే మిక్కిలి ప్రభావితు లగుటయే గాక, దివ్య ప్రబంధములందలి విశేషాంశములను సైతము స్వీకరించి, కావ్యములను సంతరించిరి.

కృష్ణుని మురళీ రవళి - సకల జీవ రాసులను సమ్మోహింపఁ జేయు మహత్తర ప్రభావము గలది. దాని ప్రభావము - మిగిలిన వానిపై కంటెను, గోపికల హృదయములపై విశేషముగ ప్రసరించెను. 'పెరియాళ్వార్ తిరుమొళి' దివ్య ప్రబంధములో - మూఁడవ శతకము నందలి ఆరవ దశకమున, మురళీమాధుర్యము, దాని ప్రభావము సహజ సుందరముగా వర్ణింపఁబడినది. మచ్చు కొక వర్ణన :-

'కృష్ణుఁడు పవిత్ర మగు తన యధరమున మురళి నుంచి వాయించెను. ఎంతటి యాశ్చర్యము। ఆ ధ్వనిని వినినంతనే

కుతూహల పూరితము లగు స్తనములు గల గోప కన్యల కోమల శరీరములు పులకించెను. ఆ మురళీ నాద ప్రభావముచే, అత్త మామల ప్రతిబంధములనుఁ గూడ ఆ గోప కన్యలు లెక్క సేయక వెలుపల కేతెంచి, దారములో గుచ్చబడిన పూల వలె, ఒక తావుకు వరుసగా వచ్చి నిలచిరి.[133] కృష్ణుఁడు వేణువును తన పెదవిపైఁ బెట్టి, ఎడమ భుజమును వంచి, రెండు చేతులను ఆ వేణువుపై నుంచి, కను బొమలను ముడిచి, గాలి నింపి, క్రింది పెదవిని ముడిచి, వేణువును వాయించెను, అపుడు - గోప కన్యల కేశ బంధములు విడిపోయెను. అస్తవ్యస్తము లగు తమ వస్త్రములను ఆ కన్నియలు తమ హస్తము లతో సవరించుకొనుచు, కృష్ణుని వైపు చూచుచుండిరి."[134]

## రాస లీల

### (ఆళ్వారుల 'కురవై కూత్తు')

ఆళ్వారుల దివ్య ప్రబంధములలో ఎచ్చటను 'రాస లీల' శబ్ద ప్రయోగము కానరాదు. కాని, అయ్యది - ఆళ్వారుల దివ్య ప్రబంధ

133. "నావలమ్ పెరియ తీవినిల్ వానవమ్ నజైమీర్గళ్ ఇదోరఙ్పదమ్ కేళిర్
తూవలమ్ పురియుడైయ తిరుమాల్ తూయవాయిల్ కుళలో శైవళియే
కోవలర్ శిఱుమియరిళఞ్కొఙ్గైకుదుకలిప్ప ఉడలుళ విళ్న్దు ఎఙ్గుమ్
కావలుమ్ కడున్దు కయిరుమాలైయాగి వన్దుకవిళ్న్దు విన్దవరే"
- పెరియాళ్వార్ తిరు మొళి ; ౩_౬_1

134. "ఇడవణరై యిడత్తోళొడుశాయ్త్తు ఇరుకై కూడప్పురువమ్ నెరిన్దేఱ
కుడవయిఱుపడవాయ్ కడై కూడ క్కోవిన్దన్ కుళల్ కోడూదినపోదు
మడమయిల్ కళొడుమాన్ పిణైపోలే మజైమార్గల్ మలర్కూఙ్దలవిళ
ఉడైనెగిళ వోర్కై మాల్ తుగిల్ పత్తి ఒల్గియోచరిక్కణోడ నిన్దనరే."
- పెరియాళ్వార్ తిరు మొళి ; ౩_౬_2

ములలో - 'కురవై కూత్తు' అను పేర అభివర్ణింపఁబడినది. తమిళ ప్రదేశమున ప్రచలిత మగు కొన్ని కథలలో - కృష్ణుఁడు గోపికలతోఁ గావించిన వివిధ నృత్యములు గన్పట్టును. ఈ 'కురవై కూత్తు'కు ప్రాచీన తమిళ వాఙ్మయమున నొక విశిష్ట స్థాన మున్నది. సంఘోత్తర కాలమునకుఁ జెందిన 'శిలప్పధికారము'లో - ఈ కురవై కూత్తు నృత్యము వర్ణింపఁబడినది ఇయ్యది - 'రాస లీల' వలె నుండును.[135] ఇందువలన, 'కురవై కూత్తు' అను పేర రాస లీలను ఆళ్వారులు తమ దివ్య ప్రబంధములలో వర్ణించినట్లు స్పష్ట మగుచున్నది. అట్టి రాస లీలా వైభవమును మన ముపు డించుక పరిశీలింతము :-

" సుందరము - సుగంధ భరితము నగు వన మాల - కృష్ణుని కంఠమున శోభిల్లుచున్నది. నెమలి పింఛముతోఁ గూడిన కిరీటమును శిరస్సుపై ధరించి, అంద మగు మెత్తని వస్త్రమును నడుమున బిగించి, చెవులలో పూల గుత్తుల నుంచుకొని, సువాసనలతోఁ గూడిన పుష్పములచే విలసిల్లు కేశములు గల గోప కన్యకల నడుమ వేణువును వాయించుచు,[186] వారిని మోహింపఁజేసి, వారి చేతులను తన

135. "This kuravai kuttu, We proced to identify, with Rasa krisa which is described in Bhagavata (x Ch 33 According to a d·seription in the silappadhikaram, the clebrated Tamil Classic of 2nd Century A. D., Seven or nine Cowher dessed engage in the each Joining her hands to those of Onother. This dance her hamds to those of Onother. This danced by Krishna with Cowhedesses."

– 'Krishna in early Tamil Leteratur' ! article by V R.R Dikshitar in 'Indian cultur' vol. IV.(37-38), pp. 267-70.

186. పెరుమాళ్ తిరు మొళి : 6-9

చేతులతోఁ దీసికొని[137] నృత్యముఁ గావించుచు,[138] వారిని ఆనందింపఁ జేయుచు,[139] కృష్ణుఁడు - నవ యౌవన లగు ఆ గోప కన్యలతో ఆడుచు పాడుచు, ప్రేమ ప్రవాహమును ప్రవహింపఁ జేసెను."[140]

## రాధా (నప్పిన్న) కృష్ణుల పరిణయ కలాపములు

మహా భారతము, హరి వంశము, బ్రహ్మ వైవర్తము, విష్ణు పురాణము మున్నగు ప్రాచీన సంస్కృత గ్రంథములలో - రాధ ప్రస్తావన కానరాదు. ప్రాచీన గ్రంథములలో-కృష్ణుని ప్రేమ లీలలు వర్ణింపఁబడినవి. గోపికల వర్ణన మున్నది. కాని, 'రాధ' ఎందును ఉల్లేఖింపఁబడలేదు. భాసుని నాటకములలో - కృష్ణుని ఘట్టములం దైనను 'రాధ' పేరు కానరాదు. భాగవత పురాణములో - కృష్ణ చరితమున, విశిష్టత గల ఒక గోపికను గుఱించి ప్రస్తావింపఁబడినది.[141] కాని, ఆ గోపిక పేరు 'రాధ' యని, స్పష్టముగా నుల్లేఖింపఁబడి యుండలేదు కాని, కాలక్రమమున ఆమెయే రాధ' యను పేర ప్రసిద్ధి పొంది యుండ వచ్చును.

ఈ రాధా వృత్తాంతము తొలుత హాలుని గాథా సప్త శతిలోఁ గానవచ్చును. అనంతర కాలములో వెలువడిన సంస్కృత వాఙ్మయము

---

137. తిరు వాయి మొళి : 4-2-2

138. తిరునెడు న్దాణకమ్ : 16

139. తిరు వాయి మొళి : 8-8-4

140. పెరియ తిరు మొళి : 3-8-8

141. "అనయాఽఽరాధితో నూనం భగవాన్ హరి రీశ్వరః
యన్నో విహాయ గోవిన్దః ప్రీతోయామనయద్రహః" (10-30-28)

నందు - రాధను గుఱించి విశేషముగా నుల్లేఖింపఁబడినది. అటు పిమ్మట, జయదేవుఁడు సంస్కృత భాషలో రచించిన 'గీత గోవిందము' నందు, రాధా కృష్ణుల ప్రణయ కలాపములను అత్యంత మనోహరముగ అభివర్ణించెను. అనంతరము - విద్యాపతి, చండీ దాసు, సూర దాసు మున్నగువారి కావ్యములు కేవలము రాధా పరములుగనే వెలసినవి. ఇందువలన, 'అసలు' ఈ రాధ ఎవరో మన మిపుడు తెలిసికొన వలసి యున్నది :-

పురుషుఁడు - పురుషోత్తముఁడు నగు మహా విష్ణువునకు శ్రీదేవి, భూ దేవి నీళా దేవి అను ముగ్వురు దేవేరులున్నట్లు వేద వాఙ్మయము నందును, ఆగమ శాస్త్రము లందును అభివర్ణింపఁ బడినది. మహా విష్ణువును 'పురుష సూక్తము' కీర్తించునట్లే, శ్రీ దేవిని 'శ్రీ సూక్తము', భూ దేవిని 'భూ సూక్తము' నీళా దేవిని 'నీళా సూక్తము' స్తుతించుచున్నవి. ఈ నీళా దేవియే కృష్ణావతారమున 'నప్పిన్న' యను పేర ప్రియురా లయ్యెను.

యశోదాదేవి సోదరుఁ డగు కుంభ గోపునకు - 'ధర్మ దేవత యను ధర్మ పత్ని యందు నీళా దేవి యంశతో నుద్భవించిన పుత్రికా రత్నమే ఈ నప్పిన్న. ఈమె వివాహార్థము స్వయంవర శుల్కముగా నేర్పరుపఁబడిన సప్త వృషభములను మర్దించి, కృష్ణుఁ డీమెను వివాహమాడెను. లోకోత్తర సౌందర్య రాశి యగు ఈ రమణీ మణియే కృష్ణుని దేవేరులలో ప్రధాన మహిషి, పట్టమహిషి. ఈ వృత్తాంతము భాగవతాదు లందును, నీళా సుందరీ పరిణయము నందును బహు భంగులుగా వర్ణింపఁబడినది.

సంస్కృత సాహిత్యమున వర్ణింపఁబడి, ఉత్తర దేశీయులచే ఆరాధింపఁబడి, దాక్షిణాత్యులచే ఆరాధింపఁబడుచున్న రాధయే తమిళ

సాహిత్యమున 'నప్పిన్న' అను పేర వర్ణింపఁబడినది. దక్షిణాత్యులచే 'నప్పిన్న పిరాట్టి'గా వ్యవహరింపఁబడుచున్నది [142]

ఈ నప్పిన్న - కృష్ణునకు ముఖ్య మైన ప్రియురాలుగా - శిలప్పధికారమ్, మణి మేఖలై, జీవక చింతామణి మున్నగు తమిళ గ్రంథము లందును, ఆళ్వారుల దివ్య ప్రబంధము లందును అభివర్ణింపఁబడినది ఆంద మైన కుంతలములు గల మయూర శరీరమువలె, నప్పిన్న శరీరము అతి సుకుమార మైనదని పెరియాళ్వారులు వర్ణించిరి. ఆండాళ్ కూడ, తిరుప్పావులో నొక పాశురమున తనను గోపికగాఁ దలచుకొని, ఇతర గోపికలను నిదుర మేల్కొలుపు సందర్భమున, కృష్ణునకు ముఖ్యమైన ప్రియురాలగు 'నప్పిన్న'ను ప్రస్తుతించి యున్నది.[143]

ఈ నప్పిన్న - అనంతర సంస్కృత సాహిత్యము నందును, మధ్యకాలీన మగు కృష్ణ భక్తి సాహిత్యము నందును 'రాధ' యను పేరవే వర్ణింపఁబడినది.

---

142. "We Venture to Conjector that Nappinni is the Tamil name of Radha."
- V. R. R. Dikshitar ; 'Indian Colture' Vol ; IV (37-38) pp. 1 26770.

143. "ముప్పత్తు మూవ రమరర్కు మున్ శెన్ఱు
కప్పమ్ తవిర్కుమ్ కలియే తుయిలెళాయ్
శెప్పముడైయాయ్ తిఱలుడయాయ్ శెత్తార్కు
వెప్పమ్ కొడుక్కుమ్ విమలా తుయిలెళాయ్
శెప్పన్నమెన్ ములై చ్చెవ్వాయ్ చ్చిఱుమరుఙ్గుల్
నప్పిన్నై నఙ్గాయ్ తిరువే తుయిలెళాయ్
ఉక్కముమ్ తట్టొళియమ్ తన్దు ఉన్ మణాళనై
ఇప్పోదే యెమ్మై నీరాట్టేలో రెమ్బావాయ్."
- తిరుప్పావు : 20

## భ్రమర గీతములు
### (ఆళ్వారుల భ్రమర సందేశము)

దివ్య ప్రబంధములలో - కృష్ణ వియోగము వలన పరితపించు నాయిక, కృష్ణుని కడకు సందేశమునుఁ బంపు ఘట్టము లనేకము లున్నవి. నాయిక - నాయకుని రాకకు నిరీక్షించి వ్యర్థ మైనపుడు, ఆ నాయక - మేఘము మొదలగు అచేతనములకును తన స్థితి గతులను చెప్పి, దయా రహితుఁ డగు ప్రియుని కడకు సందేశమునుఁ గొని పోవలసిన దని వేడుకొనును. వీనిలో - భ్రమర సందేశ ఘట్టములను తిరుమంగై యాళ్వారులు, నమ్మాళ్వారులు వర్ణించిరి [144]

ఈ ఘట్టములలో - ప్రేమ పీడిత యగు నాయిక (గోపిక), నిర్దయుఁ డగు నాయకుని (కృష్ణుని) కడకు సందేశముఁ బంపును ఈ సందేశము నందు నాయిక యొక్క దుర్దశ హృదయ విదారకముగా నుండును. నాయకుని నిర్దయత్వముతో గూడి యుండును. ఇట్టి ఘట్టముల ననుసరించి తర్వాత కవులు 'భ్రమర గీత' లను పేర కావ్యములను విరివిగా రచించిరి

పై యంశములనుఁ బట్టి, ఆళ్వారులకు శ్రీ రామ కృష్ణావ తారము లందు ప్రగాఢముగాఁ గల భక్తి భావము స్పష్ట మగును.

—*—

144. పెరియ తిరు మొళి : 9-6-1 నుండి 10 వఱకు 8-4-1నుండి 10 వఱకు; మరియు - తిరు విరుత్తమ్ : 54.

# ఆముక్త మాల్యదా సౌరభము

'విద్యా భూషణ - విద్యా రత్న'

శ్రీమాన్ ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు, ఎం.ఏ; ఏ.యి.యస్.



"శ్రీ కమనీయహారమణిఁ జెన్నుఁగ దానను గౌస్తుభంబునం
దా కమలా వధూటియు నుదారత దోపఁ బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతు లచ్యుతుఁ బైకి దోప న
స్తోకత నందుఁ దోచె నన శోభిలు వేంకట భర్త గొల్చెదన్."

## ఆముక్త మాల్యద - కథా శరీరము
## అంగ ప్రత్యంగ సూచిక


| | | వేదము వారి ప్రతి పద్య | పుట |
|---|---|---|---|
| ప్రథమాశ్వాసము :- | | | |
| 1. | ఇష్ట దేవతా స్తుతి - శ్రీ వేంకటేశ్వరస్వామి | ౧ | 1 |
| | ౧ ఆది శేషుఁడు ౨. గరుడుఁడు | ౨-౩ | 3-5 |
| | ౩ విష్వక్సేనుఁడు | ౪ | 60 |
| | ౪. పాంచజన్యము | ౫ | 7 |
| | ౫ నందకము (ఖడ్గము) | ౬ | 8 |
| | ౬. కౌమోదకి (గద) | ౭ | 9 |
| | ౭. శార్ఙ్గము (ధనుస్సు) | ౮ | 1 |
| | ౮. సుదర్శనము (చక్రము) | ౮ | 12 |
| 2. | ద్వాదశ దివ్య సూరులు | ౧౦ | 13 |
| 3 | శ్రీకాకుళాంధ్ర విష్ణు దర్శనము - రాయల స్వప్న వృత్తాంతము | ౧౧-౧౭ | 14-23 |
| 4. | స్వప్న ఫల వ్యాఖ్య | ౧౬ | 23 |
| 5. | కృష్ణదేవరాయల వంశ వర్ణనము | ౧౯-౪౪ | 25-49 |

6. షష్ఠ్యంతములు ౪౭-౪౯ 50-51

7. కథా ప్రారంభము - శ్రీ విలుబుత్తూరు ప్రశంస ౫౦ 52

8 భాగవతులు - విష్ణుచిత్తులు ౫౧-౮౭ 7-86

9. అశ్వాసాంత పద్యములు ; ౮౮-౮౯ 86-90

పద్యములు 84

గద్యములు 5

మొత్తము 89

ద్వితీయాశ్వాసము :- పద్య పుట

1. దక్షిణ మధురా నగర వర్ణనము ౩-౩౮ 91-138

పుష్ప లావికలు ౧౯-౨౨ 109-115

పణ్య యువతులు ౩౦-౩౧ 125-27

2. మత్స్య ధ్వజ పాండ్య ప్రభువు ౩౯-౪౪ 37-44

3. గ్రీష్మ ఋతు వర్ణనము ౪౫-౭౦ 144-73

4. వైదేశిక బ్రాహ్మణుఁడు ౭౧-౭౪ 173-75

5. మత్స్య ధ్వజుఁడు (వల్లభ దేవుడు) భోజుని కడ కేగుట ౭౫ 175

6. ప్రభువునకు విషయ వైముఖ్యము కలుగుట ౭౬-౮౪ 176-81

7. మోక్ష ప్రదుఁ డెవఁ డని నిర్ణయింప విద్యా శుల్కము కట్టుట ౮౫-౮౭ 181-82

8. విష్ణుచిత్తుని మధురా నగర శాస్త్ర చర్చలందుఁ బాల్గొని, నారాయణ పారమ్యమును సిద్ధాంతీకరింపు మని మన్నారు దేవుఁ డాదేశించుట ౭౮-౮౮ 182-83

9. విష్ణుచిత్తుఁడు తన యశక్తినిఁ దెలుప, మన్నారు దేవుఁ డాతని ననుగ్రహించి, మధుర కంపుట ౮౯-౯౭ 183-88

10. ఆశ్వాసాంతము ౯౮ 189-91

పద్యములు 99
గద్యములు 2

మొత్తము 101

తృతీయాశ్వాసము :-

| | పద్య | పుట |
|---|---|---|
| 1. విష్ణుచిత్తుల - రాజ సభా ప్రవేశము | ౩-౪ | 193-94 |
| 2. విష్ణుచిత్తుల - పర మత ఖండనము | ౫-౮ | 195-203 |
| 3. స్వ మత స్థాపనము | ౯-౧౭ | 203-10 |
| 4. ఖాండిక్య కేశిధ్వజ సంవాదము | ౧౮-౮౯ | 210-60 |
| 5. ఆశ్వాసాంతము | ౯౦-౯౩ | 261-64 |

పద్యములు 84
గద్యములు 9

మొత్తము 93

తురీయాశ్వాసము :-


| | | పద్య | పుట |
|---|---|---|---|
| 1. | విష్ణుచిత్తుని యఖండ విజయము | ౩_౯ | 266_73 |
| 2. | శ్రీ మహా విష్ణువు విష్ణుచిత్తునికి సాక్షాత్కరించుట | ౧౦ | 273 - |
| 3. | భక్తిచే మైమఱచి, విష్ణుచిత్తుఁడు శ్రీ మహావిష్ణువును స్తుతించుట | ౧౬ | 279 |
| 4. | దశావతార స్తవము | ౧౭_౩౧ | 280_98 |
| | ౧. మత్స్య కూర్మావతారములు | ౧౭_౨౦ | 280_84 |
| | ౨ వరాహ - నృసింహ - వామనావతారములు | ౨౧_౨౪ | 284_87 |
| | ౩ పరశురామ - రఘురామ - బలరామావతారములు | ౨౫_౨౭ | 287_93 |
| | ౪. కృష్ణ - బౌద్ధ - కల్క్యవతారములు | ౨౮_౩౧ | 294_98 |
| 5. | విష్ణుచిత్తులు శ్రీ విల్లిబుత్తూరునఁ బ్రవేశించుట | ౩౨_౩౮ | 298_312 |
| 6. | యామునాచార్యోదంతము | ౩౯_౫౩ | 313_508 |
| 7. | యామునాచార్యులు పాండ్య సభ కరిగి, (విద్వజ్జన కోలాహలాది) మహా శైవ పండితుల మతమును ఖండించి, స్వ మత స్థాపన మొనర్చుట | ౫౪ | - 35 |
| 8. | యామునాచార్యులు రాజ భగినిని పరిణయము చేసికొని, అర్థ రాజ్యమునకు ప్రభు వగుట | ౫౫ | 335 |
| 9. | వర్షాకాల వర్ణనము | ౫౬_౧౩౬ | 336_401 |

10. శరదృతు వర్ణనము ౧౩౩_౮౩ 401_45

11. యువరాజగు యామునాచార్యుల దిగ్విజయము ౧౮౪ 445_

12. యామునాచార్యులకు, తత్పితామహుని ప్రశిష్యుఁ డగు శ్రీరామమిశ్రుల వల్ల జ్ఞానోదయ మగుట ౧౮౮_౨౦౨ 448_57

13. యామున ముని తురీయాశ్రమమును స్వీకరింప నెంచి, కుమారునకు రాజనీతిని గఱపుట ౨౦౪_౨౮౫ 457_508

14. ఆశ్వాసోపసంహారము ౨౮౬_౮౯ 508_12

పద్యములు 265

గద్యములు 24

2 9


పంచమాశ్వాసము :_


| | పద్య | పుట |
|---|---|---|
| 1. గోదాదేవి జననము | ౩_౬ | 515_17 |
| 2. యౌవనోదయము _ సౌందర్య లావణ్యాదిక వర్ణన | ౭_౩౬ | 517_36 |
| 3. పూర్వ జన్మ వయస్య లగు నాగ కన్యలు గోదాదేవి కిరుగుపొరుగుల జనించి, యామెకు చెలికత్తె లగుట | ౩౭ | 536_37 |

4. జనకుఁడు వటపత్రశాయికిఁ గట్టిన
పుష్ప మాలికను గోదాదేవి రహస్యముగా
ధరించి, తిరిగి పూల సెజ్జలో బెట్టుచుండుట ౩౭ 537

5. అముక్త మాల్యదా విరహ వేదన ౩౯ 539

6. విష్ణుని వివిధావతారముల నామె
యుపాలంభించుట ౪౧-౫౪ 540-50

7. విరహ కృశ యగు గోదాదేవికిని,
వయస్యలకును జరిగిన సంభాషణ ౫౬-౬౫ 551-57

8. గోదాదేవి రాధా కృష్ణాదుల
నుపాలంభించుట ౬౭.౭౦ 558-61

9. గోదాదేవి వయస్యల పున స్సంభాషణ ౭౧-౭౩ 561-62

10. గోదాదేవి తన పూర్వ జన్మ కథను
చెలికత్తెల వలన నెఱుఁగుట ౭౪-౭౫ 562-63

11. పూర్వ జన్మ స్మృతి వలన దుర్భర వివశ
యైన యామెకు చెలులు శైత్యోపచారము
లొనరించుట ౭౬ -౭౭ 564-65

12. స్మృతి రాఁగా, చెలికత్తెల నామె - మీ
రెవ రని యడుగ, వారు - తాము
నాగకన్యకల మని చెప్పుట ౭౮-౭౯ 565

13. తిరిగి యామె వివిధ మదనావస్థలకు లో
నయి, ప్రాణ త్యాగ మొనరింపఁ బోవ,
చెలు లోదార్చుట ౮౦-౮౩ 565-68

14. తిరిగి యామె విరహిణి యగుట
శైత్యోపచారము లామె తాపమును
మఱింత తీవ్ర మొనర్చుట ౫౬౮-౭౧ 568-71

15. అండా ళనుదినము వేకువనే స్నానా
ద్యనంతర మలంకరించుకొని, తానే
స్వయముగా గుచ్చిన యెత్తు కలువ
పూల దండను, పూజా ద్రవ్యములను
గొని, దేవాలయమున కరిగి, ధూప
దీపాదులతో వటపత్రశాయి నర్చించి,
పుష్పమాలిక నర్పించి,ఫల తాంబూలముల
నివేదించి, గర్భాలయ ప్రదక్షిణము చేసి,
తీర్థ శఠకోప నిర్మాల్యముల స్వీకరించి,
భగవద్గుణ వైభవమును ద్రావిడ పద్యములతో
కీర్తించు చుండుట ౫౭ 571-76

16 వసంత ఋతు వర్ణనము - గోదాదేవి
విరహ వేదన - భగవ ద్గుణానుసంధానము ౯౬ 576

17 మదన తాప మెఱుఁగని విష్ణుచిత్తుఁడు, తన
తనయ వింత తప మొనరించుచున్న దని
భయపడి, వటపత్ర శాయికి నివేదించుట ౧౨౯-౩౦ 629-30

18. ఆశ్వాసోపసంహారము ౧౩౧-౬౧ 631-32

పద్యములు 151
గద్యములు 10
——
మొత్తము 161
——

షష్ఠాశ్వాసము :-

| | | పద్య | పుట |
|---|---|---|---|
| 1. | మాల దాసరి, కుంభజాను వను బ్రహ్మ రాక్షసుల యుప కథ | ౩-౬౫ | 633-70 |
| 2. | లక్ష్మణ యోగి (= రామానుజులు), పూర్ణాచార్యులు (= పెరియనంబి), సుందర జామాత (= వరవర ముని - లేక, మణవాళ మహా ముని), శఠకోప సూరి, వేంకటేశ మనీషి (= వేదాంత దేశికులు) అను మహనీయుల ప్రశంస | ౬౬ | 670 |
| 3. | ఆశ్వాసాంతము | ౬౭-౭౦ | 672-74 |

| | |
|---|---|
| పద్యములు | 61 |
| గద్యములు | 9 |
| మొత్తము | 70 |

సప్తమాశ్వాసము :-

| | | పద్య | పుట |
|---|---|---|---|
| 1. | బ్రహ్మ రాక్షసుని (= సోమ శర్మ) పూర్వ జన్మ కథ | ౩-౨౨ | 675-692 |
| 2. | భాగవత సంసర్గ మహత్త్వమున బ్రహ్మ రాక్షసునకు బ్రహ్మణ్యమే కాక, భాగవత శ్రీయును కలిగి, సోమ శర్మ యను వైష్ణవుడుగా మారుట | ౨౩-౨౮ | 693 |

| | | | |
|---|---|---|---|
| 3. | గోదాదేవి శ్రీరంగనాథ సేవార్థమై విష్ణుచిత్తుఁడు బంగరు పల్లకిలో శ్రీ రంగమునకుఁ గొనిపోవుట | ౨౩ | 695-699 |
| 4 | వారు శ్రీరంగ నాథుని సేవించుట | ౩౨-౩౯ | 700-708 |
| 5. | రంగ నాథుఁడు గోదాదేవిని సాభిప్రాయముగాఁ జూచి మెచ్చుకొనుట | ౪౦-౪౧ | 708 |
| 6. | గోదాదేవిని రంగనాథుఁడు తనయందైక్యము చేసికొని, యామె స్థానమున మాయా వధూటిని సృష్టించుట | ౪౨-౪౩ | 709 |
| 7. | తనయను గానక, విష్ణుచిత్తుఁడు విలపించి, రంగనాధుని నిందించుట | ౪౩-౪౭ | 710-712 |
| 8. | విష్ణుచిత్తుని యమాయకత్వమునకు నవ్వుకొనుచు, రంగనాథుఁడు సమాధానమొసఁగుట | ౪౮-౫౦ | 712-813 |
| 9. | రంగనాథుఁడు బ్రహ్మ రుద్రాదులను విష్ణుచిత్తుని కడకు పెండ్లి రాయబారమున కంపుట | ౫౨-౫౩ | 711 |
| 10. | గోదాదేవి రంగనాథుల కల్యాణము | ౫౪-౬౧ | 714-723 |
| 11. | ఆశ్వాసాంతము - ప్రబంధోపసంహారము | ౬౨-౬౫ | 721-723 |


| | | | |
|---|---|---|---|
| పద్యములు | 61 | (7 ఆశ్వాసములకు) మొత్తము పద్యములు | 805 |
| గద్యములు | 14 | గద్యములు | 73 |
| మొత్తము | 75 | వెరశి మొత్తము | 878 |

## ఆంధ్ర సారస్వతము - ప్రబంధావతరణము

ఇంచు మించుగా సహస్ర వర్ష జీవి యగు ఆంధ్ర సాహిత్య కల్ప ద్రుమము ప్రాఙ్నన్నయ యుగమున నంకురించి, నన్నయాదుల దోహదమున పురాణేతిహాసము లగు భారత భాగవత రామాయణాదుల రూపమున చిగిర్చి, పుష్పించి, ప్రబంధ రూపమున పరిణత ఫలమున నందినది. పురాణేతిహాసములు కథా కథన ప్రధానములు. వీని యందు ప్రముఖముగా ధర్మ బోధయు, హితోపదేశము, కర్మ జ్ఞాన భక్తి వైరాగ్యాదిక విచారణయు, అందుల కుపకరించు ఆఖ్యానోపాఖ్యాన ప్రాచుర్యమే కాన నగును గాని, కవితా శిల్పాదు లిం దతి విరళములు. పురాణేతిహాసముల యందు బీజ ప్రాయముగ నున్న పద్య రచనా నైపుణి, రసాలంకార విశేషములు, వ్యంగ్య వైభవము, కావ్య శిల్పము, ఔచిత్య స్ఫూర్తి, కవితా చమత్కారములు, కావ్య గుణము లను క్రమముగా ప్రబంధ రూపమున పరిణతి నందినవి. వాల్మీకి రామాయణ మాపాద చూడము ఛందో బద్ధమై, పాఠ్య గేయ మధుర మైనది. సంస్కృత మహా కావ్యముల కిది యొరవడి యగుటచే, సర్గ బంధము లగు మహా కావ్యము లామూలాగ్రము పద్య మయములు. కాదంబరీ హర్ష చరితాదులందు కృత్యాదిని, కథా శరీరమునను ఎడ నెడ శ్లోకము లున్నను, పద్య వైరళ్యముఁ బట్టి, వీనిని మహా కావ్యము లందుఁ జేర్పక, కథాఖ్యాయిక లని, గద్య కావ్యములుగనే పండిత మండలి నిర్ణయించినది. సంస్కృత మహా కావ్యమే ఆంధ్రమున ప్రబంధ రూపమున నవతరించినది. చక్కఁగాఁ గూర్పఁబడిన (ప్రబద్ధమైన) గ్రంథమే ప్రబంధము. ఇది కేవల కల్పనాత్మకము - ఇతి వృత్త ప్రధానము గాక, వర్ణనా ప్రధానము మహా కావ్యమున 18 వర్ణన లుండ, ఇర దభివర్ణనలు 22 కేవల కల్పనా కథలు కృత్రిమ రత్నము లని యెంచి, ఆంధ్ర కవులు సానఁ దీరిన జాతి

రత్నము లగు 'సత్కవి కల్పనా విశేషావహ పూర్వ వృత్తముల'నే గ్రహించి, ప్రబంధముల రచింపఁ జొచ్చిరి నన్నయ తిక్కన రచన లలో - బీజ ప్రాయములుగా నున్న ప్రబంధ సామాన్య లక్షణము లెఱ్ఱన కృతు లగు హరివంశ - నృసింహ పురాణాదులలో ప్రస్ఫుటము లగుటచే, ఈయన ప్రబంధ పరమేశ్వరుఁ డను బిరుదము నందెను. నాచన సోముని 'ఉత్తర హరి వంశము', నన్నెచోడుని 'కుమార సంభవము', శ్రీనాథుని రచనలు, అందు ముఖ్యముగా - 'శృంగార నైషధము' - వీని యందు ప్రబంధ లక్షణములు మఱింత ప్రస్ఫుటము లైనవి. శృంగార నైషధము నొరవడిగాఁ గొని, పెద్దన మను చరిత్రమును రచించెను. సంస్కృతమున మహా కావ్య మంతయు శ్లోక బద్ధ మైనను, దాని ననుసరించిన యాంధ్ర ప్రబంధములు మాత్రము గద్య పద్య మయములుగా రచింపఁబడుచుండెను. ఆంధ్ర వాఙ్మయము గద్య పద్యాత్మకముగా నుదయించె ననఁదగును. చంపూ ప్రబంధముల యెడఁ గల యాదరము తెనుఁగు కవులకు కేవల పద్య కావ్యముల యెడఁ గన్పట్టదు.

## ఆంధ్ర కావ్య పంచకము - ఆముక్త మాల్యద

గీర్వాణ వాఙ్మయ తరంగిణిలో నవగాహ మొనరించుటకు పంచ కావ్యము లను నైదు రేవులను కొన్ని శతాబ్దముల క్రిందటనే నిర్ణ యించిరి. సాహిత్య మహా నదిలో ప్రవేశించి, విహరించుట కొన్ని వందల యేండ్ల నుండి యాచారముగా నున్నది ఇట్లు పాఠ ప్రవచన మున నున్నవి కాళి దాస కావ్య త్రయము - రఘువంశ, కుమార సంభవ, మేఘ సందేశములు, భత్రి భారవి కృత కిరాతార్జునీయము, ఘంటా మాఘుని శిశుపాల వధ. కాళి దాస కావ్య త్రయమునకు 'కాళి దాస త్రియ' మనియు వ్యవహారము గలదు. ఈ మూఁడు కావ్యములకు 'లఘు త్రియి' యనియు, కిరాతార్జునీయము, శిశుపాల వధ, శ్రీహర్షుని నైషధీయ చరితములకు 'బృహత్ త్రియి' యనియు

బంగాళా దేశమున వ్యవహార మఁట. బహుశః, ఆ ప్రాంతములలో పంచ కావ్యములు గాక, షట్కావ్యములు పఠన పాఠనముల నుండుట సంప్రదాయము కావచ్చును. ఆంధ్ర దేశమునఁ గూడ, మేఘ సందేశమును వదలి వేసి, తక్కిన కాళి దాస కావ్యములు రెండును, భారవి, మాఘ, శ్రీహర్షుల కృతులు మూఁడును కొన్ని ప్రాంతములలో పంచ కావ్యములుగా నెన్నఁబడుచుండును. అందువలననే, వ్యాఖ్యాతృ చక్రవర్తి యగు మల్లినాథ సూరి – యీ కావ్య షట్కమునకు చక్కని వ్యాఖ్యల రచించెను.

సంస్కృత సంప్రదాయము ననుసరించి, తెనుఁగునను పంచ కావ్య వ్యవస్థ యేర్పడెను. ఈ నియమము రామ రాజ భూషణ – పింగళి సూరనలకుఁ బిమ్మట వచ్చియుండును. ఆంధ్ర పంచ కావ్యములు – పెద్దన మను చరిత్రము, రామ రాజ భూషణుని వసు చరిత్ర, పింగళి సూరన కృత రాఘవ పాండవీయము, శ్రీనాథుని శృంగార నైషధము, కృష్ణ దేవరాయల 'అముక్తమాల్యద (=విష్ణు చిత్తీయము). ఉత్తరోత్తర ప్రౌఢత్వమునుఁ బట్టి, యివి యీ క్రమముననే సాధారణముగ పఠింపఁబడుచుండెను సంస్కృతమున 'బాణుని కాదంబరీ హర్ష చరిత్రములు', సోమదేవ కవి 'యశ స్తిలక చంపువు', మురారి రచించిన 'అనర్ఘ రాఘవ 'నాటకము, శ్రీహర్షుని 'నైషధీయ చరితము'ను, మహా ప్రౌఢ కావ్యములై, శాస్త్రీయ విజ్ఞాన సంప్రదాయములకు, భారతీయ సంస్కృతికిని నిధులుగాఁ బేర్కొనఁబడును. మాఘుని శిశుపాల వధ యందు నవ సర్గములను పఠించినవాని కిఁక నవ శబ్దమే యుండ దని ప్రతీతి. అట్లే, 'అముక్త మాల్యద'యు – ప్రౌఢత్వమున ఆంధ్ర కావ్య పంచకమున మిన్న; వేదాంతాది శాస్త్ర సంప్రదాయము లకు గని. ఆంధ్ర సంస్కృతియు, తాత్కాలిక సహజ పరిస్థితులును ఇందు చక్కగా చిత్రింపఁబడెను. మాఘ మురారులకు సంస్కృత పద

జాల మంతయు జిహ్వాగ్రమున నుండె, ననిపించును. రాయల కన్ననో - ఆంధ్ర కర్ణాట ద్రావిడ భాషల యందలి శబ్ద జాలము నందును, సంస్కృత ప్రాకృత శబ్ద జాలము నందును కూలంకష వైదుష్య మున్నట్లు స్ఫుటముగాఁ గన్పట్టును. మొత్తము మీఁద ఆముక్తమున కవితా వైభవాదుల కంటె, వైదుషీ వైభవము హెచ్చుగా గోచరించును. స్వయముగా విద్వత్కవియు - బహు భాషా వేత్తయు నగుటయే కాక, బహు శాస్త్ర కోవిదుల తోడను, వివిధ భాషల యందు నిష్ణాతులైన విద్వత్కవుల తోడను నిరంతర విద్యా గోష్ఠియే దీనికి కారణము కావచ్చును

## రాయల కృతులు

బహు శాస్త్ర వేత్తయు - బహు భాషా పండితుఁడు నగు రాయలు సంస్కృతాంధ్ర భాషల రెంటను ప్రచండ కవి. 'ఆముక్తము' నందలి 'పలికి తుత్ప్రేక్షోపములు' (1-13) అను పద్యమునుఁ బట్టి, రాయలు సంస్కృతమున -

౧. జ్ఞాన చింతామణి   ౪. సకల కథా సార సంగ్రహము

౨. మదాలస చరిత్రము   ౫. సత్యా వధూ ప్రీణనము

౩. రస మంజరి   (లేక - సత్యభామా సాంత్వనము)

ఇంక నే వేవియో మధుర కావ్యములు రచించి, సహృదయుల మెప్పు నందినట్లు తెలియుచున్నది. పై కృతు లన్నియు నుత్సన్నము లగుట మన యభాగ్యము. పై రస మంజరి - సాహిత్య విచారక మగు కృతియో, కావ్యమో తెలియదు. రాయల యాస్థానమునకుఁ జెందిన విద్వత్కవి యని దృఢముగా విశ్వసింపఁ దగిన మైథిల దేశ వాసి యగు భానుకరుఁడు రచించిన 'రస మంజరి' యను సాహిత్య

గ్రంథము - భారత వర్షమునం దంతటను ప్రచుర ప్రచారమున నున్నది. బహుశః రాయల ప్రోత్సాహము వల్లనే భాను కవి[1] రస మంజరిని నిర్మించెనేమో !

రాయలు అముక్తమును రచించిన పిమ్మట, 'జాంబవతీపరిణయ మను నాటకమును రచించెను. అయిదంకములు గల యీ రూపక మున - స్యమంతక మణి వృత్తాంతము, జాంబవంతుని తనయ యగు జాంబవతిని కృష్ణుఁడు పరిణయ మాడుట చిత్రింపఁబడెను దీని కేకైక మాతృక - తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయమునఁ గలదు. దీనికి ప్రతికలు - ఆంధ్ర సాహిత్య పరిషత్తు నందు (కాకినాడ), శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య గవేషణాలయమునను (తిరుపతి) గలవు.

రాయలు - ఉషానిరుద్ధుల వివాహమునుఁ గూడ, 'ఉషా, పరిణయ' మను నాటకమున చిత్రించెను ఈ కృతి రత్నము కూడ సూర్యాలోక భాగ్యము నందలేదు. దీని ప్రతి వనపర్తి సంస్థానమునఁ గలదఁట. మనోహర మగు ఈ యితివృత్తమును గైకొని, సంస్కృత కవు లనేకులు - అనేక కృతులు రచించిరి

ఎన్నో సంస్కృత కావ్య నాటకములు రచించిన రాయలు - ఆంధ్ర విష్ణు ప్రోత్సాహమునను, ఉద్బోధమునను ఆంధ్రమున అముక్తమాల్యద'ను రచించెను సంస్కృత సారస్వత సాగరమున విహరించిన మాత్రమున నెవరికిని, ఆంధ్ర వాఙ్మయ తరంగిణిలో చక్కగా ఈదు లాడనిచో - ఆంధ్ర ప్రబంధ నిర్మాణ కౌశల మలవడదు కావునఁ

---

1) 'భానుకరుఁడు - శ్రీకృష్ణదేవరాయలు' (ఈ. వేం. పి. రాఘవాచార్యులు) 'భారతి' ఫిబ్రవరి 1952 (పుటలు ; 141 - 44)

భానుకరుఁడే గాక, రాయల యాస్థానమునందలి సంస్కృత కవి - దివాకరుడును రస మంజరి' యను కృతిని రచించెను.

అప్పటికే రాయ లాంధ్ర భాషా వాఙ్మయములందు కఠోర వ్యాసంగ మొనరించి యుండుటచే, భగవ దాజ్ఞను మాలికను వలె తల దాల్చి, వెంటనే ఆముక్త మాల్యదను రచింప నుపక్రమించెను. రాయలు సంస్కృతమున రచించిన కావ్య షట్కమున, త్రుటిత మగు జాంబవతీ పరిణయమును, ఆంధ్రమున నిర్మించిన 'ఆముక్త మాల్యదయు' మాత్రమే మనకు దక్కినవి.

## రాయల బిరుదములు - శేముషీ వైదుష్యములు

'భూపాల మౌళి రంజితాంఘ్రి ద్వయాంబుజుఁడు'ను, దక్షిణ భారత చక్రవర్తియు నగు రాయలకు - ఈ క్రింది బిరుదము లున్నట్లు శాసనములనుఁబట్టి తెలియుచున్నది.

'మహా రాజాధిరాజ - రాజ పరమేశ్వర - శ్రీ వీర ప్రతాప - పరిభూత సురత్రాణ - యవన రాజ్య స్థాపనాచార్య - మూరు రాయర గండ - అరి రాయ విభాండ - అష్ట దిక్కు రాయ మనో భయంకర - భాషగె తప్పువ రాయర గండ -పూర్వ దక్షిణ పశ్చిమ సముద్రాధీశ్వర' శ్రీకృష్ణదేవరాయలు. వీనివి బట్టి, రాయల ప్రతాపములు సామ్రాజ్య విస్తృతి వైభవాదులు తెలియుచున్నవి.

ఇఁక రాయల వైదుషీ గరిమను గూర్చి యాలోచించిన, ఈ మహనీయునకు - శ్రుతి స్మృత్యుపనిషత్తులు, భాష్య సహిత ప్రస్థాన త్రియము, నాలాయిర మను దివ్య ప్రబంధము, సర్వ దర్శన సార సంగ్రహము, భగవ ద్రామానుజాచార్యాది వైష్ణవ పూర్వాచార్యుల గ్రంథములు, పురాణేతిహాసములు, జ్యోతి స్సంగీత వైద్య రాజనీతి శాస్త్రములు, కాళిదాస భవభూతుల - మాఘ భారవుల - హర్ష భట్టి బాణాది పూర్వ కవుల సంస్కృత కావ్య నాటకములు - ఇత్యాది పూర్వ

వాఙ్మయమున కూలంకష వైదుష్య మున్నట్లు ఆయన ప్రబంధమును బట్టి విదిత మగును. సర్వతోముఖమ, తల స్పర్శము నగు నింతటి పాండిత్యము - రమారమి నలువదేండ్లు జీవించిన రాయల కెట్లు సంక్రమించినదా యని మన కాశ్చర్యము కలుగవచ్చును. సాంద్ర శాస్త్రారణ్యములఁ జొచ్చుకొనిపోవు నిశిత ధిషణా పాటవము గల రాయలు - గురు కుల వాసమునను, నిరంతర గ్రంథ వ్యాసంగము వల్లను బడసిన వైదుష్యము, నిరంతర కవితా వినోదములఁ బట్టియు నిగ్గుతేరి యుండును. ప్రాగ్జన్మ సంస్కారము కూడ దీని కెంతో తోడ్పడి యుండును.

## రాయల విద్వత్కవి పోషణము - అష్ట దిగ్గజములు

మహా రాజుల కీర్తియు, మహా కవి కోవిదుల యశస్సును పరస్పరాశ్రితములు. తాను బడసిన యఖండ దిగ్విజయముల కంటె నిరంతర విద్వత్కవి పోషణము వల్లనే రాయలకు అజరామర మగు కీర్తి లభించెను. దీనికి తోడు, రాయలు స్వయముగా మహా కవి, మహా పండితుఁడు, బహు భాషా వేత్త.

"కవినా చ విభు ర్విభునా చ కవిః
కవినా విభునా చ విభాతి సభా
మణినా వలయం వలయేన మణి
ర్మణినా వలయేన విభాతి కరః."

ఇత్యాది విషయము లన్నియు నెఱిఁగిన రాయలు - విద్వత్కవి కోకిల కల్పద్రుమమై విఖ్యాతి నందెను విద్వాంసులకు, కవులకు సన్మాన సమయమున రాయల చేతి కెముక లే దఁట. ఆయన వితరణము - ఏనుఁగు పాడి యఁట.

రాయల యాస్థానమునకు 'భువన విజయ'మని పేరు. ఆస్థానము నందలి విద్వత్కవులలో నుద్దండుల నెనమండుగుర నెంచి, వారిని రాయలు - అష్టదిగ్గజ బిరుదముతో వ్యవహరించుచుండెడివాఁడు. ఈ యష్టదిగ్గజములలోఁ జేరినవా రెవరు? వీ రందఱును తెలుఁగు కవులా? లేక, ఆంధ్ర కర్ణాట ద్రావిడ కవులా యన్నది క్లిష్ట సమస్య. రాయలు కడప మండలము నందలి 'తిప్పలూరు' అను గ్రామమును సర్వాగ్రహారముగ 'అష్టదిగ్గజ కవీశ్వరు'లకు దానము చేసినట్లు, క్రీ:శ: 1528 వత్సరమునకుఁ జెందిన తిప్పలూరి శాసనమునఁ గలదు. మఱియు, మైసూరు ప్రాంతమున 'నంది దుర్గ'లో - సోమేశ్వరాలయము నందలి యీ క్రింది శ్లోకమును శ్రీ ప్రభాకర శాస్త్రిగారు ప్రచురించిరి.

"య త్కీర్తి ర్భువనైక భూషణ మభూ ద్యస్య ప్రసాదా న్నరా
స్సర్వే రాజ సమానతా మవగతాః సంప్రాప్య విత్తం బహు
యస్యాష్టౌ కవి దిగ్గజాః పృధు యశో భారా జగ ద్భోభనా
య ద్దానోదక సామ్య శ్చైవ పరితా మాపేతు శీతాచలమ్.2"

ఈ యష్టదిగ్గజ సంప్రదాయము కృష్ణరాయల కాలము నుండియు వ్యాప్తికి వచ్చిన దనియు, గోల్కొండ నవాబుల యేలుబడిలో నున్న సంస్థానములలో అష్టదిగ్గజ కవు లుండెడి వా రనియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు - 'అష్టదిగ్గజము' లను వ్యాసమున వ్రాసి, పెద్దాపుర సంస్థానము నందును, కార్వేటి నగర సంస్థానము

---

2. శ్రీ ప్రభాకర శాస్త్రిగారీ శాసనమును ముక్త్యాలనుండి ప్రకటింపఁబడు 'సరస్వతి' యను మాస పత్రికయందు (1 సంపుటము, 8 సంచిక, ౦ పుట) 1923 - ప్రకటించిరి. ఈ శాసనము తిరిగి శ్రీ టి. యల్. కాంతారావు గారిచే పరిష్కృతమై ప్రకటింపఁబడినది.

నందును కొంత కాలము క్రిందట విలసిల్లిన అష్ట దిగ్గజముల సూచిక లొసఁగినారు. కాని, రాయల కాలము నుండియు అష్ట దిగ్గజ సంప్రదాయము వ్యాప్తమైన దను వేంకటరావుగారి యభిప్రాయము సరియైనది కాదు. ఇంతకు పూర్వ కాలముల యందలి సాహిత్య చరితములను పరిశీలించిన, ఈ యంశము విశద మగును.

దాక్షిణాత్య పూర్వాచార్యు లగు మణవాళ మహాముని (= వరవరముని = రమ్యజామాతృ ముని = సౌమ్యజా మాతృ ముని) శక : ౧౨౯౩ (= క్రీ: శ: 1370) వత్సరమున నవతరించి, శక: ౧౩౩౬ (క్రీ: శ: 1414) తో పరమపదించిరి. వీరికి పరశ్శత శిష్యులు గలరు. అందు దిగువ క్రింది విద్వాంసులు అష్ట దిగ్గజము లని ప్రఖ్యాతి నందిరి.

౧. అప్పిళ్ళాన్
౨. అప్పిళ్ళై (యతిరాజ వింశతికి 5 తిరువన్తాదుల వ్యాఖ్యాత)
౩. ఎరుంబి యప్పా (సంస్కృత విద్వత్ ప్రకాండుఁడు. వరవర ముని దిన చర్యా - శతకముల రచయిత)
౪. కోయిల్ - కందాడై - అణ్ణన్
౫. తిరువేంగడ జీయర్
౬. పత్తంగి - పరవస్తు - పట్టరపిరాన్ జీయర్ (అన్తిమోపాయ నిష్ఠపై వ్యాఖ్యాన కర్త)
౭ ప్రతివాది భయంకర అణ్ణన్ (అష్టశ్లోకి వ్యాఖ్యాత - కాంచీ పురము)
౮ వానమామలై జీయర్ (వానమామల మఠ ప్రతిష్ఠాపకుఁడు)

ఇంకను వరవర ముని గోష్ఠిలో తొమ్మండుగురు ఆచార్య పురుషులు 'నవ రత్నము' లను బిరుదము నందిరి. కాని, వారి నామములు మాత్రము ప్రకృతము లభింపలేదు.

"అయా త్వయం వరవరో ముని రష్టభి స్తైః
దిగ్దంతిభిః పరివృత స్తవ పాద పద్మమ్
స్తోతుం భవాంతర విహంత్ప సుమంత్రి రత్న
శ్రీమ త్పరాంకుశ గురో తవ సుప్రభాతమ్[3]. "

విశిష్టాద్వైత మతోద్ధారకు అగు భగవ ద్రామానుజాచార్యుల వారి సన్నిధిని (క్రీ : శ ; 1017 - 1137) కూడ అష్ట దిగ్గజము లను మహా పండితు లుండెడివా రని తెలియుచున్నది. ఇందు ముఖ్యులు రామానుజుల యాప్త శిష్యు లగు ఆంధ్ర పూర్ణులు (= వటు పూర్ణులు.)

"Vatupurna is thus assigned a place in the inner circle of Ramanuja's hierarchical institutions, Called the Asta - diggajas, or the Eighf Elephants of Faith to guard the eight Cardinal points of the Compass.[4]"

కావున, రామానుజాచార్యుల వారి కాలము (11 - వ శతాబ్ది) నుండియు అష్ట దిగ్గజ వ్యవహార ముపక్రమించి యుండును. ప్రపన్న శేఖరుఁ డగు రాయలు - ఈ సంప్రదాయమునే యనుసరించియుండు నమట స్పష్టము.

రాయల యాస్థానమునఁ గల అష్ట దిగ్గజములను గూర్చి చరిత్ర కారులు, కవుల చరిత్రల రచించినవారు, వాఙ్మయ గవేషణ నిరతులు పలువురు కృషి సల్పి, భిన్న మతముల వెలువరించిరి.

---

3. కావ్య వినోద, శారదా విలాస, సాహిత్య వాచస్పతి, సరస్వతీ హృదయాలంకార - సాహిత్య రత్నాకర - సాహిత్య సుధాకర - డాక్టర్ : మాడభూషి కృష్ణమాచార్యులవారు ; (M. A; Ph. D; M. L; M. R. A. S.) తిరుపతి - 'లౌకిక సంస్కృత వాఙ్మయ చరిత్ర' (1937), పుట 250 Para 168.

4. A. Govindacharya, Life of Ramanuja, P. 222. (1906)

ఆంధ్ర వాఙ్మయ చరిత్రమును ఆంగ్ల భాష యందు రచించిన శ్రీ రాజా భుజంగరావు గారు, శ్రీ చెంచయ్య గారును అమ్ముశుతముగా వచ్చుచున్న అష్ట దిగ్గజ నామావళి నిట్లు పేర్కొనిరి :-

౧. తిమ్మన్న (నంది) ౫. రామభద్రయ్య (అయ్యలరాజు)
౨. ధూర్జటి ౬. రామకృష్ణ కవి (తెనాలి)
౩. పెద్దన (అల్లసాని) ౭. రామరాజభూషణుఁడు
౪. మల్లన (మాదయ గారి) ౮. సూరన్న (పింగళి....)

శ్రీకృష్ణ దేవ రాయలు - సమకాలి కాంధ్ర కవులు :-

1. వల్లభాచార్యులు :- కవిలోక దేవేంద్ర బిరుదాంచితుఁడు. నామాంతరము వల్లభ సూరి. ప్రబోధానందస్వామికి, కుమార తాతాచార్యులకు శిష్యుఁడు కృష్ణ రాయలకు, అచ్యుత రాయలకు ముఖ్యాశ్రితుఁడై, వారి మన్నన లందిన బొమ్మలాటు కాళయ ప్రేరణమున భాస్కరాచార్యుని 'లీలావతి' నుండి 'పాటి గణితము' నాంధ్రీకరించి, కాళయకే యంకిత మొనర్చెను.

2. మొల్ల :- కులాల సంజాత. ప్రఖ్యాత మగు మొల్ల రామాయణమును రచించిన మహిళా కవి.

3. ఎఱ్ఱన (ఎడపాటి) :- మల్హణ చరిత్రము, కుమార నైషధము అను ప్రబంధములు ఇతని రచనలు.

4. నృసింహ కవి (సంకుసాల) :- వైష్ణవమతానుయాయి, భట్ట పరాశరుల శిష్యుఁడు. మాంధాతృ చరితను 'కవి కర్ణ రసాయన' మను ప్రబంధముగా రచించి, శ్రీరంగ నాథునకు కృతి యిచ్చెను.

రాయలకు విద్వత్కవి పోషణము - పైతృ పితామహ ప్రసాదిత వ్యసనము. రాయల పితా మహుఁ డగు ఈశ్వర నాయకుఁడు నంది మల్లయ - ఘంట సింగయ యను జంట కవుల కవితా కల్ప లత కుపఘ్నాయమానుఁ డయ్యెను. రాయల జనకుఁ డగు నరస నాయకుఁడు - 'వర లక్ష్మీ కల్యాణము', 'నరసింహ విజయము' అను కావ్యములను, పైని బేర్కొనిన జంట కవు లగు మల్లయ సింగయ కవుల 'ప్రబోధ చంద్రోదయ' మను ప్రబంధమును కృతి నందెను. ద్విపద నారసింహ పురాణము, వచన బాల భారతము, సౌభరి చరిత్ర, జక్కుల కథ మొద లగు కృతుల నిర్మించిన అష్ట భాషా కవి వర్యుఁ డగు ప్రోలుగంటి చెన్న శౌరిని, రాయల కగ్రజుఁ డగు వీర నరసింహరాయ లగ్రహారముల నిచ్చి సత్కరించెను. 'మైరావణ చరిత్ర' మను స్వతంత్ర ప్రబంధ నిర్మాత యగు మాదయ కవియు - వీర నరసింహ రాయల సత్కారముల నందెను. ఈ ప్రభువు కాలమున గీర్వాణ కర్ణాట భాషలలో - కొన్ని కృతులు రచింపఁబడినట్లు తెలియుచున్నది. పితామహుని యందు, జనకుని యందు, అగ్రజు నందు బీజాంకుర పుష్ప ప్రాయముగ నున్న కవి పండిత పోషణ నిరతి, సహృదయుఁడు, స్వయముగా పండితుఁడే కాక, ఆంధ్ర సంస్కృత ప్రాకృతాది భాషలయం దందె వేసిన కవి శేఖరుఁడు నగు రాయల యందు సర్వతోముఖముగ ఫలించినది.

### కృష్ణదేవరాయలు - ఆంధ్ర కవి పితామహుఁడు :-

భారత వర్షమున ప్రాచీన కాలమునుండియు మహా కవులకు, ప్రౌఢ విద్వాంసులకు - మహా రాజాస్థానము నందును, సార్వభౌమా స్థానముల యందును అఖండ మర్యాదలు లభించుచుండెడివి. మౌక్తిక చామరములు, ముక్తావ ళ్యలంకృతము లగు రెండు శ్వేత ఛత్రములు, దివా ప్రదీపికా ద్వయము, అర్ధ సింహాసనాసనము, తాంబూల

ద్వయము, బ్రహ్మ రథ యానము, భద్ర గజయానము, బిరుద ప్రదానము, గండ పెండెరమును దొడుగుట, స్వర్ణ కంకణములు, రెండు కాశ్మీరాంకవ కంబళములు (శాలువలు), అగ్రహారములు, రాజ్యాధిపత్యము మొదలగునవి విద్వ త్కవి శేఖరులకు మహా రాజాధి రాజులనుండి లభించుచుండెడి సన్మానములు. పండిత ప్రకాండుల ప్రతిభా వైదుష్యములకు, కవి శేఖరుల కవితా కౌశలమునకును అలరి, మహా రాజులు - వారి వారి పాదములకు కవి గండ పెండేర మను స్వర్ణ మంజీరమును స్వయముగా దొడిగియు, హస్తములకు స్వర్ణ కంకణముల దొడిగియు, తుదకు ఆ యా విద్వాంసులను, కవులను పల్లకియం దధిరోహింపఁజేసి, ప్రభు శేఖరులు స్వయముగా ఆ పల్లకిని వహించియు, అఖండ సన్మానముల నొనరించుచుండెడివారు.

విష్ణు చిత్తులు మహా విష్ణు పారమ్యమును స్థాపించి, విద్యా శుల్కమును స్వీకరించిన పిమ్మట, పాండ్య రాజు - ఆయన యలంక రించిన పల్లకిని స్వయముగా మోసి, భద్ర గజాధిరూఢు నొనరించి యూరేగించె నఁట.

"విభుశేఖరుఁడు సద్వృత మొం
దుచు నా విప్రుని భక్తితో మ్రొక్కి నుతిం
చుచుఁ దాను పల్లకీ మో
చుచు నేఁగించెన్ విభూతి శోభిల్లఁ బురిన్.5"

- (తిమ్మ భూపాలుని పరమ యోగి విలాసము : 3 ఆ : ౩౦౭ పద్య)

"మఱియు నిజ వైభవం బెల్ల మెఱపి తనదు
పట్టపేనుంగు మీదఁటఁ బెట్టి యతనిఁ
బురము గలయ నేఁగింపఁగ హరి సమస్త
సురలు గొలువఁ ద ద్వైభవంబుఁ జూడ వచ్చె."

- (అదే: 4 ఆ - ౩౫ పద్య)

5. శ్రీ వేంకట రామకృష్ణ కవుల ప్రకటనము - పిఠాపురము (క్రీ: శ: 1912)

పెద్దనామాత్యునకు రాయల వలన అఖండ గౌరవము కలిగినట్లు -

"ఎదు రైనచోఁ దన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసఁగి యెక్కించుకొనియె
నితఁడె కవి గండ పెండేరమున కీడౌ
తగు దని తానె పాదమునఁ దొడిగె
మను చరిత్రం బందు కొనువేళఁ బుర మేగ
బల్లకిఁ దన కేలఁ బట్టి యెత్తె
కోకట గ్రామా ద్యనేకాగ్రహారంబు
లడిగిన సీమల యందు నిచ్చె

నాంధ్ర కవితా పితామహ యల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణ రాయలతో దివి కేఁగ లేక
బ్రతికి యున్నాఁడ జీవచ్ఛవంబు నగుచు."

\- (పెద్దనార్యుని చాటువు)

అను పద్యమున, రాయలు దివంగతుఁ డైనప్పుడు - పెద్దన విలపించుటను బట్టి విశద మగును.

## ఆముక్త మాల్యద - ఇతి వృత్త వైశిష్ట్యము

ఆంధ్ర మహా సామ్రాజ్య చక్రమును త్రిప్పి, బహు భాషా వేత్తయై, సహృదయ చూడామణియై, స్వయముగా విద్వత్కవి యైన రాయలు నిర్మించిన దగుట వలన, ఆముక్తమునకు వక్తృ వైలక్షణ్యము బాగుగా సిద్ధించినది. కావ్యమునకు వస్తువు (ఇతివృత్తము) నేత (= నాయకుఁడు), రసము, పాత్ర పోషణము (లేక - పాత్రల శీలమునకు క్రమోన్మీలనము) ప్రాణ తుల్యములు. అంతగా ప్రతిభా సంప

న్నుఁడు కాకపోయినను, రచయిత యుదాత్త మగు ఇతి వృత్తముపై కావ్య సౌధమును నిర్మించిన ఘనత కల్గును. పన్నిద్దఱాళ్వారుల (దివ్య సూరుల) యందు భట్టనాథుఁడు (పెరియాళ్వారు) మహాత్వమున సర్వ జ్యేష్ఠుఁడు.

"గురు ముఖ మనధీత్య ప్రాహ వేదా నశేషాన్
నరపతి పరిక్లప్తం శుల్క మాదాతు కామః
శ్వశుర మమర వన్ద్యం రంగనాథస్య సాక్షాత్
ద్విజ కుల తిలకం తం విష్ణుచిత్తం నమామి."

- (నాథ ముని)

అపఠిత శాస్త్ర గ్రంథ జాత్యంధుఁడు, గురు కులమున అనాఘ్రాత నిగమ పరిమళుఁడు నగు ఈయన - యెంతటి యచిన్త్య మహా మహిమాన్వితుఁడు కాకపోయిన, ఈయనచే శ్రుతి స్మృతి శాస్త్ర ప్రమాణ పురస్సరముగా నారాయణ పారమ్యమును పటు పత్రశాయి సిద్ధాంతీకరింపఁ జేయును ? ద్వంద్వాతీతుఁడు, జ్ఞాన వైరాగ్య సంపన్నుఁడు, మాలికా సమర్పణ రూప భగవ త్పరిచర్యయే పరమ పురుషార్థమని విశ్వసించినవాఁడు, భగవ న్నిష్ఠ కంటె భాగవత నిష్ఠయే గొప్పదని నమ్మినవాఁడు, విశ్వమున నెవ్వనికిని తల వంపని శ్రీ రంగనాథునికి శ్వశురుఁ డగుటచే వంద్యుఁ డైనవాఁడు, సీతా దేవి వలె అయోనిజ యగు గోదా దేవికి పితృ స్థానీయుఁడు నగు విష్ణు చిత్తుని చరిత్ర, మానవ మాత్రుని వివాహ మాడ నని ప్రతిజ్ఞ పట్టి, పరాత్పరుఁ డగు శ్రీ రంగనాథ రూపమున నున్న నారాయణునే వలచి, వలపించుకొని, త త్సాయుజ్యము నందిన భువనాద్భుత చరిత్ర యగు గోదా వృత్తాంతము మ ఉదాత్తము లనుటలో సందేహ మేమి ? దీనినిఁ బట్టి, యీ ప్రబంధమునకు ప్రతిపాద్య వైలక్షణ్యము లభించినది. చర్మ చక్షువులతో భగవ త్సాక్షాత్కారము నందిన మహనీయుఁడు విష్ణుచిత్తుఁడు.

భౌతిక దేహముతో శ్రీరంగనాథుని యందు లీన మైన ఉజ్వల అలౌకిక మహిళ గోదా దేవి. పీ రిరువురకు మోక్ష ప్రాప్తి కలిగె నని వేఱె నుడువ వలయునా ?

"యది భవతి ముకున్దే భక్తి రానన్ద సాన్ద్రా
విలుఠతి చరణాబ్జే మోక్ష సామ్రాజ్య లక్ష్మీః."

నామౌచిత్యము - విలక్షణత :-

రాయలు తన ప్రబంధమునకు 'ఆముక్త మాల్యద' అని పే రిడెను. ద్రావిడమున గోదా దేవికి 'శూడిక్కొడుత్త నాచ్చియార్' అని నామాంతరము. అనఁగా - (మాల్యమును) తాను ధరించి, (భగవంతునకు) సమర్పించిన మహిళ యని యర్థము. ప్రబంధమున ప్రధాన కథ - గోదా దేవీ రంగరాజు కల్యాణ వృత్తాంతము. ఇందు - నాయకుఁడు రంగ రాజు, నాయిక గోదా దేవి. ఈమె భూదేవి కపరావతారము. జనక తనయ వలెనే అయోనిజ యగు లోకోత్తర మహిళా మణి. ఈమె యవతరించిన దేశము దక్షిణ భారతవర్షము. ఈమె జననముచే ఈ దేశము సర్వోత్తర మైన దని వేదాంతదేశికుల శ్రీ సూక్తి :-

"దిగ్దక్షిణాఽపి పరిపక్త్రిమ పుణ్య లభ్యా
సర్వోత్తరా భవతి దేవి, తవావతారాత్
య త్రైవ రంగపతినా బహుమానపూర్వం
నిద్రాళునాపి నియతం నిహితాః కటాక్షాః."

- (గోదా స్తుతి ; ౧౧)

గోదా దేవికి జనకుఁ డగు భట్టు నాథుఁడు (పెరియాళ్వార్) తాను పొందిన భగవ దనుభవమును 'తిరు ప్పల్లాండు' (భగవ న్మంగళా

శాసనము - 12 ద్రావిడ పద్యములు) తిరు మొజి (శ్రీసూక్తి - 401 పద్యములు) రూపమున దివ్య ప్రబంధ యుగళమును రచించియు, అనవాప్త పూర్వ మైన భగవ త్ప్రసాదమును, మహత్తర స్థానమును, గోదా మౌళి గన్ధ సుభగ మగు మాల నర్పించుట వలనఁ బడెసె నఁట.

"శాత స్తే మధుభిదః స్తుతి లేశ వశ్యాత్
కర్ణామృతైః స్తుతి శతై రనవాప్త పూర్వమ్
త్వ న్మౌళి గంధ సుభగా ముపహృత్య మాలాం
లేభే మహత్తర పదానుగుణం ప్రసాదమ్."

- (శ్రీ వేదాంత దేశికులు - గోదా స్తుతి : ౧౦)

ఇట్టి మహత్తర మహిమాన్విత యగు అముక్త మాల్యద పేరు - కవి ప్రబంధమున కిడుట యెంతయు సముచితము.

## ప్రబంధ నామ విలక్షణత :-

ప్రాచీన సంస్కృత సారస్వతమున కావ్యములు నాయికా నామాంకితములుగా నుండుట సామాన్యము. సుబంధుని 'వాసవ దత్త', హర్ష వర్ధనుని 'రత్నావళి - ప్రియ దర్శిక'లు - భట్ట బాణుని 'కాదంబరి', క్షేమేంద్రుని 'కనక జానకి', ఇంతే గాక, కొందఱు సంస్కృత కవి కోవిదులు తమ రచనలకు తమ ప్రేమాస్పద లగు ప్రియురాలి పేరో, కొమారిత పేరో పెట్టి, తత్తద్వ్యక్తుల కమరత్వ మును ప్రసాదించిరి. వాచస్పతి మిశ్రుఁడు తన దర్శన భాష్యమునకు - తన ధర్మ దార యగు 'భామతి' నామ మొసఁగెను. వల్లభాచార్యులు తన భార్య యగు లీలావతి పేర '(న్యాయ) లీలావతి' యను గ్రంథమును రచించెను. ఘన శ్యాముఁడు తన ధర్మ పత్నులలో నొకర్తె యగు సుందరి పేర 'ఆనంద సుందరి' యను గ్రంథమును

గూర్చెను. మైథులుం డగు గోకుల నాథుఁడు చిన్న వయస్సుననే దుర్మరణము నందిన తనయ యగు 'కాదంబరి' పేర కొన్ని గ్రంథములు రచించె నఁట. రవిపాణి - తన తనయ యగు 'మధుమతి' నామము తో కావ్య ప్రకాశికకు వ్యాఖ్య రచించెను. ఇట్లే, కల్యాణ మల్లుఁడు తన భార్య పేరునఁ గాబోలు - 'మాలతి' యను గ్రంథము ను కూర్చెను.

కాని, ప్రాచీనాంధ్ర వాఙ్మయమున నాయికా నామమున వెలసిన ప్రబంధము 'ఆముక్త మాల్యద' యొక్కటియే యని తోఁచును. అధునాతనాంధ్ర సాహిత్యమున మాత్ర మిట్టి వెన్నియో గలవు.

## విష్ణు చిత్తీయము - ఆముక్త మాల్యదకు నామాంతరము :-

ప్రబంధమున నెచ్చటను రాయలు దీనిని విష్ణు చిత్తీయ మని వ్యవహరింపలేదు. విష్ణు చిత్తుఁడు కావ్యమున ప్రముఖ పాత్రము. ఈయన మాలా సేవా నిరతి, వటపత్రశాయి యాజ్ఞ ననుసరించి పాండ్య దేశాధీశుని పండిత పరిషత్తునఁ బాల్గొని, పర మత వాదములు ఖండించి, స్వ మత స్థాపన మొనర్చి, మోక్ష ప్రదుఁడు శ్రీమన్నారాయణుఁ డొక్కఁడే యని నారాయణ పరాత్పరత్వమును నిర్ణయించి, పండిత శుల్కమును గైకొనెను. పరబ్రహ్మ సాక్షాత్కార హేతువు యోగమే యని సిద్ధాంతీకరించెను. తన తనయ యగు గోదాదేవి చరిత్రతోఁ బాటు - ఈయన చరిత్రయు ప్రబంధోపసంహారము వఱకు వ్యాప్త మైనది. కనుక, 'విష్ణు చిత్తీయ' మను పేరు - రాయల విద్వత్కవి పండిత పరిష త్కాలము నుండియు వ్యవహారమునకు వచ్చినదేమో యని తోఁచును

గోదాదేవి - మీరాబాయి :-

గోదాదేవి పేరెత్తినంతనే మహా భక్త మండలి యందు ఆర్యావర్తమునకుఁ జెందిన 'మీరాబాయి' యను హిందీ వనితా రత్నము తలంపునకు వచ్చును. ఈ పవిత్ర చరిత్రకును, గోదాదేవికిని ఎంతో సామ్యము గలదు కావున, వారిని గూర్చి దిజ్మాత్రముగ నించుక వివరింపఁబడును :-

గోదాదేవి విష్ణు భక్తి నిరత. తాను నమ్మిన దైవము తోడి సాయుజ్యమునకై తపించిపోయి, తహ తహ లాడి, తాను రచించిన గోదా శ్రీసూక్తి (= నాచ్చియార్ తిరు మొజి) యందు విహంగ కీటకాదుల నెన్నింటినో తన ప్రణయ సందేశమును రంగనాథుని కడకుఁ గొని పొమ్మని ప్రార్థించును. పురుషుల దృష్టి చిత్తములను గూడ నపహరించు దివ్య మంగళ కమనీయ విగ్రహ సౌందర్యము గల పురుషోత్తముఁడు - శఠకోప ముని (నమ్మాళ్వారులు) అను విఖ్యాత దివ్య సూరికి నాయికావస్థనుఁ గల్గింప, పరమ పతివ్రత కుండు ఆకార త్రయము - 'అనన్యార్హత్వము, అనన్య భోగ్యత్వము, అనన్య శరణ్యత్వము'ను గల యీ భక్తాగ్రణి - భగవ ద్విశ్లేషమును భరింపఁ జాలక, సారసము - హంస - కోకిల - క్రౌంచము, శుకాది పక్షులను, తుమ్మెదలను, వాయువును, మనస్సును తన ప్రణయ వార్త భగవంతునికి నివేదింపఁ బ్రార్థించెను.

ఆమె వలెనే ఆర్యావర్త వాసిని యగు మీరాబాయియు అగ్ర భక్త శ్రేణికిఁ జెందును. ఏ నిర్మల చరిత్ర యగు ఈమె యుదంతము నిట నించుక స్మరింపఁ దగును. ఈమె - జోద్‌పుర రాజవంశ కల్ప ద్రుమ ప్రసూనము. జననము - క్రీ: శ: 1504 ప్రాంతము. చిత్తూరు రాజకుమారుఁ డగు భోజరాజును వివాహ మాడెను. ఈమె హృదయ

మును చూఱగొన్న దైవము గిరి ధర గోపాలుఁడు. ఈ దైవమునుఁ గూర్చి యొడలు తెలియని యీమె యార్త పరిపక్వ హృదయము నుండి వెల్లివిరిసిన హిందీ గేయము లు వందలు, వేలు. మీరాబాయి బాల్యము నుండియే గిరిధర గోపాలునికి భక్తురాలు. అనుదినము సంసార జీవితమునఁ గూడ, గృహ కృత్యములకుఁ బిమ్మట రాత్రుల యందు, శ్రీ కృష్ణ విగ్రహము నెదుట భజన సంకీర్తనము, నృత్యము చేయుచు తన్మయురా లగుచుండెడిది. అమె కృష్ణ భ క్త్యున్మాదము - అత్త గారికి, అడు బిడ్డకును, ఇతర స్త్రీలకును విడ్డూరముగాఁ దోచెను. వా రందఱు బతిమాలినను, బెదిరించినను, భక్తి మార్గము నుండి ఆమె తొలఁగలేదు. అమె యాడుబిడ్డయు, చెలికత్తెలును రాత్రు లందు దేవాలయమున మీరా విటులతో సరస సల్లాపము లాడుచుండు నని భోజరాజుతో కొండెములు చెప్పిరి. అతఁడు వికల చిత్తుఁడై, ఒకనాఁటి రాత్రి దేవాలయమున మీరా నృత్యము, సంకీర్తనము చేయుచుండ, దూసిన కత్తితో దేవాలయమున ప్రవేశింప, అట కృష్ణ విగ్రహము తప్ప, మ ఱెవ్వరును లేకుండిరి. ఈమె భ క్త్యున్మాదము మ గూర్చి విని, అగ్బరు పాదుషాయును, ఆస్థాన సంగీత విద్వాంసుఁడు తాన్ సేనును బైరాగి వేషములతో చిత్తూరునకు వచ్చి,నాఁటి రాత్రి - దేవాలయమున శ్రవణానందముగ అమె సంకీర్తనమును, నేత్రోత్సవముగా అమె నృత్యమును కని, విని, అమె వలెనే మై మఱచిరి. వారి కొడుకు తెలిసిన తర్వాత, పాదుషా అమెకు నమస్కరించి, గిరిధర గోపాలుని కిమ్మని ఒక రత్నహారమును అమె కిచ్చి వెడలిపోయెను. ప్రచ్ఛన్న వేషముగ వచ్చిన బైరాగి - పాదుషా యని తెలిసిపోయెను. మహాత్మ దీయుఁ డొకఁడు రాజపుత్ర స్త్రీని తిలకించి, దేవాలయమున ప్రవేశించి, రత్నహార మొసఁగుట - రాజస్థాన ప్రతిష్ఠకు భంగ హేతు వని భోజరాజు - 'ఇఁక నీ మొగము చూడను. ఏ నదిలో నైన పడి చావుము ' అని, మీరాను గెంటి వేసెను. విరక్తితో అమె ఒక నదిలో

దూకెను గాని, స్మృతి వచ్చునప్పటి కొడ్డునఁ బడియుండెను ఆమె పాదచారిణియై యెన్నాళ్ళకో బృందావనము చేరి, గిరిధర గోపాలు నెదుట నిర్విరామముగా సంకీర్తనమును, నృత్యమును చేయుచుండెను. ఆమె మహిమను విన్న భర్త - బృందావనమున కరిగి, ఆమెను తన యపచారమునకు మన్నింపు మని వేఁడెను భర్తతో ఆమె చిత్తూరు నకు వచ్చి, భజనల - నృత్యముల సాగించుచునే యుండెను. ఇంతలో భోజరాజు మరణింప, అతని తమ్ముఁడు రాణాయై, మీరా చర్యల నేవ గించుకొనుచు, ఎట్లైన ఆమెను చంపవలె నని యెంచి, ఒక పాముల బుట్టలో - పూల హారము లున్న వని ఆమెకుఁ బంపెను. బుట్టలో మీరా చేయి పెట్టఁగా - అందు సర్పములకు బదులు పూల హారములే యుండెను. మఱి యొకసారి రాణా - అమృత మని చెప్పి ఆమెకు విష పాత్రి పంప, మీరా కది అమృతమే యయ్యెను. నాఁటి నుండి మీరాబాయి లోక పూజ్యయై, యావ జ్జీవ మిట్లే కృష్ణ సంకీర్తనమున కాలము గడపి, అవసానమున భగవంతునిలో ఐక్య మయ్యెను. ఆమె కొలిచిన స్వర్ణ గోపాల విగ్రహము నేఁటికిని జోధ్ పురమున జనులు పూజించుచున్నారు.

ఇట్లు మహా మహిమాన్విత యగు గోదాదేవికిని, మీరాబాయి కిని అత్యంత సామ్యము కన్పట్టును. గోదాదేవి అయోనిజ విష్ణు భక్తురాలు. మీరాబాయి కిష్ట దైవము గిరిధర గోపాలుఁడు ; గోదాదేవికి శ్రీరంగ నాథుఁడు.

## గోదాదేవి - నీలాదేవి :-

పై ప్రకరణమున గోదాదేవికి ప్రతిబింబ మగు మీరాబాయిని గూర్చి తెలిసికొంటిమి గోదాదేవికి మఱొక ప్రతిబింబము అపర గోదాదేవి యనఁ దగు నీలాదేవినిఁ గూర్చియు ఇంచుక తెలిసికొన

జనను. పరమ యోగులతో అగ్రశ్రేణికి చెందిన పుణ్య పురుషులలో నొకరు కులశేఖరాళ్వారు. ఈయనకు - 'నీలాంశజ' యను నొక కుమారీ రత్నము కలదు. ఈ మహనీయ చరిత్ర - సర్వథా గోదా వృత్తాంతమును పోలి యుండును. గోదాదేవి వలెనే ఈమెయు శ్రీరంగ నాథునే వరించి, ఆయనకే పత్ని అయ్యెను. ఈమె పవిత్ర చరిత్రను విష్ణు భక్తి సుధాకరము (= కులశేఖరాళ్వారు చరిత్రము) అను 5 ఆశ్వాసముల ప్రౌఢ ప్రబంధమున పూసపాటి విజయ రామరాజు చిత్రించి, శ్రీరామతీర్థ రఘురామునకు కృతి యిచ్చెను. ఈ కృతి కింకను ముద్రణ సూర్యాలోక భాగ్యములు కలుగలేదు. కవితా ప్రౌఢి యందు ఈ ప్రబంధము ఆముక్తమునకు పోలి యుండును. నీలాదేవి చరిత్రను తెలిసికొన కుతూహలము కల భక్తులు - సిద్ధరాజు సింగ భూపాల కృత 'పరమ యోగి విలాసము'ను పరిశీలింతురుగాక ! (ఆశ్వాసము 3 - 93 - 118 ప - పుటలు 97 - 101) 'కవితా' పత్రిక యందు - పిఠాపుర ముద్రణము - 1912 - మఱియు - శ్రీ బులుసు వేంకట రమణయ్యగారు రచించిన 'గజపతి రాజుల తెలుఁగు సాహిత్య పోషణము' - (పుటలు 186 - 192) అను గ్రంథమును పరిశీలింప వచ్చును. (1964) అందు, గ్రంథస్థ విశేషాదులు కాన నగును. ఇంకను శ్రీ 'ఆరుద్ర' రచించిన 'సమగ్రాంధ్ర సాహిత్యము'న, 12 సంపుటము - పుటలు 279 - 283 కూడ పరిశీలింపవచ్చును. శ్రీ నిడదవోలు వేంకట రావుగారి 'విజయ నగర సంస్థానము — ఆంధ్ర వాఙ్మయ పోషణ' (1965) అను గ్రంథమున కూడ 'విష్ణుభక్తి సుధాకర' చర్చ కలదు.

## రాయల పద జాలము

సంస్కృత వాఙ్మయమున బాణుని హర్ష చరిత్ర, కాదంబరి యును అపారమైన పద జాలమును, అపూర్వ పద సమూహమును

ప్రదర్శించును. గీర్వాణ శబ్ద సముదాయ పరిజ్ఞానమున బాణునకు ప్రౌఢ పాండిత్యము గలదు. సంస్కృత కవులలో - ఈతనితో పోటీ చేయఁగలవారు - మాఘ మురారి కవీంద్రులు. మాఘుని 'శిశుపాల వధ' యందు తొమ్మిది సర్గలు పఠించినవానికి సంస్కృతమున క్రొత్త పదమే యుండ దని లోకోక్తి.

"నవ సర్గ గతే మాఘే నవ శబ్దో న విద్యతే."

ఇం దించుక అతిశయోక్తి యున్నను, గీర్వాణ శబ్ద సంతతిపై మాఘునకు విశేషమైన యధికారము గల దనుట సత్య దూరము గాదు. అనర్ఘ రాఘవ రూపకమును రచించిన 'బాల వాల్మీకి' మురారికి శబ్ద స్తోమముపై నిట్టి యధికారము గల దని నానుడి.

"యే శబ్ద శాస్త్ర నిష్ణాతా యే శీలిత నిఘంటవః
తేషా మే వాధికారోఽస్తి మురారి కృత నాటకే."

పై కవులను బోలినవాఁడే రాయలును. పై కవులకు సంస్కృత మున్నచో, సంస్కృత ప్రాకృత భాషలయందో విస్తృత వైదుష్య మున్నచో, సంస్కృత ప్రాకృతాంధ్ర ద్రావిడ కర్ణాటక భాషలలో రాయలకు కూలంకష పాండిత్య మున్నట్లు కన్పట్టును.

## బ్రౌన్ పండితుఁడు కూర్చిన 'ఆముక్త' పద సూచిక

ప్రాచీన ప్రఖ్యాత రచయిత లొక్కొక్క రచన యందును, తమ తమ గ్రంథ జాలము సంతతి యందును ప్రయోగించిన పదముల సమగ్ర సూచికలను అర్థ విశేషాదులతోఁ గూర్చుట పాశ్చాత్య దేశా చారము. షేక్స్పియర్ మహాకవి, మిల్టన్ కవిశేఖరుఁడు మొదలగు వారి రచనలకు ప్రత్యేక నిఘంటువులు కూర్పఁబడినవి. ఇట్టి కోశ

ములు భాషా చర్చలకు, భాషా పరిణామ విశేషమునకును ఎంతయో యుపకరించును. ఇట్టి కోశములు భారత దేశీయ భాషలయందు మహాకవి ఖ్యాతి నందినవారి ప్రధాన గ్రంథముల కైనను కూర్పబడ లేదు. కాని, పాశ్చాత్య విద్వాంసులు మాత్రము - తాము పరిష్కరించి ప్రచురించిన సంస్కృత గ్రంథముల కిట్టి పద సూచికలను గూర్చి, ఆ యా గ్రంథముల కనుబంధించి, మహోపకార మొనర్చిరి. ఆంధ్ర భాషా వాఙ్మయ గవేషణ వ్యసనియై కఠోర కృషి సల్పి, ఆంధ్రము నకు, ఆంధ్ర సారస్వతమునకును ఎంతయో యమూల్య సేవ యొనర్చి ప్రాతః స్మరణీయుఁడైన సి. పి. బ్రౌన్ పండితుఁడు - విద్వ త్సాహాయ్యమున అముక్త మాల్యదను పరిష్కరించి, దాని యందలి పద జాలమునకు అకారా ద్యనుక్రమణికను సంధానించెను.[6] నేఁటి వరకును ఈ పద సూచిక, మద్రాసులో - ప్రభుత్వము వారి ప్రాచ్య లిఖిత గ్రంథాలయమున అసూర్యం పశ్య వలె మఱుఁగుపడి యున్నది. ఈ సూచికను ఆశ్వాస పద్య సంఖ్యలతో - ఏ వేదము వారి ప్రతినిఁ బట్టియో పుట సంఖ్యలనుఁ గూడఁ జేర్చి, పదముల కర్థములనుఁ గూడ వ్రాసి, ప్రచురింపవలెను అట్టి భాగ్య మెన్నటికో !

## ఆముక్త మాల్యదపై వ్యాఖ్యలు

ఇంతవఱకు అముక్త మాల్యదపై అయిదు వ్యాఖ్యానములు లభించినవి. అందు రెండు మాత్రమే ముద్రింపఁబడినవి. తక్కిన మూఁడును - మద్రాసులో ప్రభుత్వము వారి ప్రాచ్య లిఖిత గ్రంథ నిలయమున ఎండక న్నెఱుఁగకుండ, అజ్ఞాత వాస వ్రతము నవలం

6. క్రీ. శ: 1840 - వ సంవత్సరమున పూర్తిచేయించెను. ('ఆముక్త మాల్యదా పద్య సూచి' - 428 - వ సంఖ్య గల గ్రంథము, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత గ్రంథాలయము)

బించి యున్నవి. ఈ వ్యాఖ్యలను కూలంకషముగ చర్చించి, కీ: శే: 'రాజ చరిత విశారద - రావు సాహెబ్' శ్రీ పి. హయ వదన రావు గారు రచించిన ఆంగ్ల వ్యాసమున,[7] విశేషములను కుతూహలము గల పాఠకులు విలోకింతురుగాక ! పై వ్యాసమునకు - 'విద్వాన్' శ్రీ బులుసు వేంకటేశ్వరులు (బి. యే) గారి ఆంధ్ర పరివర్తనము[8] - శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రి షష్టి పూర్త్యుత్సవ సన్మాన సంపుటమున ప్రకటింపఁబడెను. వ్యాఖ్యాన - వ్యాఖ్యాతలను గూర్చి దిఙ్మాత్ర సూచిక :-

అముద్రితములు 3

౧ గట్టుపల్లి శ్రీనివాస కవి : 'మహా టీక' (క్రీ: శ: 1800 ప్రాంతము)

౨. ఉప్పులపాటి జోగి జగన్నాధరాజు : 'బుధ మన స్తోషిణి' (క్రీ: శ: 1813 ప్రాంతము.)

౩. గుడిపాటి వేంకట కవి 'తాత్పర్య బోధిని' (క్రీ: శ: 1848 కంటెను ప్రాక్తనము.

7. 'Amukta - Malyada' in English, by the late Raja Charita Visarada - C. Hayavadana Rao, B. A., B. L; M.L.C. in Bhashod-dharaka - Vavilla Venkateswra Sastrulu Commemoration Volume Madras) (1941) . pp. 89 - 103.

8. మద్రాసు - (1952) - పుటలు 281 - 40 ఈ వ్యాసము - ఆముక్త మాల్యదకు (వావిళ్ళ వారి సప్రచురణము, 6 - వ సంస్కరణము - 1954) అను బంధముగా ముద్రితము నందితది. (పుటలు : 89 - 99)

ముద్రితములు 2

౪. వావిళ్ళ రామస్వామి శాస్త్రి ; 'రుచి' (క్రీ: శ: 1869)

౫. వేదము వేంకటరాయ శాస్త్రి 'సంజీవని' (క్రీ: శ: 1827)

శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు 'రుచి' వ్యాఖ్యానముతో ఈ ప్రబంధమును ప్రకటించుటకు పూర్వమే దీనికి - సమగ్రములు, అసమగ్రములు నగు పెక్కు వ్యాఖ్యలు రచింపఁబడినవి. నెల్లూరు - నవాబుపేట వాస్తవ్యులు -శ్రీ వింజమూరి నరసింహాచార్యులు గారు - 'బహు ప్రాచీన వ్యాఖ్యాన సమాకలన ప్రాయముగా' నొక వ్యాఖ్యను నిర్మించి రామస్వామి శాస్త్రిగారి కొసఁగ, వీరు - ప్రెసిడెన్సీ కాలేజీలో అంధ్ర పండితు లగు శ్రీ చదలవాడ సీతారామ శాస్త్రిగారి తోడ్పాటున ముద్రించి ప్రకటించి నట్లు, సీతారామ శాస్త్రిగారే తమ శిష్య శిఖామణి యగు శ్రీ వేదము వేంకట రాయ చరణులతో వక్కాణించి రఁట ! అముక్త మాల్యదను 'రుచి' వ్యాఖ్యానముతో వావిళ్ళవారు ప్రకటించి నప్పటి నుండి అది కాంచిన ఖ్యాతి - నిరుపమానము. విద్యార్థి ప్రపంచమున కది కామధేనువుగా విరాజిల్లుచున్నది. అంతే కాదు. ఇది ఆ నాఁడు ప్రకటింపఁబడకయే యున్న, ఏ నాఁడో అముక్త మాల్యద రూప రేఖ లేక, నశించియుండెడి దనుటలో ఆశ్చర్యము లేదు - అని వేంకట శాస్త్రిగారు వ్రాసియుండి రఁట ! 'రుచి' వ్యాఖ్యానము ప్రాచీన వ్యాఖ్యలను పరిశీలించి వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు రచించి రని హయవదనరావుగారు వేదము వేంకట రాయశాస్త్రిగారితో స్వయముగాఁ జెప్పిన వాక్యములనుఁ బట్టి, వింజమూరి నరసింహాచార్యులవారు రచించిన వ్యాఖ్యను రామస్వామి శాస్త్రిగారు ప్రకటించి నట్లు తెలియుచున్నది. ఇందలి సత్యాసత్యములను ప్రకృతము నిర్ణయింపఁ జాలము.

రుచి - సంజీవని వ్యాఖ్యానములు :-

వావిళ్ళ రామస్వామి శాస్త్రి గారు విశేష వ్యయమునకు, కఠోర పరిశ్రమకును లోనై ప్రచురించిన రుచి వ్యాఖ్యానము ప్రతిపదార్థ ముతోఁ గూడి యుండుటచే, విద్యార్థి మండలికి అముక్త మాల్యదా పఠనమున నెక్కువ తోడ్పడుచున్నది. విద్వాంసులకే యుపయోగించు విశేష విశేష విషయము లిం దంతగా లేవు. వేదము వేంకట రాయ శాస్త్రిగారి సంజీవనీ వ్యాఖ్యానము విద్యార్థులకంటె విద్వాంసుల కెక్కు డుపయోగకారి ఇందు విశిష్టాద్వైత సంప్రదాయ విశేషములు, శాస్త్రీ యాంకములు, పూర్వ వ్యాఖ్యానములు లేనివి, విశేషముగా వివరింపఁ బడినవి. కావ్య వ్యాఖ్యాన విధానమునను కూడ నిది విస్తృతముగా నున్నది. కాని, కొన్ని కొన్ని ఘట్టములను పరిశీలించిన, 'ఇది కూడ అముక్తమునకు పర్యాప్తమైన వ్యాఖ్య కా దేమో !' అనిపించును. అముక్త మాల్యద యందలి గద్య పద్యములకు అకారాది ప్రతీకాను క్రమణికను కూర్చి, తమ వ్యాఖ్యానమున కనుబంధించి, పాఠక లోకమునకు విశేషోపకారము చేసిన మహనీయులు వేదమువారే. వీరి ప్రచురణమునను - వ్యాఖ్యానమునను గల దోషములను, లోపములను శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు - 'సాహిత్య సమీక్ష' యందుఁ జూపియున్నారు.

అముక్త మాల్యదా ప్రవేశమునకు 'రుచి' యను ఘంటా పథ మును నిర్మించిన వారు శ్రీ రామస్వామి శాస్త్రిగారు. ఆ ఘంటా పథమును విద్వజ్జన సంచరణార్హముగాఁ జేసి, ఛాయా వృక్షములతో నలంకరించిన మహా మహులు శ్రీ వేంకటరాయ శాస్త్రి చరణులు. ఈ రాజ మార్గమున, ప్రమాద వశమునఁ బడిన శిలా కంటకాదులన్ను తొలగించిన సహృదయులు - శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రిగారు. ఈ

పండిత త్రియము ఆముక్త మాల్యదా పాఠక లోకమునకు పూజ
నీయము.

## ఆముక్త మాల్యద మాతృకలు

"దేవస్య మహిషీం దివ్యాం మాదౌ గోదా ముపాస్మహే
యన్మౌళి మాలికాం ప్రీత్యా స్వీకరోతి స్వయం ప్రభుః."
- (శ్రీ పరాశర భట్టర్ శ్రీసూక్తి)

ఆముక్త మాల్యద కుపజీవ్యములైన ప్రాక్తన గ్రంథములను గూర్చి విచారించుటకు ముందీ ప్రబంధమునఁగల వివిధ ఘట్టముల నెన్నఁదగును :-

1. విష్ణుచిత్తుని వృత్తాంతము  2. గోదాదేవి చరిత్ర
3. యామునాచార్య కథ  4 చండాల బ్రహ్మరక్ష
5. ఖాండిక్య కేశిధ్వజ సంవాదము  స్సంవాదము

అను ఐదు ఘట్టము లిందు కానవచ్చును. ఇందు ప్రధానములు - మొదటి రెండు ఘట్టములే. వీని యందలి కథ సంస్కృతమున కవి వైద్య పురందరుఁడును, భగవ ద్రామానుజ గురు వర చరణ కటాక్ష లబ్ధ విద్యా వైభవుఁడును, శ్రీ రంగరాజ ఆరోగ్యశాలా వల్లభుఁడు నగు గరుడవాహన పండితుఁడు నిర్మించిన 'దివ్య సూరి చరిత' మను సంస్కృత కావ్య రత్నమునను, ద్రావిడ భాషయందు 'పిన్బళగియ పెరుమాళ్ జీయర్' పండితుఁడు సంస్కృత ద్రావిడ మిశ్ర మగు మణిప్రవాళ భాషలో రచించిన 'గురు పరంపరా ప్రభావము'నను (7 - 92 పుటలు) కన్పట్టుచున్నది. పై రెండు గ్రంథములే రాయల కాధారములు కానోపును. దివ్య సూరి చరితము క్రి. శ: 11- 12

శతాబ్దముల యందును, గురుపరంపరా ప్రభావము క్రీః శః 14 - వ శతకమునను రచింపఁబడినట్లు చరిత్రలనుఁబట్టి తెలియుచున్నది పై కథలు గల గ్రంథములు గీర్వాణమున అనంతాచార్య పండితుని 'ప్రపన్నామృత' మను మహా గ్రంథమునను, ప్రతివాది భయంకరం అణ్ణన్ శిష్యుఁ డగు నంబూరు కేశవాచార్యుల 'ఆచార్య సూక్తి ముక్తావళి' యందును కన్పట్టుచున్నవి. కాని, ఈ గ్రంథ రచనా కాలమునుఁ బట్టి, ఇవి రాయల కాధారములు కాఁజాల వని నిర్ణయింపఁ దగును. వీని తోడిదే శ్రీ వేదాంత దేశికుల కుమారు లగు 'నయనార్ స్వామి' శిష్యులు బ్రహ్మ తంత్రస్వామి మణిప్రవాళ భాషలో నిర్మించిన 'మువ్వాయిరప్పడి' యను పడగలై 'గురుపరంపరా ప్రభావము'ను.

దివ్య సూరి చరితమున పరళ మధురముగా విష్ణుచిత్త గోదాదేవి వృత్తాంతము మహా కావ్య ధోరణిలో చిత్రింపఁబడెను. (9- 13; సర్గలు - పుటలు 54 - 96) మొత్తము 446 శ్లోకములలో ఇర్వురి చరిత్రమును బహు మనోహరముగా నిందు చిత్రింపఁ బడెను. ఈ శ్లోకములనే యాధారముగాఁ గొని రాయలు తన ప్రబంధమును నిర్మించి యుండి నచో మిగుల హృదయావర్జకముగ నుండెడిది. పై గ్రంథమునందలి మూల కథ, దానికి రాయ లొనరించిన కూర్పులు మార్పులనుఁ గూర్చి శ్రీ మేడేపల్లి వేంకట రమణాచార్యులవారి 'ఆముక్త మాల్యదా భూమిక' యందును, శ్రీ వెల్లంచ ప్రభాకర రావు గారి పర్యాలోకము నను, గన నగును. ఆ యా మూలానుకరణముల వ్యత్యాసముల సార్థక్యమునుఁ గూర్చియు అట పరిశీలింప నగును. యామునాచార్య కథ కూడ, 'దివ్య సూరి చరితము' నందలిదే. అముక్తమున వీరి చరిత్ర కెట్టి ప్రసక్తియు లేదు. కాని, రాయ లెట్లో యామునాచార్య కథను ప్రధాన కథతో ముడి పెట్టెను. చండాల బ్రహ్మ రక్ష స్సంవాదము వరాహ పురాణాంతర్గము. శ్రీ వరాహ భూ దేవీ సంవాదమున భగవ

ద్గాన మహిమను ప్రతిపాదించు నలువది నాల్గవ సర్గలో ఈ వృత్తాంతము గలదు. ప్రబంధము నందలి ప్రధానేతివృత్తమునకును, మాతంగ బ్రహ్మ రక్ష స్సంవాదమునకును సంబంధ మేమియు లేకపోయినను, రాయ లేదో యొక విధమున బదరీ బాదరాయణ సంబంధమునుఁ గల్పించి, కొన్ని మార్పు లొనరించి, దీనియందు విశిష్టాద్వైత మత సంప్రదాయంబును, యుక్తి చాతుర్యంబును జ్ఞాన పరిణతివి విశదీక రించెను.

ఖాండిక్య కేశిధ్వజ సంవాదమును పరాశర నిర్మిత 'శ్రీవిష్ణు పురాణము' నందలి షష్ఠాంశములో - షష్ఠ సప్తమాధ్యాయములలో - పరాశరునిచే మైత్రేయ ఋషికి వివరింపఁజేయఁబడెను. ఈ కథ - శ్రీమ ద్భాగవతము నందలి నవమ స్కంధమున త్రయోదశాధ్యాయ ములో నించుక సూచింపఁబడినది. యామునాచార్య చరిత్రమున మూల కథా వ్యత్యయములు, వాని సమంజసత్వమును, ఆముక్త భూమికా - పర్యాలోకనములఁ గనవచ్చును. కాని, ఖాండిక్య కేశిధ్వజ సంవాదమున రాయ లెట్టి మార్పును చేయలేదు.

## రాయల వైష్ణవ మతాభినివేశము - దశావతార వర్ణనము

రాయలు పరమ ప్రపన్న శిరోమణి. పంచ మత భంజన నిర్మాణమున విశేష విఖ్యాతి నందిన శ్రీ తిరుమల తాతాచార్యులవారి శిష్య చూడామణి. రాయల కాచార్య నిష్ఠ మెండు. పర మత భంగము నకు, స్వ మత స్థాపనకు రాయలు - ఆముక్తమును నిర్మించెను. ఆంధ్ర వల్లభరాయని యాదేశమున, ఈ ప్రబంధమును శ్రీ వేంకటేశ్వర స్వామికి కృతిగా నర్పించెను. వేంకటేశ్వర స్వామికి పరమ భక్తుఁ డగు ఈయన - తన విగ్రహమును, దేవేరు లగు తిరుమలదేవి - చిన్నా

దేవుల శిలా విగ్రహములను నిర్మింపఁజేసి, తిరుమలలో - దేవాలయ ప్రాంగణముననే స్వామి కభిముఖముగా వానిని స్థాపించెను. కృష్ణ రాయలు కాంచీ పురము నందలి వరదరాజస్వామి దర్శనమున కప్పు డప్పుడు వెళ్ళుచుండెడివాఁడు. ఆయన పట్టమహిషితో నొక సారి స్వామి దర్శనమున కరుగగా - అప్పయ్య దీక్షితుల పూర్వ పురుషుఁ డగు అచ్చాన్ దీక్షితుఁ డీ క్రింది శ్లోకము నాశువుగాఁ జెప్పె నఁట:-

"కాంచిత్ కాంచన గౌరాంగీం వీక్ష్య సాక్షా దివ శ్రియమ్
వరదః సంశయాపన్నః వక్షః స్థల మవైక్షత."

యామునాచార్య వృత్తాంతము ప్రబంధమున అప్రసక్తమైనను, పర మత నిరసనము - స్వ మత స్థాపనమునకే రాయలు తన కృతి యందు దానినిఁ జేర్చెను అట్లే, మాతంగ బ్రహ్మరక్ష స్సంవాదమును, వైష్ణవ మతోత్కర్షను స్థాపింప, కవి - ప్రబంధమునఁ జేర్చెను. అట్లే, ఖాండిక్య కేశిధ్వజ సంవాదముకూడ విశిష్టాద్వైత మత సంప్రదాయ మును విపులముగా వివరించుచున్నది. దీనికిని, గోదా కల్యాణమున కును ప్రసక్తి యేమియుఁ గన్పట్టదు. రాయలు - ఇతర కవి లక్షణ ముగా తన ప్రబంధమున కృత్యాదిని రచించెను. మొదటి పద్యమున వేంకటేశ్వర స్వామినిఁ గొలిచి, పిమ్మట, అనంత - గరుడ - విష్వ క్సేనులను, శ్రీ మహా విష్ణువు పంచాయుధములను, తదుపరి, ఆళ్వారు లనఁబడు ద్వాదశ దివ్య సూరులను స్తుతించెను. శ్రీకాకుళ క్షేత్రమున ఆంధ్ర విష్ణువును దర్శించి, హరివాసరోపవాసము చేసి, నాఁటి రాత్రి ఆ దేవుని స్వప్నమందు దర్శించి, త న్నిదేశము ననుసరించి, గోదా దేవి - తాను ధరించిన మాలను రంగనాథున కర్పించి, తదనుగ్రహ ముచే తత్సాయుజ్యము నందిన యితి వృత్తమును రాయలు ప్రబంధీక రించెను. విష్ణు చిత్తుఁడు పర మతములను ఖండించి, విశిష్టాద్వై తమును స్థాపించి, విద్యా శుల్కమును స్వీకరించు నవసరమున, పాండ్య రాజు - ఆ మహనీయునికి గజారోహణ మహోత్సవమును

జరుపుచుండఁగా - శ్రీమన్నారాయణుఁడే స్వయముగా విష్ణు చిత్తునకు ప్రత్యక్ష మయ్యెను. ఇట్లు విష్ణు సాక్షాత్కార మను లోకోత్తర భాగ్యము నందిన పెరియాళ్వారు మై మరచి, తా నధిరోహించిన భద్ర గజమునకుఁ గట్టిన గంటలనే చేకొని, వాదన మొనరించుచు, భగవంతునికి దృష్టి దోషము తగులకుండునట్లు, 'పల్లాండ్' అను ద్రవిడ భాషా లఘు కృతి రూప మగు మంగళాశాసన మొనర్చెను. ఈ ఘట్టముననే ఆముక్త మాల్యద యందు విష్ణు చిత్తునిచే రాయలు దశావతార స్తోత్రము నుద్ఘోషింపఁజేసెను. ఆముక్తమున ఈ క్రింది కంద పద్యమున దశావతారములును పేర్కొనఁబడినవి :-

"జల చర కిటి హరి వటు భృగు
కుల రఘు కుల సీరి బుద్ధ ఘోటి ప్రముఖో
జ్జ్వల జని కృత జన రక్షా
యలమే ల్మంగాభిదేందిరాలయ వక్షా !"

- (ఆముక్త మాల్యద ; 1 - 87)

## ఆముక్త మాల్యద - ఐతిహాసిక - రాజనైతిక ప్రాముఖ్యము

రాయల ప్రబంధమున, తత్పరిపాలనా వైభవము వ్యంగ్యముగా సూచింపఁబడినది. ఆయన దిగ్విజయములు, ఆయన యనుసరించిన రాజ నీతి విధానము, అర్థ శాస్త్రీయాంశములును ఇందు వివరింపఁబడినవి. ఆయన రాజ్య పాలనమునుఁ గూర్చి శాసనాదులు, వైదేశికు లగు సమకాలికులు రచించిన చరిత్రాత్మక గ్రంథముల వలనఁ దెలిసిన యంశములను ఆముక్త మాల్యద ధృవపఱచు చున్నది.

ఆముక్త మాల్యద యందలి చారిత్రికాంశములకు - మను చరిత్ర, పారిజాతాపహరణము, కృష్ణరాయ విజయము అను ప్రబంధములందును, రాయ వాచకము నందును, న్యూనిజ్ మొదలగు విదేశ

యాత్రికుల చరిత్రముల యందును ప్రమాణాంతరములు లభించు చున్నవి.

## దివ్య సూరి చరణ చామరము - దివ్య ప్రబంధ దీపిక

"భద్రం శఠారి ముఖ భక్త జనస్య తత్తత్
దివ్య ప్రబంధ వివహస్య చ దోష లేశాత్
ముక్తస్య దేశిక జనస్య త దుక్తి రాశే
రుజ్జీవనస్య జగతాం త హి తస్య వేద్యైః."

- (అభిరామవర కవి - ఉపదేశ రత్న మాల - శ్లోకము ౪)

ద్రావిడ దేశమున క్రీః శః దశమ శతాబ్దికి పూర్వమున, ద్వాదశాదిత్యుల వలె, భువనాద్భుత జనక మగు మహా వైభవముతో - ద్వాదశ దివ్య సూరులు (పన్నిద్దరాళ్వారులు) అవతరించిరి. తమ దివ్య ప్రబంధ గానము చేతను, పరమ పవిత్ర చరిత్ర చేతను, దేశమును భక్తి రస సాగరమున ముంచెత్తి, వివిధ వర్ణములకుఁ జెందిన ఈ మహాత్ములు - భగవత్సాక్షాత్కారము కొఱకై తహ తహ లాడి, మైమఱచి, ద్రావిడ భాషలో గానము చేసిన భగవన్మహిమాత్మక రచనలే 'దివ్య ప్రబంధము' లని విఖ్యాతి నందినవి. దాక్షిణాత్య వైష్ణవాలయములలో - ఈ ప్రబంధములను గానము చేయనిదే, వీరి శిలా విగ్రహములను ప్రతిష్ఠించి పూజింపనిదే దేవాలయములకు 'దివ్య స్థల' మను మహా గౌరవము రాఁజాలదు. దివ్య ప్రబంధములకు దాక్షిణాత్య శ్రీ వైష్ణవులు వేద ప్రామాణ్యము నొసఁగెదరు. దివ్య ప్రబంధములు ౨౪. వీనియందలి పాశురములు (ద్రావిడ పద్యములు) సంఖ్య ౪౦౦౦. అందువలననే వీనికి - 'నాలాయిర దివ్య ప్రబంధము' (చతుస్సాహస్రి) అను వ్యవహారము కల్గెను.

దివ్య ప్రబంధము లందలి నాలుగు వేల పద్యములలో - తిరుమంగై యాళ్వార్ గానము చేసిన (పద్య సంఖ్య 1361) ప్రబంధ షట్కము - గ్రంథ వైపుల్యమునుఁ బట్టి ప్రథమ గణ్యము. గ్రంథ విస్తృతినిఁ బట్టి ద్వితీయ స్థానము నమ్మాళ్వారులది. వీరు రచించిన ప్రబంధ చతుష్కము నందలి పద్య సంఖ్య 1296. తృతీయ స్థానము నలంకరించువారు పెరియాళ్వార్. వీరి ప్రబంధ యుగము నందలి పద్యములు 473. తురీయ స్థానము తిరుమళిశై యాళ్వారులకుఁ జెందును. వీరి ప్రబంధ యుగ్మము నందలి పాశురములు 216. గోదా దేవియే దివ్యసూరి మండలియం దేకైక మహిళా మణి. ఈమె గానము చేసిన ప్రబంధ ద్వయము నందలి పద్యములు 173. కులశేఖరాళ్వారు కృత ప్రబంధము నందలి పద్యములు 105. ఈ భక్తాగ్రణి రచించిన 'ముకుంద మాల' యను గీర్వాణ స్తుతి - విశ్వ విఖ్యాతమే. దివ్య సూరి చరితము నందలి మొదటి మువ్వురును (పొయిగ, పూదత్త, పేయాళ్వారులు) ఒక్కొక్క శతకమును 'అన్తాది' చమత్కారముతో నిర్మించిరి. 'అంతాతి' యనఁగా - పూర్వ పద్యము నందలి అంత్యాక్షరము, తరువాతి పద్యమునకు అద్యక్షర మగు విలక్షణ చమత్కారము. ఇట్టి అన్తాది కావ్యములు ద్రావిడ వాఙ్మయమున నెన్నియో కలవు. తొండరడిప్పొడియాళ్వారు రచించిన యేకైక ప్రబంధము నందలి పద్యములు 11. హరిజన కులమున నవతరించిన తిరుప్పాణాళ్వారు రచించిన ఒక్క ప్రబంధము నందలి పద్యములు పది. (మొత్తము కవులు 12 గురు ; ప్రబంధములు 24 ; పద్యములు 4000)

పై నాలాయిర దివ్య ప్రబంధమునకు మంగళప్రద మైన యుపసంహారము 'ప్రపన్న గాయత్రి' యని ప్రఖ్యాతి నందిన 'ఇరామానుశ నూత్తందాది' (108 ద్రావిడ పద్యములు). దీనిని రచించిన ప్రపన్న చూడామణి - భగవ ద్రామానుజుల శిష్యాగ్రణియు, శ్రీరంగ వాస్తవ్యులు నగు 'అముదనార్.' శ్రీవైష్ణవులు - ఈ ప్రపన్న

గాయత్రికి దివ్య ప్రబంధము కంటె నెక్కువ ప్రాముఖ్యము నొసఁగెదరు. ఇందలి విషయము రామానుజ శరణాగతి

దివ్య క్షేత్రములలో మహా క్షేత్రము లగు తిరుపతి, కాంచీపురము, శ్రీరంగము, తిరునారాయణ పురముల యందలి ఆలయములలో - నాలాయిరము పారాయణము చేయఁబడు చుండును. పుస్తకాపేక్ష లేకుండ నాలాయిరమును పఠింపఁగల పండితులు - 'నాలాయిరాధ్యాపకు' లని విశిష్ట గౌరవముతోఁ జూడఁబడుచుందురు. ద్రావిడ వేదమును సంస్కృత వేద సార మనియు, నమ్మాళ్వార్ రచించిన నాలుగు ప్రబంధములును చతుర్వేద సార మనియు, తిరుమంగై యాళ్వార్ నిర్మించిన ప్రబంధ షట్కము సంస్కృత వేదాంగము వలె ద్రావిడ వేద షడంగము లనియు ప్రాచీన సంప్రదాయ వేత్తలు వచించెదరు.

## ఆముక్తము భారతీయ విజ్ఞాన సంస్కృతులకు గని

ఆముక్తము హైందవ విజ్ఞాన సంస్కృతులకు గని ఇందు - వివిధ శాస్త్రీయ సంప్రదాయము లెన్నియో యెడ నెడఁ జూపఁబడి యున్నవి. ఈ ప్రబంధమును పఠించుచో - ఎన్నియో కవి సమయ విశేషములు, లవ లేశములతోఁడి వివిధాలంకార రహస్యములు మొద లగున వెన్నియో విశద మగును. జాతీయ సంప్రదాయాదిక సూచికయుం దిట్టి వెన్నియో సూచింపఁబడినవి.

సమ సమయపు సామాజిక స్వరూపము - ఈ ప్రబంధమున చిత్రింపఁబడినట్లు, ఏ యాంధ్ర ప్రబంధమునందును చిత్రింపఁబడలేదని విమర్శకాగ్రేసరుల యభిప్రాయము. రాయల ప్రబంధమును ఆమూల చూడముగాఁ బరిశీలించినచో, తాత్కాలిక సామాజిక వ్యవస్థ, ప్రజల ఆచార వ్యవహారములు, రాయ లనుసరించిన రాజనీతి విధానము మున్నగునవి విపులముగా బోధపడగలవు.

# కవి పండిత పరిచయము

## శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు



జననము 27 - 7 - 1930. జన్మ స్థానము సిద్దిపేట. జననీ జనకులు :- రామక్క, రంగాచార్యులు. అభ్యసించిన భాషలు - సంస్కృతము, తెలుగు, హిందీ. అభ్యసించినవిద్యలు-వ్యాకరణము, తర్కము కొంత వఱకు. విద్యాగురువులు - బ్రహ్మశ్రీ జయంతి భాస్కరశాస్త్రిగారు, శ్రీమాన్ అ చి. నరసింహాచార్యులుగారు, వంక విశ్వనాథశాస్త్రిగారు. డిగ్రీలు : బి. వొ. యల్.(తెలుగు) హోదాలు :- మెదక్ జిల్లా రచయితల సంఘమునకు, సిద్దిపేట - సాహితీ వికాస మండలికి అధ్యక్షులు. ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీలోను, ఆంధ్ర సారస్వత పరిషత్తు (హైదరాబాదు)లోను, మెదక్ జిల్లా గ్రంథాలయ సంస్థలోను సభ్యులు. బిరుదములు : విద్వత్కవి, కవి కోకిల. ఉద్యోగము : ప్రభుత్వోన్నత పాఠశాల (సిద్దిపేట లో - ప్రధానాంధ్ర పండితులు సమ్మానములు : 1-7-1979 లో - సిద్దిపేట పుర జనులచే ఘన సమ్మానము. 1980 లో - ఆంధ్ర ప్రదేశ్ రజతోత్సవ సందర్భమున హైదరాబాదు రవీంద్ర భారతిలో ప్రభుత్వము వారిచే ఘన సమ్మానము. ఇంకను అనేక మండలములలో - వివిధ సంస్థలచే సత్కారము. రచనలు : 1) ప్రబోధము 2) అమర జీవి బాపూజీ 3) కవితాంజలి 4) నవ మాలిక 5) తిక్కన 6) మణికి కింకిణి 7) వీర పూజ 8) శ్రీ వేంకటేశ్వర వినుతి 9) శ్రీ వేంకటేశ్వరో

దాహరణము 10) తెలుగు బాల నీతి 11) బాల గేయాలు 12) శ్రీ గోపాలకృష్ణ సుప్రభాతమ్ 13) కవితా కాహళి 14) ఆంధ్ర విష్ణువు 15) మంజీర నాదాలు 16) జీవన స్వరాలు 17) కవితా సిందూరం. ఇంకను బాలల కొఱకు వ్యాకరణము. విశేషాంశములు : పలు మారులు ఆకాశవాణి నుండి వీరి కవితలు, ప్రసంగములు ప్రసారితములు. భారతి, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర భూమి, ఆంధ్ర జ్యోతి, స్రవంతి, ఆంధ్ర ప్రదేశ్ మున్నగు వివిధ పత్రికలలో వీరి కవితలు, వ్యాసములు ప్రచురితములు. అనేక గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసిరి

## శ్రీమాన్ కొమాండూరు రామానుజాచార్యులు



కలం పేరు 'మధుశ్రీ'. జననము. 6-7-1928. జన్మస్థానము తక్కెళ్ళపాడు అగ్రహారము. అద్దంకి తాలూకా. ప్రకాశం జిల్లా. జననీ జనకులు : కంచమ్మ, శ్రీరంగాచార్యులు. విద్యాభ్యాసము : శ్రీ భావనారాయణస్వామి సంస్కృత కళాశాల - పొన్నూరు ; ప్రభుత్వ బోధనాభ్యసన కళాశాల-కర్నూలు. విద్యా గురువులు : శ్రీమాన్ అద్దంకి తాతాచార్యులవారు, బ్రహ్మశ్రీ - చల్లా సత్యనారాయణ శాస్త్రిగారు. అభ్యసించిన భాషలు : తెలుగు, సంస్కృతము, అరవము. అభ్యసించిన విద్యలు : సాహిత్య - అలంకార శాస్త్రములు. డిగ్రీలు : భాషాప్రవీణ, పండిత శిక్షణ, S. S. L. C. చేరు

దులు : విమర్శక విద్యా స్వాతంత్ర్య. ఉద్యోగము : కావలి, కందుకూరు Z. P. ఉన్నత పాఠశాలలో ఆంధ్ర ప్రధాన పండితులు. ప్రస్తుత నివాసము కందుకూరు. పదవులు : కందుకూరు తాలూకా రచయితల సంఘాధ్యక్షులు. సమ్మానములు : కందుకూరు తాలూకా రచయితల సంఘమువారు ఎట్టిన జయంతికి సన్మానము. నెల్లూరు, కనిగిరి, గుంటూరు పట్టణములలో గల వర్ధమాన సాహిత్య సంస్థలచే సమ్మానములు. అభిరుచులు: సాహిత్య సంస్థలచే సమ్మానములు. అభిరుచులు సాహిత్యము, చరిత్ర పరిశీలన, కావ్య పఠనము ఇత్యాదులు. రచనలు : 1) మధుర స్తుతి 2) మణి హారము 3) శ్రీ స్తుతి 4) ప్రకాశం జిల్లా సాహిత్య ప్రకాశిక 5) మాల్యాద్రి వైభవము 6) స్తోత్ర పారిజాతము 7) వెలుగొండస్వామి చరిత్ర 8) శ్రీశైలాద్దంకి విద్యా భూషణ సింగరాచార్యులవారి చరిత్ర 9) కవి సార్వభౌముడు 10) అజ్ఞాతాంధ్ర కవులు 11) శ్రీ వేంకటేశ్వర కరావలంబ స్తోత్రము 12) శ్రీ కోదండరామ సుప్రభాతము 13) కందుకూరు సీమ చరిత్ర మున్నగునవి. భారతి, ఆరాధన, సప్తగిరి, స్రవంతి, సమాలోచన వంటి అనేక పత్రికలలో పద్య గద్య విమర్శలు, తాళ పత్ర గ్రంథ సమీక్షలు ప్రచురితములు. విశేషాంశములు : అనేక సాహిత్య సదస్సులలో - సాహిత్య, ఆధ్యాత్మిక విషయములపై ఉపన్యాసములు. ప్రకృతము శ్రీనాథుని జన్మస్థాన విషయ పరిశోధన. ఆకాశవాణిలో ప్రసంగములు ప్రసారితములు.

## శ్రీమాన్ టి. కె. వి. యన్. సుదర్శనాచార్యులు.



వీరి పూర్తి పేరు - తిరుమల కుమార వేంకట నరసింహ సుదర్శనాచార్యులు. తెలుఁగు, సంస్కృతము, ప్రాకృతము, తమిళము, కన్నడము, మలయాళము, హిందీ, ఆంగ్లము మున్నగు భాషలను వీరు అభ్యసించిరి. 'సాహిత్య శిరోమణి' 'న్యాయ శిరోమణి', 'తర్క శిరోమణి', ఉభయ వేదాంత విద్వాన్' అను డిగ్రీలు పొందిరి. సంస్కృతాంధ్ర సాహిత్యము లందును, ద్రవిడ సాహిత్యము నందును, ఉభయ వేదాంతము లందున్ను ఉద్దండ పండితులుగా ప్రసిద్ధి వహించి, 'దర్శన సార్వభౌమ', 'మహోపాధ్యాయ' మున్నగు బిరుదులను సంపాదించిరి

వీరు వివిధ భాషలలో వివిధ శాస్త్ర విషయములపై అనేక గ్రంథములు రచించిరి. ఆళ్వారాచార్యులచే రచింపఁబడి, ప్రపన్న పారిజాతముగా పేరు గాంచిన 'నిత్యానుసంధానము'నకు - ప్రతిపద టీకా తాత్పర్యములతోఁబాటు, 'పరిమళోల్లాస' మను పేర, సులభ సుందర మగు శైలిలో - విపుల మగు నొక టీకను సుధా మధురముగ విరచించి, విఖ్యాతి గాంచిరి

వివిధ విషయములపై వివిధ భాషలలో వీరిచే వ్రాయఁబడిన వ్యాసము లనేకములు ప్రముఖ పత్రికలలో ప్రకటింపఁబడినవి. అనేక గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసి, ఆ గ్రంథముల విలువలను ఇను

డింపఁ జేసిరి. అనేక మహా సభలలో వివిధ విషయములపై మహోపన్యాసము లొసంగి, ఘన సన్మానము లందిరి.

ప్రతి సంవత్సరము తిరుమల తిరుపతి దేవస్థానముల పక్షమున వేసవిలో నాల్గు వారములపాటు జరుగు శ్రీ వేంకటేశ్వర హిందూ వేదాంత వసంత పాఠశాలను దాదాపు మూడు దశాబ్దముల వరకు ఎంతో సమర్థముగ నిర్వహించి, శ్లాఘింపఁబడిరి.

శ్రీమాన్ సుదర్శనాచార్యులవారు తిరుపతిలో – శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనాలయమున 1953 ప్రాంతములో – శ్రీ వైష్ణవ గ్రంథమాలా సహాయ సంపాదకులుగా – సంపాదకులుగా పదవుల నధిష్ఠించి, సంప్రదాయ రహస్యముల నెన్నింటినో వెలువరించి, శ్రీ వైష్ణవ లోకమునకు మహోపకారము గావించిరి.

తిరుపతి – శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య విద్యాలయమున వీరు వివిధ శాఖలలో చిర కాలము ఉపన్యాసకులుగా పని చేసి, విద్యార్థుల కనేకులకు విద్యా దానము గావించి విజ్ఞాన భిక్ష పెట్టిరి. కడకు – ఆ సంస్కృత కళాశాలకు అధ్యక్షులై, కొంత కాలము ఆ పదవిని నిర్వహించి, అనంతరము ఉద్యోగ విరమణ గావించి, మరి కొన్నాళ్ళకు ఇటీవలనే పరమపదించిరి.

ఈ మహనీయులు మా అభ్యర్థనను మన్నించి, 'శ్రీ రామానుజ కీర్తి కౌముదికి' – 'శ్రీ నమ్మాళ్వారుల వైభవము', 'శ్రీమద్రామానుజులు శ్రీవేంకటాచలము' అను రెండు అమూల్య వ్యాసములను ప్రసాదించి, మా కృతజ్ఞతకు పాత్రులైరి. ఆ రెంటిలో మొదటి వ్యాసము చరిత కళ యగు ఈ గ్రంథమునందే ప్రకటింపఁబడినది. ఇక రెండవ వ్యాసము మున్ముందు రానున్న కళలలో నొక భాగమున ప్రచురితము కాఁగలదు.

## శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు



జననము : రుధిరోద్గారి భాద్రపద శుద్ధ పంచమి (1-7-1924) జన్మ స్థానము : కృష్ణాజిల్లా - జగ్గయ్యపేట. ప్రస్తుత నివాసము: విజయవాడ. జననీ జనకులు : వెంకట రమణమ్మ, తిరుమల నల్లాన్ చక్రవర్తి సంపత్కుమార జగన్నాథ తిరువేంకటాచార్యులు గారు. అభ్యసించిన భాషలు : సంస్కృతాంధ్ర ద్రావిడములు. అభ్యసించిన విద్యలు : తర్కము, వ్యాకరణము, అలంకార శాస్త్రము, సంగీత శాస్త్రము, ద్రావిడ సంప్రదాయ గ్రంథములు. విద్యా గురువులు : భాషా శాస్త్రములు తండ్రిగారి వద్ద, సంగీతము ; శ్రీమాన్ చిలకమర్తి కందాళ కేశవాచార్యులుగారివద్దను, 'గాయక సార్వభౌమ' కీ॥ శే॥ పారుపల్లి రామకృష్ణయ్యగారి వద్దను. బిరుదు : సంగీత సాహిత్య కళానిధి. ఉద్యోగము : విజయవాడ ఆకాశవాణి నిలయ సంగీత విద్వాంసులు ప్రధానము - వాయులీన వాదనము. సన్మానములు : 9-8-1972 తేదీన విజయవాడ ప్రభుత్వ సంగీత కళాశాలలో - త్యాగరాజు పంచరత్నములపై మహోపన్యాస మీయగా, ఆలిండియా రేడియో ఢిల్లీ స్టేషన్ రిటైర్డు డైరెక్టర్ S. N. మూర్తిగారి అధ్యక్షతన, అప్పటి సంగీత కళాశాల ప్రిన్సిపాల్ - నూకల చిన సత్యనారాయణగారి పర్యవేక్షణమున ఘన సన్మానము. మఱి యొకటి; 5-11-1978 తేదీన విజయవాడలో - కనకదుర్గ గాన కళా సమితి, సద్గురు సంగీత సభ, త్యాగరాజ గాన కళా సమితి, గాన ప్రియ సభలు, ఆ సభలలోని విద్యార్థులు - శ్రీ పాటిబండ్ల సుందరరావుగారి

అధ్యక్షతన, ద్వారం S. N. మూర్తిగారి సభాధిపత్యమున, ద్వారం వెంకటస్వామి నాయుడుగారి కుమారుడు - అప్పటి సంగీత కళాశాల ప్రిన్సిపాల్ అయిన ద్వారం భావనారాయణ గారి పర్యవేక్షణలో ఘన సన్మానము. రచనలు ; ఆంధ్ర పద్య కావ్యములు - ముద్రితములు : త్యాగరాజ చరిత్రము, నారాయణ శతకము, బిడాల మోక్షము మొదలగునవి. అముద్రితములు ; క్షేమేంద్రుని కళా విలాసమునకు అనువాదము. వేదాంత దేశికుల యతిరాజ సప్తతి కనువాదము. సంస్కృత కావ్యములు - ముద్రితములు . భూ ప్రశంస, చంద్ర కళా షోడశీ ద్వయి, నౌకా చరితమ్, రామాయణ కథాయాం వ్యపదేశాః మొదలైనవి. అముద్రితములు ; సింహావలోకనమ్. హరికథ - ముద్రితము : నరసింహ తాండవము. అముద్రితములు ; శ్రీనివాస కల్యాణము, రామకృష్ణ పరమహంస, వరదాభ్యుదయము మొదలయినవి. యక్షగానము; విప్రనారాయణ (వేదాంతం సత్యనారాయణశర్మ గారు ప్రదర్శించునది.) విశేషాంశములు ; నాట్య కళ, గాన కళ మొదలగు పెక్కు సంచికలలో అమూల్య సంగీత సాహిత్య వ్యాసములు వ్రాయబడినవి. త్యాగరాజు, రామ దాసు, గోదాదేవి మొదలగు హరి కథా కాలక్షేపములు గావించి పండిత ప్రశంసలు పొందబడినవి. ఫిడేలు వాద్యముతో ఆసేతు శీతాచలము పెద్ద పెద్ద సభలలో పక్క వాద్యము, సోలోలు జరిగినవి. ఆంధ్ర ప్రదేశ్ సంగీత అకాడమీ పక్షమున పెక్కుచోట్ల సంగీతమునుగూర్చి ఉపన్యాసము లొసంగిరి. 1982 డిసెంబరులో - మద్రాసు మ్యూజిక్ అకాడమీలో - సంగీతోత్సవమున, విద్వ త్పరిషత్తులో - సంగీతమును గురించి తమిళములో ప్రసంగించి, శ్రోతల మన్ననలను బడసి, ఘనముగా సత్కరింపబడిరి.

## శ్రీమాను ఈయుణ్ణి వేంకట వీరరాఘవాచార్యులు



జననము 1902. విజయ నగరమున గల మహారాజా వారి కళాశాలలో బి.ఏ. అభ్యసించిరి. 1933లో - సంస్కృతములో ఎం ఏ. పట్టమును పొందిరి. కాకినాడలో గల ప్రభుత్వ పి. ఆర్. కళాశాలలో ప్రధానోపన్యాసకులుగా, భారతీయ భాషా శాఖాధ్యక్షులుగా, 1933 నుండి 1955 వఱకు పని చేసిరి. అటు పిమ్మట అచటినుండి రాజమండ్రిలో గల ప్రభుత్వ కళాశాలకు బదిలీ అయి, 1959 వఱకు పని చేసి, అనంతరము ఉద్యోగ విరమణ చేసిరి. అటు పిమ్మట, కొవ్వూరు సంస్కృత కళాశాలలో సంస్కృతోపన్యాసకులుగా మూడు సంవత్సరములు పని చేసిరి 1958లో 'విద్యా రత్న' బిరుద విభూషితులైరి భారత దేశమునందలి విశ్వ విద్యాలయములలో జరిగిన అఖిల భారత ప్రాచ్య భాషా సమ్మేళనములలో - వరుసగా పదునైదు సభలలో పాల్గొని, వివిధ విషయములపై తాము రచించిన సాహిత్య వ్యాసములను చదివి, వినిపించి, సమర్పించి, ఘన సన్మానములను పొందిరి. ఆ వ్యాసము లన్నియు ముద్రణ భాగ్యమును పొంది, వీరి బహు పాండిత్యమును వేనోళ్ళ చాటుచున్నవి. వీరి సాహిత్య వ్యాసము లనేకములు 'భారతి' పత్రికలో ప్రచురింపబడి, వీరికి పారితోషికములను సంపాదించి యిచ్చినవి. శ్రీ వైష్ణవ పత్రిక, రామకృష్ణ ప్రభ, ప్రపన్న సుధ వంటి ధార్మిక మాస పత్రికలలో వీరి వ్యాసములు పెక్కు ప్రకటింపబడినవి. వీరు 1984 అక్టోబరులో - అనంతరపురమున అస్తమించిరి.

# సవరణ పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 6 | 10 | దెత్య | దైత్య |
| ,, | 18 | స్పశిత | స్పృశిత |
| 8 | 17 | వంది పదా | వందిత పదా |
| 22 | 15 | మండనార | మండనాయ |
| 24 | 9 | తిరుళిప్పు | లిరుప్పుళి |
| 49 | 1[illegible] | శ్రైషైః | శ్రైష్మైః |
| 63 | 23 | హ ద్వీథిం | హృద్వీథిం |
| 72 | 7 | ఘ్మతాచి | ఘృతాచి |
| 73 | 8 | లిల | లీలా |
| 84 | 7 | భిందిపాలముః ల్ | భిందిపాలముల్ |
| 85 | 82 | నిర్జితమై పరు | నిర్జితమై |
| 88 | 7 | రాజ్యానుర క్తి | రాజ్యానుర క్తి |
| 93 | 10 | భీత లెల్ల | లెల్ల భీత |
| 95 | 10 | డక | డయ్యు |
| 96 | 7 | పదం మచున్ | పదమంచున్ |
| 98 | 10 | నాళ్ళు | నాళ్ళు, |
| 101 | 23 | నిక్ర | నిక |
| 110 | 19 | చలిర్ప | దలిర్ప |
| 112 | 16 | విశాఖా | విశిఖా |
| 114 | 12 | సంశిత | సంశ్రిత |
| 121 | 2 | ప్రబంధము లో | ప్రబంధములలో |
| 123 | 12 | రన | రస |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 124 | 6 | తావేలో | తాళేలో |
| ,, | 10 | తావేలో | తాళేలో |
| ,, | 20 | లకలో | లంకలో |
| 126 | 20 | పులకింత | పులకిత |
| 127 | 15 | నీవెట్లు | నీవు |
| 128 | 12 | రచినలలో | రచనలలో |
| ,, | 15 | జేతల | విజేతల |
| ,, | 23 | మాటలలొ | మాటలలో |
| 133 | 9 | యాల్వారులు | యాళ్వారులు |
| 137 | 7 | కృష | కృష్ణ |
| ,, | 8 | లిల | లీల |
| ,, | 17 | విషువు | విష్ణువు |
| ,, | 19 | సుతించు | స్తుతించు |
| 139 | 16 | విషువు | విష్ణువు |
| ,, | 16 | విషువే | విష్ణువే |
| ,, | 17 | కృషుడుగా | కృష్ణుడుగా |
| ,, | 17 | విషువు | విష్ణువు |
| 140 | 14 | జ ్మంచు | జన్మించు |
| 141 | 7 | ఉచ్చై రముతో | ఉచ్చైస్స్వరముతో |
| 144 | 2 | శటాసుర వధ | శకటాసుర వధ |
| 145 | 12 | రము | హరము |
| ,, | 12 | వే , | వేసి, |
| 146 | 9 | కంకర కణములను | కర కంకణములను |
| 148 | 10 | య తయు | యంతయు |
| ,, | 22 | మితుడు | మిత్రుడు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 148 | 22 | పొ దెను | పొందెను. |
| 155 | 1 | లందఱుసు | లందఱును |
| ,, | 13 | కృషుని | కృష్ణుని |
| 155 | 19 | సౌదర్య | సౌందర్య |
| ,, | ,, | వర్ణిచు | వర్ణించు |
| ,, | 21 | కృషుని | కృష్ణుని |
| ,, | 24 | కృషుని | కృష్ణుని |
| 157 | 5 | పీచున్నావు | పీగుచున్నావు |
| ,, | 6 | కృషుని | కృష్ణుని |
| 158 | 15 | కృషు | కృష్ణు |
| 159 | 7 | కృషుని | కృష్ణుని |
| 161 | 19 | కీతించిరి | కీర్తించిరి. |
| 162 | 16 | మగుచు | మగుచు. |
| ,, | 22 | కృషుని | కృష్ణుని |
| 164 | ,, | కృషుని | కృష్ణుని |
| 171 | 7 | గంధము | గ్రంథము |
| ,, | 12 | గుటి చి | గుటించి |
| 172 | 13 | స్తుతి చు | స్తుతించు |
| ,, | 19 | వృషభము ను | వృషభములను |
| 175 | 14 | ౮ - ౯0 | ౮ - ౯ |
| ,, | 18 | ౭ - 1 | ౭ - 10 |
| ,, | 23 | కృషదేవ | కృష్ణదేవ |
| 176 | 15 | 7 - 86 | 75 - 86 |
| ,, | 19 | ౨౩ - ౭౮ | ౩౯ - ౭౮ |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 178 | 13 | విషుచిత్తులు | విష్ణుచిత్తులు |
| 179 | 14 | 2 [illegible] | [illegible]9 |
| 180 | 6 | విషుని | విష్ణుని |
| 183 | 11 | తనయము | తనయను |
| 184 | 23 | కేపల | కేవల |
| 185 | 11 | మెనను | మైనను |
| ,, | 13 | గద్యః | గద్య |
| ,, | 27 | నెషధీయ | నైషధీయ |
| 187 | 2 | నుండె, | నుండె |
| 192 | 1 | కౌము | కౌముది |
| 198 | 23 | భువనాద్భుత | భువనాద్భుత |
| ,, | 26 | విషుచిత్తుడు | విష్ణుచిత్తుడు |
| 207 | 16 | సఖ్యలను | సంఖ్యలను |
| 211 | 19 | సస్కృత | సంస్కృత |
| 218 | 14 | విజూన | విజ్ఞాన |
| i | 23 | మణికి కింకిణి | మణికింకిణి |
| iii | 10 | అభిరుదులు | —— |
| iv | 10 | వేదాంద | వేదాంత |
| v | 4 | వేంకటేశ్వర | వేంకటేశ్వర |
| vii | 10 | అముద్రిదములు | అముద్రితములు |
| ,, | 20 | లొానంగిరి. | లొానంగిరి. |
| viii | 1 | శ్రీమాను | శ్రీమాన్ |
| ,, | ,, | ఈయణ్ణి | ఈయ. ణ్ణి |
| ,, | ,, | విద్యాళత్న | విద్యారత్న |
| ,, | ,, | బహు | బహుముఖ |

శ్రీ రామానుజ కీర్తి కౌముది
ఐదవ భాగములో
రానున్న రచనలు
*

శ్రీ వేంకటేశ స్తుతి
శ్రీ వంగవోలు ఆది శేష శాస్త్రి

ఆళ్వారుల విశిష్ట భావములు
శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ కులశేఖర వైభవము
శ్రీమాన్ చిలకపాటి విజయ రాఘవాచార్యులు

ముకుంద మాల
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు

వైజయంతీ వైభవము
శ్రీమాన్ కొమాండూరు గోపాలకృష్ణమాచార్యులు

శ్రీ నాథ మునుల వైభవము
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

శ్రీ యామునాచార్య వైభవము
శ్రీమాన్ కె. వి. వి. యల్. నరసింహాచార్యులు

విష్ణు చిత్తీయము - వైష్ణవ మతము
డాక్టర్ : దివాకర్ల వేంకటావధాని

